# మంచుబొమ్మ

## ❖ కథలు ❖

పెద్దిభొట్ల సుబ్బరామయ్య


విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్
విజ్ఞాన భవన్, బ్యాంక్ స్ట్రీట్, అబిడ్స్,
హైదరాబాద్ - 500 001.

**MANCHU BOMMA STORIES** - *by Peddibotla Subbaramaiah*

ప్రచురణ నెం. . 2350/61

ప్రతులు . 1000

ప్రథమ ముద్రణ . ఆగష్టు, 2005



టైటిల్ డిజైన్ రాజా

**వెల : రూ॥ 50**

ప్రతులకు **విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్**
విజ్ఞాన భవన్, అబిడ్స్, హైదరాబాద్ - 500 001.
E-mail. visalaandhraph@yahoo.com
**విశాలాంధ్ర బుక్ హౌస్**
(అబిడ్స్, సుల్తాన్‌బజార్) హైదరాబాద్,
విజయవాడ, గుంటూరు, అనంతపురం,
తిరుపతి, విశాఖపట్నం, హన్మకొండ, కాకినాడ.



ముద్రణ : **శ్రీ కళాంజలి గ్రాఫిక్స్**, హైదరాబాదు.

# అంకితం



ఏకొద్దిపాటి సూచనలేకుండా

అకస్మాత్తుగా నిశ్శబ్దంగా నాజీవితంలో నుంచి

"మాయమై" పోయిన

నా జీవిత సహచరి

'హమిని'కి...

# కృతజ్ఞతలు

దాదాపు ఈ కథలన్నింటిన్నీ అమిత శ్రమకోర్చి
సమకూర్చి పెట్టిన శ్రీకాకుళం 'కథానిలయం' పెద్దలు,
శ్రీ కాళీపట్నం రామారావు మేష్టారికి రచయిత కృతజ్ఞుడు...

ఈ కథలన్నీ ఆంధ్రప్రభ సచిత్రవార పత్రిక, స్వాతి మాస పత్రిక,
స్వాతి వార పత్రిక, ఇండియా టుడే పక్ష పత్రికలలో ప్రచురింపబడ్డాయి.
ఆయా సంపాదకులకు రచయిత కృతజ్ఞుడు...

# ఇందులో....

# మంచుబొమ్మ

నీలవేణి కళ్లు చికిలించుకుని చూసింది. ఎదురుగా ఎండదెబ్బ తగిలినవాడిలా నడుచుకుంటూ వస్తున్నాడు గురువులు.

నీలవేణి ఆత్రుతతో ఉన్నట్లుండి లేవబోతే మోకాలిదగ్గర కలుక్కుమని విపరీతమైన బాధ కలిగింది. తప్పనిసరై మళ్లీ కూలబడిపోయింది. క్షణాలలోనే నొప్పి తగ్గింది. నిట్టూరుస్తూ గురువులువంక ప్రశ్నార్థకంగా చూసింది.

గురువులు అవతల ఎవరిపక్కనో కూర్చుని "ఏమి ఫరవాలేదు. అంతా సజావుగానే ఉంది. తర్వాత మాట్లాడుతాన్లెమ్మని" సైగ చేశాడు.

ఎదురుగా చిత్రీకరణకు అంతా సిద్ధంగానే ఉంది. కానీ సూర్యభగవానుడి దయ ఇంకా పూర్తిగా రావడంలేదు.

ఉదయం పదిగంటలు దాటినా పలుచని మబ్బులు కొద్దిగా కమ్ముకుని ఉండి సూర్యుడు దోబూచులాడుతున్నాడు. ఎండ ఎక్కువగా లేదు కానీ, చెమటలు దిగ్గారిపోతున్నాయి. ఇదేమి వాతావరణమో మరి!

నీలవేణి అలా చూస్తూ కూర్చున్నది. పక్కనే తనవంటివారు పదిహేనుమంది డాన్సర్లున్నారు. అందరూ దుప్పట్లో మరేవేవో కప్పుకుని ఉన్నారు. లోపల మాత్రం మొలచుట్టూ ఒక బిగుతైన డ్రాయరు, గుండెల చుట్టూ ఒక పీలిక ఉన్నాయి. మరోవైపు అలాగే పదిహేనుమంది మగ డాన్సర్లు. కొందరు ఆవులిస్తూ, మరికొందరు బీడీలు కాలుస్తూ, మరికొందరు అటూ ఇటూ పచార్లు చేస్తూనూ ఉన్నారు.

"ఎప్పటికి తెములుతుందో?" అన్నది నీలవేణి పక్కనే కూర్చుని ఉన్న షీలా.

"ప్చ్!" అన్నది నీలవేణి. అంతకన్నా ఆమె దగ్గర మాత్రం జవాబు ఏమున్నది గనక?

ఈ షీలా మొన్నమొన్నటివరకూ నిక్షేపంగా కాలేజీ చదువు వెలగబెట్టింది. డిగ్రీ ఏదో థర్డుక్లాసుది చేతికొచ్చింది కానీ, అది వొరగబెట్టిందేమీ లేదు. ఇంటి దగ్గర తండ్రి అవిటివాడు. మంచంలో ఉన్నాడు. తన తర్వాత ముగ్గురు చెల్లెళ్లు, ఆపైన మరో చిన్నపిల్లవాడూ. ఇన్ని పొట్టలు నిండాలి. అందువల్ల తనకు తటస్థపడిన రిక్షావాడితో సంబంధం పెట్టుకుని రహస్యంగా లాడ్జీల వెంట తిరిగి నాలుగు డబ్బులు సంపాదించి ఇంట్లో ఇస్తూ ఉండేది. ముందు అందరూ, తల్లి కూడా పిల్ల ఎక్కడో చిన్న ఉద్యోగం చేస్తున్నదని అనుకున్నారు. కానీ అలా ఎన్నాళ్లో సాగలేదు. ఇంట్లో తెలిసిన తర్వాత కూడా కొంప ఏమీ మునగలేదు. ఎవరూ అరిచి గోల చెయ్యనూలేదు. దానితో ఆ అమ్మాయి తెగించింది. అప్పుడప్పుడూ పట్టుబడినా

పోలీసులు తమకు కావలసిన రెండు విధాలుగానూ 'కృతార్థు'లై వాదిలేస్తూ ఉండేవారు. ఇప్పుడు ఆమెకిది కొత్త జీవితం. రెండిందాలా జరిగిపోతున్నది. పాత రిక్షావాడు పోయాడు. ఇప్పుడు మంచి నిర్వాహకుడొకడు దొరికాడు. వాడు గుట్టు చప్పుడు కాకుండా బేరాలు ఏర్పాటు చేస్తూ ఉంటాడు. అలా జీవితం ఫరావాలేదు ఉభయతారకంగా ఉంది.

ఎదురుగా కనుచూపుమేర అంతా ఆరుబయట సెట్టింగ్. నేల అంతా పచ్చపచ్చగా తివాచీ పరిచినట్టు కన్నుల పండువగా ఉంది. దానిమధ్య ఆరీను ఆకారంలో వందల కిలోల రోజా పూలు తెచ్చి పరిచారు. అదుగో, ఆ పక్కనే పెద్ద గొడుగు కింద అనవసరంగా అలసట నటిస్తున్న కథానాయిక, ఆ పక్కనే కుర్చీలో జారగిలపడి కునుకు తీస్తున్న కథానాయకుడూ – కాస్సేపటిలో ఆ రోజాపూలమీద ముందు గంతులు వేసీ, ఆ తర్వాత ఒకరి మీద ఒకరు పడి దొర్లుతూనూ యుగళగీతం పాడతారన్న మాట. అప్పుడు తాము పదిహేనుమందీ. ఆ మగ డాన్సర్లు పదిహేనుమందీ వెనక చిత్ర విచిత్ర విన్యాసాలు చేస్తూ ఎగురుతారన్నమాట. నిన్ననేమో అక్కడే వందలాది బత్తాయికాయలు తెచ్చి పోసి వాటిమీదా హీరో హీరోయిన్లచేత పరుగులు పెట్టించీ, దొర్లించీ ఒక చరణం చిత్రీకరించారు. మొన్ననేమో వందలాది స్టీలు, ఇత్తడి బిందెలు తెప్పించి రకరకాలుగా అమర్చి వాటి మధ్య మరో చరణం చిత్రీకరించారు. అంతకుముందురోజు వందల కిలోల టమోటో పళ్లు తెప్పించి ఒక ఆవరణలో గుట్టలు గుట్టలుగా పోసి కృత్రిమ వర్షం కురిపించి ఆ వానలో నాయికా నాయకులచేత అడ్డమైన గంతులూ వేయించి ఇంకో చరణం చిత్రీకరించారు. మధ్యలో నాయికా నాయకుల వివిధ అనంగరంగ విన్యాసాలు... కెమెరా ఎక్కువభాగం నాయిక నాభీదేశంమీదనే ఉండటం మామూలే. ఈ దృశ్యాలన్నిటికీ వెనక తామూ, మగ డాన్సర్లూ రకరకాలుగా వికృత వేషాలు ధరించి ఎగరడం తప్పనిసరి.

హీరో ఇప్పుడు లేచి ఆవులించి ఎవరో ఏదో అంటే నవ్వుతున్నాడు. అతడు తెలుగు మాట్లాడితే భయంకరంగా ఉంటుంది. 'శోభా' అనడానికి బదులు 'షోబా' అనీ, 'విషయం' అనడానికి బదులు 'విషం' అనీ అంటాడు. అయినా ఫరవాలేదు. మరొకరెవరో అతనికి డబ్బింగ్ చెబుతూ ఉంటారు కాబట్టి, చూసే జనానికి ఆ రహస్యం తెలీదు కాబట్టి, తెలిసినా పట్టించుకోరు కాబట్టి ఫరవా ఏమీలేదు. పాట అయితే సరేసరి, ఎవరో ప్లేబాక్ పాడిపెడతారు కాబట్టి సమస్యే లేదు. విగ్రహం మాత్రం మహా దర్జాగా, దృఢంగా ఉంటుంది. అది చాలు అందరికీ.... ఎందుకయినా మంచిదని అతడు చాలా తక్కువగా మాట్లాడుతుంటాడు. అందువల్ల అతనికి అంతర్ముఖుడనీ, మితభాషి అని మంచి పేరు కూడా వచ్చింది.

ఇక నాయిక ఉత్తరాది అమ్మాయి. మాంచి పెద్దరసం మామిడిపండులాగుంటుంది. చాలా వినయశీలి. ఏ భాషా రాకపోయినా కష్టం

లేదామెకు. పాడేవారు పాడిపెడతారు. మాట్లాడేవారు మాట్లాడిపెడతారు. ఏం చెయ్యాలో చెప్పే దిగ్దర్శకులున్నారు. ఆమె వారెలా చెబితే అలా చేస్తూ ఉంటుందంతే!

షీలా ఏదోదో మాట్లాడి "ఇలాంటివి జనం చూస్తున్నారా?" అని అడిగింది.

"అదేమిటి? అట్లా అడుగుతావు? విరగబడి చూస్తున్నారు. సినిమాలే కాదు, సినిమాహాళ్ళ బయట ఉన్న పెద్ద పెద్ద పోస్టర్లను కూడా జనం గుంపులుగా నిలబడి చొంగలు కార్చుకుంటూ చూస్తున్నారు. వాళ్లు చూడకపోతే వీళ్లు కోట్లకు కోట్లు కుమ్మరించి వీటిని ఎందుకు తీస్తారు పిచ్చిదానా!" అన్నది నీలవేణి.

నీలవేణి ఈసారి లేచి నిలబడి గురువులువంక చూసి చెయ్యి ఊపింది. అతడు నెమ్మదిగా నడుచుకుంటూ అటూ ఇటూ చూసి లేచి ఇవతలికి వచ్చాడు.

నీలవేణి నిట్టూరుస్తూ వచ్చి ఇవతల ఒక చెట్టు కిందికి చేరింది. మనసులో దిగులు... చింత... గురువులు రాగానే ఆదుర్దాగా "ఏమైంది? ఫోను చేశారా? ఎట్లా ఉంది చిన్నికి?" అని అడిగింది.

గురువులు నెమ్మదిగా "ఏమీ ఫరవాలేదు. అమ్మడికి జొరం తగ్గింది. పక్క ఇంటి మామి మందులు తెచ్చి వేసింది. డాక్టరు ఇంజక్షన్ కూడా ఇచ్చాడు. నువ్వేమీ కంగారు పడకు. అన్నట్టు రాత్రికి ఒక బేరం మాట్లాడాను. లాడ్జిలో... అయిదువందలు.. పూరా నైట్... తర్వాత మనం పొద్దున్నే వెళ్లిపోవచ్చు!" అన్నాడు.

నీలవేణి మనసు తేలికపడింది. ఇవాళ్టితో ఈ పాట చిత్రీకరణ అయిపోతే ఇక వారంరోజులు స్వేచ్ఛ! వారం తర్వాత మరో పిక్చరులో మళ్లీ ఒక డాన్స్ సీక్వెన్స్ ఉంది. తన సంతానం ఒక్కగానొక్క ఆడపిల్ల మెదడు జబ్బుతో అవిటిదై పుట్టడం ఖర్మ కాక ఏమిటి? ఆనాడు తన కడుపులో ఈ పిండం పడటానికి కారణం ఎవడో తెలీదు. ఎవడో అస్తు బెస్తు అసమర్థపు అనారోగ్యపు వెధవై ఉంటాడు. లేకపోతే ఈ పిల్ల ఇలా పుట్టడం ఏమిటి? పేగు బంధం గట్టిది కావడం వల్ల తాను చాలామందివలె శిశువును మురికి కాల్వలో పారేయలేకపోయింది.

ఇప్పుడు నీలవేణి మనసు ఎంతో తేలికపడ్డట్టయింది. చేయెత్తి షీలాను రమ్మని సైగ చేసి పిలిచింది. షీలా రాగానే "అట్లా చాటుకు పోయొద్దాం, రా!" అన్నది ముందుకు నడుస్తూ.

షీలాది నవ్వు ముఖం. నవ్వుతూనే వచ్చింది. ఇద్దరూ బయలుదేరి కొన్ని గజాలు దూరంగా చెట్ల చాటుకు వెళ్లిపోయారు.

మరి రెండు నిముషాల్లో ఇవతలికి వచ్చి చూస్తే అక్కడ హడావుడి మొదలైనట్టున్నది. మైకులో గొంతులు మోగుతున్నాయి. అప్పటికి ట్యూన్‌కు అనుకూలంగా చేసిన వ్యాయామం, వేసిన గంతులు చాలవన్నట్టు మళ్లీ మొదలెట్టారు. ఈ ఇద్దరూ వెళ్లి తమతమ స్థానాల్లో కుదురుకుని వినిపించే ట్యూన్‌కు అనుగుణంగా కదలడం మొదలెట్టారు. 'లగ్గాయెత్తు' అనే పాట విని వినీ ఇప్పటికి విసుగుపుట్టింది. వినగా వినగా ఎలాగో వినిపిస్తున్న ఆ పాట ఏ పాతిక ముప్పైసార్లో విని ఉంటారందరూ.

నీలవేణి ఒగర్చుతూ నిలబడింది. ఎవరో బొంబాయి వారు కట్టిన వేగప్రధానమైన ట్యూన్ అది. నీలవేణికి ఆయాసం వచ్చింది. ముఖం చెమటతో నిండిపోయింది. తుండుతో ముఖం రుద్దుకుంటూ నిలబడిపోయింది. ఈ మధ్య ఎందుకో అలసటగా ఉంటున్నది. నాలుగడుగులు వేస్తే ఆయాసం... ఈ రోజుల్లో అందరికీ గుండెబాధలే. తనకూ అదేనేమో! ఇంత శరీరంలోనూ నరనరానికీ రక్తం సరఫరా చేసే గుండె అనబడే ఈ పిడికిలి అంత యంత్రం ఎంతకాలమని సజావుగా ఆడుతుంది? పైగా తెల్లవారి మనం చేస్తున్నవన్నీ ఆయుక్షీణపు పనులే కదా? మంచి తిండి లేదు. అవసరమైన వ్యాయామం లేదు. ఎంతయినా వ్యభిచారం వ్యాయామంతో సమానమవుతుందా? తానేమీ చిన్నపిల్ల కాదు ఇలా అడ్డమైన గంతులూ వేయడానికి. నలభై పైగా వొస్తున్నాయి ఏళ్లు నెత్తిమీదకి. ఇప్పుడైనా జాగ్రత్తగా ఉండటం మేలు. కానీ తనకు సాగదు మరి. పైగా తన పాపిష్టి డబ్బు నిలిచి చావదు కదా? ఎంత జాగ్రత్తగా ఉన్నా, చేతివేళ్ల మధ్యనుంచి జారిపోతూనే ఉంటుంది. ఇవాళ ఉన్నట్టుండి పోతే సజావుగా కట్టెను దాటించేందుకు సరిపడా డబ్బు అయినా ఉండిచావదు ఇంట్లో. ఇలా ఎగిరి ఎగిరి సంపాదించిన సొమ్ములో, పదిమంది దగ్గరా పడుకుని సంపాదించిన సొమ్ములో, రకరకాల సప్లయర్సు, పోలీసులు మొదలుకుని రిక్షావాళ్ల వరకు, రౌడీ వెధవల వరకూ అందరూ వాటాదారులే.

"నీకొచ్చిన కల గురించే ఆలోచిస్తున్నానింతసేపూ!" అన్నది షీలా.

"అట్లా కల వొస్తే తొరలో పెద్ద మొత్తం డబ్బు వస్తుందని అర్థం!"

నీలవేణి కళ్లు పెద్దవైనాయి. "నిజంగానా?" అని అడిగింది దగ్గుతూ.

"నిజంగానే. మా అమ్మ చెబుతూ ఉండేది!" అన్నది షీలా.

నిన్న రాత్రి పడుకుంటే పట్టకపట్టక నిద్రపడితే అందులో కల. రోడ్డు... రోడ్డుమీద అంతటా రూపాయి బిళ్లలు... ఏరుకుంటున్న కొద్దీ దొరుకుతూనే ఉన్నాయి.

ఇప్పుడు అంతా సిద్ధమై సూర్యభగవానుడనుగ్రహించి, దర్శకులకు, నాయికా నాయకులకు మూడ్ కుదరి మాటిమాటికీ మేకప్ సర్దుకుని ఆ కాస్త ముక్కా చిత్రీకరణ అయ్యేసరికి అందరికీ ఆయాసం వచ్చింది. తిరిగి బసకు చేరి నాలుగు మెతుకులు తినేసరికి సూర్యుడు పడమటికి దిగిపోతున్నాడు.

నీలవేణి కాస్సేపు పడుకుని లేచి ముస్తాబయింది. ఇంతకుముందు గురువులు తెచ్చిన వర్తమానం వినగానే... అదే చిన్నికి ఆరోగ్యం కుదుటపడిందని... మనసు తేలికపడింది. ఆ పసిపిల్ల కోసమే తాను బతుకుతున్నది... దాని అంగవైకల్యం మనసును నిరంతరం కాల్చివేస్తున్నా 'ఏదో ప్రాణాలతో ఉందిలే' అనే భావనతోనే తాను నెట్టుకొస్తున్నది. చదువా లేదు. ముఖానికి మంచికో చెడుకో రంగు అలవాటయిపోయింది. ముందు నాటకాల్లో ఆ తర్వాత ఇలా సినిమాల్లో .... ఏమాత్రమూ గుర్తింపు లేకపోయినా ఈమధ్య పరిస్థితి ఫరవాలేదు.

తనబోటి ఎక్స్ట్రాలు నాలుగు గంతులు వేస్తే డబ్బులు వస్తూనే ఉన్నాయి. గ్రాసవాసోదైన్యం మాత్రం లేదు. మగవాళ్లయితే కాస్త నదురుగా ఒడ్డూ పొడుగూ ఉంటే చాలు ఫైటింగ్స్లో చాన్సులొస్తూనే ఉన్నాయి.

చీకటి పడగానే గురువులు ఒక నలభై ఏళ్ల ఖరీదైన వ్యక్తిని వెంటబెట్టుకుని వచ్చాడు. అతన్ని లోపలికి తీసుకువచ్చి కాసేపు ఏవో కబుర్లు చెబుతూ కూర్చుని తర్వాత బయటకు వెళ్లిపోయాడు.

నీలవేణి అతన్ని శ్రద్ధగా చూసింది. వీడెవడో బాగా డబ్బున్న పక్షి. ఒక సినిమా హాలు, ఇంకేదో ఫాక్టరీ ఉన్నాయట... ఖరీదైన సిగరెట్లు ఊదేస్తున్నాడు. తాత తండ్రులు నానాగడ్డీ కరిచి కూడబెట్టిన సంపదను ఈ సిగరెట్లలా కొన్నాళ్లలో ఊదేయడం ఖాయం. వ్రేళ్లకు ఖరీదైన ఉంగరాలు, మెడలో జెర్రిపోతులాంటి బంగారు గొలుసు (అది కనిపించేట్టు చొక్కాపై గుండీలు రెండు మూడు విప్పి ఉంచుకున్నాడు కూడా)లతో మహా ఆర్భాటంగా ఉన్నాడు. రేపు అందరితో 'రాత్రల్లా సినిమా నటితో గడిపా'నని గొప్పగా చెప్పుకుంటాడు కాబోలు.

నీలవేణి లేచి పెద్ద లైటు తీసింది. చిన్న బల్బు మందంగా వెలుగుతున్నది. అతడు లేచి చొక్కా విప్పి ఒళ్లు విరుచుకున్నాడు.

తెల్లవారిన తర్వాత గురువులు బయటనుంచి కాలింగ్బెల్ మోగిస్తుండగా మెలకువ వచ్చింది. విటుడు ఎప్పుడో లేచి వెళ్లిపోయాడు.

గురువులు ముఖం అదోరకంగా ఉంది. ఆమెను తొందరపెడుతూ "కానివ్వు... కానివ్వు... బండి టైమైంది!" అంటూ లోపలికి వచ్చాడు. డబ్బు నీలవేణికి అందించాడు.

గురువులువంక చూసి నీలవేణి "ఏమిటి సంగతి? ఎందుకంత తొందర?" అని అడిగింది.

"ఏం లేదు... బండి టైమైందని..." అంటూ నసిగాడు గురువులు.

నీలవేణి లేచి స్నానం చేసి తయారై బయలుదేరింది. రాత్రి విటుడు మొట్టమొదట మంచం తిరగవెయ్యమన్నంతగా హడావుడి అయితే చేశాడు కానీ, అంతలోనే చల్లారిన అప్పడంలా చప్పబడిపోయి రొప్పుతూ వెనువెంటనే గురకపెడుతూ ఘరీ నిద్రకు పడ్డాడు దుంగలాగా.

మధ్యాహ్నం మూడుగంటల వేళకు ఇంటికి చేరుకున్నారిద్దరూ. వీధి మలుపు తిరుగుతూ ఉండగానే గురువులు నీలవేణి భుజంమీద చెయ్యివేసి, "అమ్మదూ! కాస్త సంబాళించుకో!" అన్నాడు లోగొంతుకతో.

"ఏమిటేమిటి?" అన్నది ఆదుర్దాగా నీలవేణి.

ఆటో ఇంటిముందు ఆగింది.

చిన్న ఆవరణలో పెద్ద మంచుగడ్డమీద... పక్కన ఇద్దరు ముగ్గురు ఆడవాళ్లు...

నీలవేణి ఆకులా వణికిపోతూ, తూలిపోతూ నడిచింది.

గురువులు నెమ్మదిగా “నిన్న పక్క ఇంటివాళ్లకు ఫోను చేశాను అర్ధరాత్రి తర్వాత... అప్పుడు నీకెలా చెప్పను? ఎట్లాగూ తెల్లవారుతూనే బయలుదేరుతుంటిమి...” అంటున్నాడు.

నీలవేణికేమీ వినపడలేదు. కళ్లముందు అంతా చీకటి... గడ్డకట్టిన చీకటి... కూలబడింది.

గుండెల లోపలి జలధార ఉబికి ఉబికి వచ్చింది...!

# దయ్యం పట్టినవాడు

"ఏమండీ! ఫోను మీకే" అన్నది లోపలి నుంచి శారద. "ఎవరు?" అని అడిగాడు అనంతరామయ్య ముందు గదిలో పడక కుర్చీలో కూర్చుని ఉండి.

"ఆయనే మీ ఫ్రెండు. కొళందవేలు."

అనంతరామయ్య విసుగుతో, "ఇంట్లో లేనని చెప్పు. ఫోన్ పెట్టేసెయ్" అన్నాడు.

ఆమె ఆర్యపోయి ఉండాలి. మూడు రోజుల నుంచీ ఇదే తంతు. లోగొంతుకతో, "లేరండీ ఇంట్లో. ఇప్పుడే బయటికి వెళ్ళారు" అంటున్నది అనిష్టంగా.

తరువాత ముందు గదిలోకి వచ్చి భర్త ఎదురుగా నిలబడి, "ఏమిటి సంగతి?" అని అడిగింది.

"ఏముందీ? ఏమీ లేదు" అన్నాడు అనంతరామయ్య విరక్తిగా.

"కాదు. ఏదో ఉంది. మీరేదో దాస్తున్నారు. మొన్న ఆయన మన ఇంటికి వొస్తే అప్పటికప్పుడు మీరు చెప్పులు తొడుక్కుని ఏదో పనున్నట్టు మాటాపలుకూ లేకుండా, పలకరించనయినా పలకరించకుండా వెళ్ళిపోయారు. ఆయన చిన్నబుచ్చుకుని ఏమిటిలా వెళ్ళిపోయాడని నన్ను అడిగాడు. నేనేమి చెప్పను? నాకేమీ తెలియదన్నాను. ఫోను చేస్తే ఇంట్లో లేరని చెప్పిస్తున్నారు. ఏమిటి కథ? ఇప్పుడాయనకు జ్వరంట."

"సరేలే. సోది కట్టిపెట్టి కాస్త కాఫీ తెచ్చి ఇవ్వు." అనంతరామయ్య కంఠంలో గొప్ప చిరాకు.

శారద ఒక్క క్షణం భర్త ముఖంలోకి చూసి అంతలోనే ఏమనుకున్నదో ఏమో మరేమీ మాట్లాడకుండా లోపలికి వెళ్ళిపోయింది.

అనంతరామయ్య కుర్చీలో వెనక్కు వాలి కూర్చుని ఈల వేద్దామని ప్రయత్నించాడు. ఘోరమైన అపస్వరం పలికింది. విసుగనిపించింది.

శారద వచ్చింది. కాఫీ తాగుతూ ఉండగా, "చెప్పండి" అన్నది.

"ఏం చెప్పాలి?"

"అదే మీరు కొళందవేలుగారిని ఈ నాలుగైదు రోజులుగా ఎందుకు తప్పించుకు తిరుగుతున్నారు?"

"ఏమీ లేదు. తప్పించుకు తిరగడమేమిటి? అయినా, అడ్డమైనవాడితోనూ గంటల తరబడి కబుర్లు చెబుతూ, గ్యాసు కొడుతూ కాలక్షేపం చెయ్యడమేమిటి? తెలివి తక్కువ కాకపోతే!"

"ఆఁహాఁ, అలాగా" అన్నది కొంచెం ఎగతాళిగా శారద. "ఆయన ఒక్క రోజు కనబడకపోతే, 'వేలు రాలేదే, వేలు రాలేదే' అని కాలుగాలిన పిల్లిలా తిరిగేవారు మీరు. ఉన్నట్టుండి ఈ వాలకం ఏమిటి? ఆయన పేరు చెబితేనే మండిపడుతున్నారెందుకు? ఇంతలో ఏమయింది?"

అనంతరామయ్యకు ఒళ్లు మండింది. "చాల్లే ఊరుకో. వెర్రి ధోరణి ఆపు. అతన్ని చూడకపోతే ఉండలేకపోవడం ఏమిటి? నాన్సెన్స్. అతనేమి నా అమ్మ వెనకవాడా, అబ్బ వెనకవాడా? లేకపోతే తోడబుట్టినవాడా? ఏదో కలిసి ఒకచోట పని చేశామంతే." శారద లేచి భర్త వంక విచిత్రంగా చూస్తూ లోపలికి వెళ్ళిపోయింది. అనంతరామయ్య ఎదురుగా ఉన్న టీపాయ్ మీద మునివేళ్ళతో తబలా వాయించేందుకు కాసేపు ప్రయత్నించాడు. ఆ తరువాత టీపాయ్ కింద అరలో నుంచి ఒక లావుపాటి పుస్తకం తెరిచి అందులో నుంచి ఒక అరరావు కాగితం ఇవతలకి తీశాడు. ఒకవైపు ఏదో టైపు చేసి ఉంది. రెండోవైపు చూశాడు. తెల్లటి కాగితం మీద ఏదో రాత. అర్థంకాని రాత. అనంతరామయ్య అలా ఆ కాగితంలోకి చూస్తూ ఉండిపోయాడు.

బహుశా ఇవాళ్టికి నాలుగు రోజుల కిందట, ఉదయం వేళ అనంతరామయ్య పడక కుర్చీలో చేతులు తల కింద పెట్టుకుని హాయిగా కూర్చుని ఉన్నాడు.

టీపాయ్‌కి అవతలివైపు కొళందవేలు మరో కుర్చీలో, ఉండి ఉండి చేతి వేళ్ళు విరుచుకుంటూ, అప్పుడప్పుడూ ఏమీ తోచక ఆవులిస్తూ... ఇద్దరూ రైల్వేలో పనిచేసినవారే.

అప్పటికి దాదాపు రెండు గంటల ముందునుంచీ కబుర్లు, ఒకటే కబుర్లు. వాళ్ళిద్దరూ కలుసుకుంటే కబుర్లకు కొదవ ఉండదు. కొళందవేలు వయసు అరవై రెండు. రిటైరై హాయిగానే కొడుకుతోపాటు ఉంటున్నాడు. భార్య పోయి కొద్ది నెలలే అయింది. అనంతరామయ్య రిటైరై సంవత్సరం కావస్తున్నది. వారి కబుర్లలో సర్వ ప్రపంచమూ ఎదర్కొంటున్న సమస్యలన్నీ చోటు చేసుకునేవి. ఎన్నో విషయాల్లో అభిప్రాయ భేదాలున్నా ఏ ఒక్కరూ పట్టించుకునేవారు కాదు. మాటల్లో పడితే కాలగమనమే తెలిసేది కాదు. ఇహ లోపలి నుంచి భోజనానికి పిలుపు వస్తేనే లేవడం. అప్పుడిక కొళందవేలు లేచి 'వెళ్ళొస్తా' అని బయలుదేరేవాడు.

ఇప్పుడు అనంతరామయ్య చేతిలోని కాగితంలోకి మళ్ళీ చూశాడు. విచిత్రంగా అసహనం పెరిగిపోతున్నది. ఆ కాగితంలో రాసి ఉన్నదేమిటో అతనికి తెలియదు. బహుశా ఎవరికీ తెలియదని కూడా అతని ఉద్దేశం.

ఆనాడు అంతవరకూ మాటలు మాటలు మాటలు. ఇక మాట్లాడేందుకేమీ లేక మౌనంగా కూర్చుని ఉన్నారిద్దరూ. అప్పుడు అనంతరామయ్య లేచి "మరొక చిన్న డోసు కాఫీ సేవిద్దాం" అంటూ లోపలికి వెళ్ళాడు. ఫ్లాస్కులో నుంచి కాఫీ

రెండు స్టీలు గ్లాసులలో ఒంపుకుని ఫ్లాస్కు మూత బిగించి యథా స్థానంలో ఉంచి ముందు గదిలోకి వచ్చాడు. కాఫీ టీపాయ్ మీద ఉంచాడు.

అప్పటికే కొళందవేలు టీపాయ్ కింది నుంచి ఒక అరఠావు కాగితం ఇవతలికి తీసినట్టున్నాడు. దాని మీద ఏవో మాటలు రాశాడు.

కాఫీ తాగుతూ అనంతరామయ్య, "ఏమిటో రాసినట్టున్నావే. కవిత్వమా?" అన్నాడు తమాషాగా.

కొళందవేలు కాగితాన్ని అనంతరామయ్యకు అందించాడు. అదేమిటో అనంతరామయ్యకు అర్థం కాలేదు. "ఏమిటది?" అని అడిగాడు.

కొళందవేలు ఒకచోట వేలు ఉంచి చూపుతూ, "ఈ మాటకు అర్థం తేనె" అన్నాడు.

"మరి, దాని అర్థం ఏమిటి" అని అడిగాడు అనంతరామయ్య మరో మాట చూపుతూ.

"ఇదా? ఇది పంచదార."

అనంతరామయ్యకు చిరాకనిపించింది.

"మరి ఇది. దీని అర్థం ఏమిటి" అన్నాడు కింది మాట చూపుతూ.

"దాని అర్థం చెరకుగడ అని."

అనంతరామయ్యకు కోపం వచ్చింది.

ఆ తర్వాత కొళందవేలు ఆ కింద చూపిస్తూ "ఇది ఒక వాక్యం" అన్నాడు.

"ఆహాఁ! అలాగా? దాని అర్థం ఏమిటో" అన్నాడు కోపంగానే.

"దాని అర్థమా? మా అనంతరామయ్య మనసు తేనె లాగా, పంచదారలాగా, చెరకుగడలాగా తీయన అని."

"ఆఁహాఁ! అలాగేం? ఇదే భాష" అని అన్నాడు అనంతరామయ్య ఎగతాళిగా.

"అది పోర్చుగీసు భాష" అని అన్నాడు కొళందవేలు.

"అయితే, మరో వాక్యం చెబుతాను రాస్తావా ఆ భాషలో" అన్నాడు అనంతరామయ్య లోలోపల ఉడికిపోతూ.

"ఊఁ! చెప్పు. అలాగే రాస్తాను" అంటూ కలం అందుకున్నాడు కొళందవేలు. అలా అంటూ కాగితం కూడా అందుకుని టీపాయ్ మీద పరుచుకున్నాడు.

"ఊఁ చెప్పు" అన్నాడు మళ్ళీ.

అనంతరామయ్యకు ఒళ్ళు మండిపోతున్నది. కోపంగా, "రాయి. నా మిత్రుడు అనంతరామయ్య వట్టి మూర్ఖుడు. అజ్ఞాని. మందమతి."

కొళందవేలు నవ్వుతూ, "అలా రాయడానికి అభ్యంతరం ఏముంటుంది? ఉన్నమాటేగా అది" అంటూ రాశాడు.

"సరిగ్గా నేను చెప్పినట్లు రాశావా?"

"సరిగ్గా నువ్వు చెప్పినట్టే రాశాను."

అనంతరామయ్య విసురుగా లేచాడు. కోపం బుసబుసమని పొంగి వచ్చింది. ఉద్రేకంతో ఊగిపోతూ "చాల్లే నిర్వాకం. ఇట్లా వెర్రివాణ్ణి చెయ్యడానికి నేనే దొరికానా నీకు? పోర్చుగీసు భాషట. నాన్సెన్స్" అని అరిచాడు.

కొళందవేలు అప్పటికీ నవ్వుతూ, "ఎందుకంత కోపం?" అని నసుగుతూ లేచి, "వెళ్ళొస్తా. మళ్ళీ రేపు కలుద్దాం" అంటూ వెళ్ళిపోయాడు.

అనంతరామయ్య విలువెల్లా వణికిపోతూ నిలబడ్డాడు. ఆ తరువాత లోపలి నుంచి పిలుపు వస్తే అకారణంగా ఆవిడ మీద కేకలు పెట్టాడు. లోపలికి వెళ్ళి ఆవిడ మీద విరుచుకుపడ్డాడు. "నీ దృష్టిలో కూడా నేను పెద్ద ఫూల్ నైనట్టున్నానే" అని అరిచాడు. ఆ తరువాత ముందు గదిలోకి వచ్చి ఆ కాగితాన్ని తీసుకొని మాటిమాటికీ దాన్నే చూస్తూ కాసేపు నిలబడి దాన్ని చించి ముక్కలు ముక్కలు చేద్దామని అనుకుని కూడా మళ్ళీ ఎందుకో ఆ ప్రయత్నం విరమించి, దాన్ని మడిచి టీపాయ్ కింద లావాటి పుస్తకంలో ఉంచేశాడు. తరువాత చాలాసేపు కణతలు నొక్కుకుంటూ కుర్చీలో కూర్చుండిపోయాడు. లోపలి నుంచి కోపం పొంగు లావాలా ఉబికి వస్తుంటే మనిషి నిలవెల్లా అసహనంతో కదిలిపోయాడు. ఆ సాయంకాలమే మళ్ళీ కొళందవేలు వచ్చాడు. "అనంతా! షికారుకు వెళదాం" అంటూ.

అనంతరామయ్యకు అతన్ని చూడగానే ఒంటినిండా తేళ్ళూ, జెర్రులూ పాకినట్టయింది. గుండెల మీద వందల కొద్దీ బొద్దింకలూ, తొండలూ, గొంగళి పురుగులూ, కుమ్మరి పురుగులూ, ఇంకా రకరకాలైన అనామక క్షుద్ర నీచ కీటకాలు షికారు చేస్తున్నట్టనిపించింది.

చాలా విసురుగా, "నాకు వేరే పనుంది. వెళ్ళాలి" అంటూ చెప్పులు తొడుక్కుని హడావిడిగా విసవిసా నడిచి వెళ్ళిపోయాడు. కొళందవేలు ముఖం గుర్తుకు వస్తే చాలు – ఆ ముఖం తప్ప మరొకటేదీ గుర్తుకు రావడం లేదు కూడా – అసహ్యం పుట్టింది. అదేమి చిత్రమో, ఇన్ని ముఖాలుండగా, ఇన్ని దృశ్యాలుండగా, లోకంలో ఇన్ని పదార్థాలుండగా ఆనాటి నుంచీ ఆ ముఖమే కళ్ళ ముందు నిరంతరం ప్రత్యక్షం కావడం చిత్రమే. పైగా 'ఉన్నమాటేగా అది' అన్నమాట చెవుల్లో మారుమోగుతున్నది మళ్ళీ మళ్ళీ. అనంతరామయ్య ఉండి ఉండి పళ్ళు కొరుక్కుంటున్నాడు. 'అంతరంగంలో తన పట్ల ఏహ్యాభావం, కసి, అమిత్రభావం ఉన్న వాడితో కలిసి ఎలా స్నేహం చేశానా' అని మథనపడిపోతూ లోలోపల ఉడికిపోయాడు.

మరునాడు సాయంవేళ రైలుపట్టాలు దాటి, ఊరు దాటి పొలాల మధ్యకు శుభ్రమైన గాలి కోసం వెళితే ఆ తోవలో రిటైర్డ్ రైల్వే డ్రయివర్ బెంజమన్ కనిపించాడు. అతడు ఆంగ్లో ఇండియన్. మంచివాడు.

"ఎట్లా ఉన్నారు బ్రదర్" అని పలకరించాడు ఆప్యాయంగా.

"ఇదుగో ఇట్లా ఉన్నాం" అన్నాడు అనంతరామయ్య.

"ఒక్కరే వచ్చారే ఇవ్వాళ. వేలు సార్ ఊళ్ళో లేడా?"

అనంతరామయ్య ముఖం వివర్ణమైంది. "లేకేం? నిక్షేపంగా ఉన్నాడు రాయిలాగా" అని జవాబు చెప్పి ఊరుకున్నాడు. ఒక్క క్షణం ఆగి, "ఏమిటో బ్రదర్. ఈ లోకం చెడ్డది" అన్నాడు బరువుగా.

బెంజమన్ ఆశ్చర్యంగా చూశాడు.

"అంతే. ఈ లోకంలో ఎవర్నీ నమ్మకూడదు ప్రతివాడూ పైకి కనిపించేదొక టైపు, లోపల మరొక టైపు. ఎవడి మనసులో ఏముంటుందో తెలుసుకోలేక బోల్తాపడుతూ ఉంటాము. మోసపోతూ ఉంటాము. కానీ, ఎల్లకాలం అలా కుదరదు. ఎప్పుడో ఒకప్పుడు తెలియకుండానే నిజరూపాలు బైటపడిపోతూ ఉంటాయి. అప్పుడిక మన కళ్ళు తెరుపుడు పడతాయి. ఇక రిపెంటెన్స్ మిగులుతుంది మనకు. అంతే."

అనంతరామయ్య ధోరణి బెంజమన్‌కు మింగుడుపడలేదు. అయినా, అతడేమీ మాట్లాడలేదు. చిత్రంగా చూసి అంతలోనే చూపులు తిప్పుకుని వీధి మలుపు తిరిగి. తన దారిన తాను క్వార్టర్స్‌కు వెళ్ళిపోయాడు.

ఇంటికి వెళ్ళగానే శారద ఎదురు వచ్చి "కొళందవేలు కొడుకు ఫోన్ చేశాడు" అన్నది.

"ఏమిటి సంగతి" అంటూ కనుబొమలు ముడిచాడు అనంతరామయ్య.

"ఆయనకు జ్వరం బాగా ఎక్కువైందిట. డాక్టర్లు ఆస్పత్రిలో ఉంచమన్నార్ట" అంటూ మొదలు పెట్టింది.

అనంతరామయ్య 'ఊఁ' కొడుతూనే దుస్తులు మార్చుకొని, పెరటిలోకి వెళ్ళి కాళ్ళు కడుక్కుని వచ్చాడు. "సర్లే సర్లే. భోజనం వడ్డించు" అన్నాడు కొంచెం విసుగుతో.

మరునాడు ఉదయం పదిగంటలు దాటిన తరువాత హాల్లో కూర్చుని ఉన్నాడు అనంతరామయ్య. చేతిలో దినపత్రిక ఊరికే తిరగేస్తున్నాడు. అందులో ఏముందో అసలు బుర్రకెక్కడం లేదు. మనసు ఎటెటో అనంత శూన్యావరణాల్లో విచక్షణా రహితంగా చక్కర్లు కొడుతున్నది.

కాలింగ్ బెల్ కొడుతున్నారెవరో. లేచి వెళ్ళి వీధి తలుపు తీస్తే రామారావు. లోపలికి రాకుండానే వీధిలో నిలబడి, "మీకు తెలియదా ఏమిటి?" అన్నాడు.

"ఏమిటేమిటి?" అన్నాడు అనంతరామయ్య.

"కొళందవేలు పోయాడు. రాత్రి పదిగంట లప్పుడనుకుంటాను. ఇప్పుడే మహాప్రస్థానం వాహనం వచ్చింది. రావలసిన వాళ్ళెవరూ లేరనుకుంటాను. క్రిమేషన్‌కు తీసుకెళ్ళిపోయారు. క్వార్టర్సు కదా, ఎక్కువసేపు ఉంచడానికి వీల్లేదు మరి." ఈ మాటలంటూనే, ఆయన వార్త అందించిన తృప్తితో కాబోలు, విసవిసా నడుస్తూ వెళ్ళిపోయాడు.

అనంతరామయ్య వీధి తలుపు విసురుగా వేశాడు. తరువాత పెద్ద పెద్ద అంగలతో లోపలికి వచ్చి పడక కుర్చీలో పడుకుని గుండెలమీద చేతులుంచుకుని కళ్ళు మూసుకున్నాడు.

మరునాడు సాయంకాలం ఇంటికి వచ్చిన అతిథి లెక్కకు ఒక్కరే గానీ పదిమంది పెట్టు. అంతా హడావిడి, అంతా కోలాహలం. ఆమె ఇరవై అయిదేళ్ళ అమ్మాయి. శారదకు వరసకు చిన్న చెల్లెలవుతుంది. ఎక్కడో ఉత్తరాదిన ఆమెకూ, ఆమె భర్తగారికీ పెద్దపెద్ద ఉద్యోగాలు. ఆమె ఉన్నట్టుండి ముందు గదిలో టీపాయ్ కింద ఉన్న పుస్తకం ఎందుకు తీసిందోమరి, ఆ తరువాత అందులోని ఆ కాగితం ఎందుకు తీసిందో మరి. ఆ కాగితాన్ని చేతబట్టుకుని వచ్చి 'ఎవరు రాశారిది?' అని అడిగింది.

"ఒక ఫ్రెండ్‌లే. ఏవో పిచ్చి రాతలు రాశాడు. నన్ను ఫూల్‌ను చేయడానికి" అన్నాడు అనంతరామయ్య.

"పైగా అది పోర్చుగీసు భాషట. ఏదో పిచ్చిపిచ్చిగా వాగాడు" అని కూడా కలిపాడు.

ఆమె "అవునిది పోర్చుగీసు భాషే" అన్నది ముందు.

"ఇదుగో ఈ మాటకు తేనె అనీ, దీనికి పంచదార అనీ, దీనికి చెరుకుగడ అనీ, ఈ కింది మాటలకు 'మా అనంతరాముడి మనసు తేనెవలె, పంచదారవలె, చెరుకుగడ వలె తీపి' అనీ అర్థం" అంటూ కింద మాటలు చూసి విరగబడి నవ్వింది.

అనంతరామయ్య ఉన్నట్టుండి లేచి నిలబడ్డాడు. కాళ్ళు వణికాయి. వణుకుతున్న కంఠంతో "నిజంగానా? నిజంగానేనా? పోర్చుగీసు భాషేనా అది? అవునా" అన్నాడు. తరువాత శక్తి అంతా హరించుకుపోయినవాడివలె తూలుకుంటూ వెళ్ళి మంచంలో పడిపోయాడు. కళ్ళ ముందు దట్టమైన చీకటి తెరలు దిగినట్టయింది.

# పీట

సన్యాసయ్య కుడి చేతిలో పీటతో నడుస్తున్నాడు. రెండో చేతిలో ఒక సంచి... అందులో ఒక పాత ధోవతి. మరో పొట్టి చేతుల చొక్కా... ఒక కొత్త ఖరీదైన ధోవతుల చాపు... ఇత్తడి చెంబు కొత్తది... ఇన్ని ఉన్నాయి.

అవిటి కాలితో, దీర్ఘకాలిక కీళ్ళనొప్పుల వ్యాధితో ఊరు విడిచి ఇంత దూరం నడిచాక రోడ్డు పక్కన ఆగి, చేతిలోని బరువులు కింద ఉంచి ఉస్సురని నిట్టూర్చాడు. తర్వాత వొదులుగా ఉన్న కళ్ళజోడు – పాతది – ఒక చేత్తో తీసి పట్టుకుని, మాసిన ఉత్తరీయంతో ముఖం తుడుచుకుని మళ్ళీ కళ్ళజోడు ముఖానికి తగిలించుకున్నాడు.

పక్కనే ఒక టీ దుకాణం. జనం పలుచగా ఉన్నారు. చుట్టూ ఇళ్ళూ, ఊరూ లేకపోయినా బస్సు ఆగేది ఇక్కడే కాబట్టి ఆ టీ స్టాలు నడుస్తున్నది.

సన్యాసయ్య అక్కడి రాతిబల్లమీద కూర్చుని "బస్సిక్కడేనా ఆగేది?" అని అడిగాడు.

మాసిన చెక్కబల్ల వెనుక ఎత్తుపళ్ళవాడొకడు నోరార నవ్వుతూ "ఇక్కణ్ణే... ఇంకా టైముండాది" అని చెప్పాడు. ఎక్కడివాడో... మాతృభాష తెలుగు కాదని తెలుస్తూనే ఉంది.

సన్యాసయ్య పీటను రాతి బల్లకు అనించి ఉంచి "శుభ్రంగా... ఒక టీ ఇవ్వు" అన్నాడు. లోలోపల 'ఇప్పుడే కదా, అరగంట కాలేదు, చిక్కటి కాఫీ రెండు గ్లాసులు తాగి బయలుదేరాను' అనుకున్నాడు. నవ్వొచ్చింది కూడా. అయితే, 'ఈ అరగంట సేపూ నడుస్తూనే ఉన్నాను కదా' అని సంజాయిషీ ఇచ్చుకున్నాడు.

జేబులో నుంచి బీడీకట్ట ఇవతలికి తీసి, రెండు చేతుల మధ్య ఉంచుకుని మృదువుగా నలిపాడు. ఆ తర్వాత ఒక బీడీని ఎంచుకుని ఇవతలికి తీశాడు. మిగిలిన బీడీలకట్ట జేబులో పడేసుకున్నాడు. 'చురచుర'మంటూ బీడీ వెలిగింది. పొగ పీల్చి వొదులుతూ ఎదురుగా కనుపించినంతమేర చూపు సారించాడు.

ఏమి సీమ ఇది!

కనుచూపు మేర అంతా, ఎంత దూరమైనా వెళ్ళు, కన్నుల పండుగగా... అందంగా... పచ్చపచ్చగా... భగవంతుడు భూమిని సృష్టించి, పని పూర్తి అయ్యాక తన దగ్గర మిగిలిపోయిన ముదురాకుపచ్చ రంగు అంతా ఇక్కడ కుమ్మరించి ఉండాలి. టీ అందుకుని చప్పరిస్తూ ఉండగా తన ఊరూ, ఉద్యోగమూ, ఇల్లూ, పెళ్ళాం పిల్లలూ గుర్తుకు వచ్చారు. 'ఆ భగవంతుడు మరీ పక్షపాతి కాకపోతే, కొంచెం అకుపచ్చ రంగు అటువైపు కూడా ఒలికించి ఉండకూడదా' అనిపించింది,

అక్కడ మైళ్ళ కొద్దీ దూరం ప్రయాణం చెయ్.... ఎక్కడా ఆకుపచ్చ రంగే కనిపించదు. కొండలు, గుట్టలూ తప్ప పైరుపచ్చలు నాస్తి. నువ్వులూ ఆముదాలూ వంటి మెట్ట పంటలే. అన్నీ తుపానులే తప్ప మామూలు వర్షపాతం ఉండదు. పిచ్చి పొదలు తప్ప ఫలవృక్షాలు ఉండవు. వేడిగాడ్పులే తప్ప మందమలయానిలాలు ఉండవు. టీ తాగడం ముగించి సన్యాసయ్య దుకాణంవాడికి చిల్లర ఇచ్చాడు. అప్పుడు టీ దుకాణంవాడి చూపు పీట మీద పడింది.

"కొన్నారా సామీ?" అని అడిగాడు.

సన్యాసయ్య తల అడ్డంగా ఒకసారి, నిలువుగా మరోసారీ ఊపి ఊరుకున్నాడు.

తర్వాత "బస్సెంతసేపట్లో వొస్తుంది?" అని అడిగాడు.

"రావాలి...రావాలి" అన్నాడు టీ దుకాణం వాడు.

వారం రోజుల కిందట వచ్చింది ఉత్తరం. మామూలు కార్డు, ఒక ఫోటో, ఫలానావారు... ఫలానా తేదీ - స్వర్గస్థులైనారు... ఫలానా తేదీ నుంచి కర్మలు వగైరా... కావున తెలియజేయడమైనది. ఇదీ ఉత్తరం.

దాన్ని తొందరపడి చింపేయకుండా ఇంటికి తీసుకువెళ్ళి భార్యకు చెబితే, ఆమె గుర్తు చేసుకుని మరిన్ని వివరాలు చెప్పుకొచ్చింది. పోయినవాడు తనకు వరుసకు అన్నగారవుతాడు. ఎలాగో ఏమో తెలీదు... మొత్తానికి ఏదో బాదరాయణ సంబంధం... 'పోవాలా, వొద్దా' అని చర్చ.

"ఇప్పుడెవరు పోతారు అంత దూరం? చార్జీలు పెట్టుకుని, అసలే నెలాఖరు రోజుల్లో, ఎందుకొచ్చిన తంటా" అని తాను...

"కాదండీ... వెళ్ళకపోతే తప్పంటారు పెద్దవాళ్ళు... శుభకార్యానికైనా ఫరవాలేదుకాని, ఇలాంటివాటికి వెళ్ళకపోతే మంచిది కాదు. వెళ్ళి ఆనాటికి నలుగురు అయినవాళ్ళతోపాటు మీరూ కాసిని నువ్వులూ నీళ్ళూ వొదిలి రండి" అని భార్య.

"పైగా ఆ స్వర్గస్థుడు మహా సంపన్నుడు... బాగా కలిగిన కుటుంబం. అంతేగాక, ఏదో పెద్ద ఉద్యోగం చేసి బాగా సంపాయించాట్ట. మీ అమ్మగారు చెబుతూ ఉండేవారు. అంతేకాదు, ఇంతగా గుర్తుంచుకుని ఉత్తరం రాశారు. అదీ విశేషమే." ఇలా సాగింది ఆమె ధోరణి.

సన్యాసయ్య వెంటనే ఏమీ తేల్చుకోలేదు. భార్య కూడా ఆ తర్వాత ఒత్తిడి చేయలేదు. కానీ, సన్యాసయ్యకు లోలోపల 'వెళ్ళాల'నే కోరిక సారవంతమైన మనోక్షేత్రంలో చిన్న విత్తనంలాగా పడి క్రమక్రమంగా మొలిచి, ఏపుగా పెరిగి, అంతలోనే మహావృక్షం అయింది. ఎంతో ఆలోచించి, ఎన్నో లెక్కలు కట్టుకుని ఒక నిర్ణయానికి వచ్చాడు. అన్నిటికన్నా ముఖ్యం - 'మనవాళ్ళందర్నీ చూసినట్టు ఉంటుంది'. తరువాత ఈ గానుగెద్దు జీవితం, తాను పనిచేసే షాపు, ఆ చాకిరీ, ఈ

న్యూసెన్సుకు దూరంగా మూడు, నాలుగు రోజులపాటు హాయిగా గడిపినట్టూ ఉంటుంది. అన్నిటికీ మించినది తన జిహ్వాచాపల్యం.

ఆ తర్వాత అతనింకేమీ ఆలోచించలేదు. యజమాని దగ్గిరికి వెళ్ళి ఆ ఉత్తరం చూపించి 'పోయినవాడు' తనకెంత ముఖ్యుడో, అప్పుడో, ఈ సందర్భంలో వెళ్ళకపోతే ఎంత అప్రతిష్ఠో వివరించాడు. యజమాని అంతా విని "నాకు తెలుసులేవయ్యా. ఇటువంటప్పుడు వెళ్ళకపోతే మహా తప్పు..." అన్న తర్వాత ఆయన దగ్గరే 'ఖర్చులక'ని డబ్బు తీసుకుని ప్రయాణమై వచ్చాడు.

మూడు రోజులు... సరిగ్గా చెప్పాలంటే మూడున్నర రోజులు... ఎలా గడిచిపోయాయి? బహుదూర ప్రయాణం చేసి వచ్చిన తనను ఇక్కడివారు ఎలా ఆదరించారు? మృతుడి ముఖమైనా ఎన్నడూ చూసి ఎరుగని తనను ఎంత ప్రముఖంగా చూశారు?

అసలు ఇది చావులాగుందా? పండుగలాగుంది... ఏమి సందడి! ఏమి కోలాహలం! అన్నిటికీమించి ఏమి తిండి! రోజూ ఉదయమే కాఫీ... చిక్కటి పాల కాఫీ... పాలు కావాలంటే పాలు... పాల గ్లాసులో రూపాయి నాణెం పడేయ్... తేలుతూ ఉంటుంది. వేణ్ణీళ్ళ స్నానం... లేదా.. రెండు నిమిషాల నడకతో హాయిగా నదీస్నానం... ఫలహారాలు.. మళ్ళీ మళ్ళీ కాఫీలు. చేయించేవాడు చాదస్తపు బ్రాహ్మడే అయినా, మధ్యాహ్నం ఒంటిగంటకల్లా కర్మకాండలు ముగించి లేచేవాడు. వెంటనే భోజనాలు – మధ్యాహ్నం నిద్ర.. లేవగానే మళ్ళీ ఫలహారం... కాఫీలు.. రాత్రి తొమ్మిది అయ్యేసరికి మళ్ళీ అద్భుతమైన భోజనం... అరిటాకు భోజనం (అది తమకు భోగమే కదా!). చల్లని గాలి... చుట్టూ ముదురాకు పచ్చరంగు పొలాలు... చెట్లు... చేమలు... కొబ్బరి, మామిడి తోటలు. మూడు రోజులూ ఇల్లూ వాకిలీ, పెళ్ళాం పిల్లలు, షాపులో నడుం విరిగే చాకిరీ – ఏమీ గుర్తు రాలేదు.

చివరకు ఈనాడు ఉదయం పదో కార్యక్రమం... అన్నీ దానాలు... తాను అలా చూస్తూ నిలబడ్డాడు. గోదానం అంటే నిజంగా వత్స సమేతంగా ఆవు.. సువర్ణదానం... భూదానం వంటివి... అన్నీ రెపరెపలాడే పెద్ద నోట్లు... కట్టలు కట్టలు... ఉన్నట్టుండి తనను పిలిచారు. కూర్చోమన్నారు. ఈ పీట... చెంబు ఇచ్చారు... ఖరీదైన ధోతుల చాపు... తాంబూలంలో కొన్ని నోట్లు అందించారు. అన్నీ గ్రహించి, తన కాళ్ళకు నమస్కరించిన కుర్రవాణ్ణి అక్షింతలు వేసి ఆశీర్వదించి ఇవతలికి వచ్చాడు తాను. పక్కకు వెళ్ళి నోట్లు లెక్కపెట్టుకున్నాడు... నూటపదహార్లున్నాయి.

మధ్యాహ్నం భోజనం చేసి బయలుదేరాడు. పదమూడో రోజు కదా, ఇక ఉండరాదు. లోతట్టు ఊరి నుంచి అరగంట నడిచి రోడ్డు మీదికి చేరుకున్నాడు. ఇంకా బస్సు రాలేదు. మూడు బస్సులు మారి మూడు వందల మైళ్ళు ప్రయాణం చెయ్యాలి. ఇప్పుడు సన్యాసయ్య పీట వంక చూశాడు. పెద్దది... చాలా అందంగా...

అద్భుతమైన పనివాడితనంతో తళతళ మెరుస్తున్నది. డెక్‌లామ్ తళతళ... నాలుగు పక్కల లోహపు బిళ్ళల తళతళ.

'ఇది దేనికిచ్చినట్టు' అనుకున్నాడు సన్యాసయ్య.

'బహుశా చనిపోయినవాడికి స్వర్గంలో ఈ పీట అమరుతుందేమో! రంభాద్యప్సరసల దివ్య నాట్యాన్ని దాని మీద ఆసీనుడై తిలకిస్తాడేమో? 'అలా అయితే, మంచం సోఫా సెట్టు ఇవ్వడం బెటరు కదా' అనుకుని నవ్వుకున్నాడు. 'ఇదికాక స్వర్గంలో ఇంకా ఎన్ని కావాలి? అక్కడ నడక కష్టం కదా? ఒక మోటార్ సైకిల్ - చిన్నదో చితకదో - దానం ఇస్తే మేలు కదా? కనీసం ఒక సైకిల్ ఇచ్చి ఉన్నా బాగుండేది.' సన్యాసయ్య మళ్ళీ తనలో తాను నవ్వుకున్నాడు. 'మరి ఈ చెంబు? ఇదెందుకో అనిపించింది కూడా. అంతలో బస్సు కనిపించింది. సన్యాసయ్య హడావిడిగా లేచి సంచి, పీట తీసుకుని బస్సు ఎక్కాడు. బస్సు వెంటనే కదిలింది. లోపల హాయిగా కూర్చునేందుకు చోటు లేకపోయినా, ఎవరో జాలిదలిచి జరిగితే సర్దుకుని కూర్చున్నాడు.

ఇక ఎన్ని గంటలు ప్రయాణం? కనీసం ఇంకా రెండు బస్సులు మారాలి. చివరి ప్రయాణం నూట ఇరవై మైళ్ళు పైమాటే.

ఈ పచ్చ పచ్చని అందాల నేల దాటి... ఊళ్ళూ పట్నాలూ గడిచి... నదులూ కాలువలూ దాటి... ఎర్ర ఎర్రని తన నేలకు... వేడి వేడిగా ఉండే తన ఊరికి... ఉప్పూరిసిన గోడల ఇంటికి.. తలనొప్పి పుట్టించే జీవితానికి...

ఇప్పటికి సగం ప్రయాణం అయింది. బస్సు దిగి ఒక అపరిచితమైన చోట... బస్టాండులో కూర్చున్నాడు. రాత్రి పొద్దుపోయింది. చుట్టూ చీకటి. ఒకపక్కన కూర్చుని సంచి ఒళ్ళో పెట్టుకుని, పీట పక్కన ఉంచుకుని, సంచిలో నుంచి పెద్ద పొట్లంగా కట్టి తాను బయలుదేరేటప్పుడు వారిచ్చిన బూందీ తినడం ప్రారంభించాడు.

ఎంతకూ బస్సు రావడం లేదు.

ఒళ్ళు విరుచుకున్నాడు. ఒళ్ళంతా నొప్పులు... కీళ్ళ నొప్పులు... ముంచుకొస్తున్న నిద్ర...

అంతలో "ఈ పీట ఎంతయిందండీ?" అన్న ప్రశ్న వినిపించి పక్కకు చూశాడు.

ఎవరో మధ్య వయస్కుడు అడుగుతున్నాడు.

"మిమ్మల్నే- ఎంతక్కొన్నారు?" అని అడిగాడాయన మళ్ళీ. పక్కనే ఆయన భార్య కాబోలు "చాలా ఖరీదు ఉంటుంది" అన్నది.

సన్యాసయ్య ఊరికే చప్పరించాడు. బదులు పలకలేదు. ఆయన పీటను చేతుల్లోకి తీసుకుని బరువు, నగిషీ, పనివాడితనమూ వగైరాలు చూసి ఆమెతో "ఎంతుంటుందంటావు?" అన్నాడు.

సన్యాసయ్య నవ్వి "మీరే చెప్పండి" అన్నాడు.

ఆమె "ఉంటుంది... డెబ్బయ్యో... ఎనభయ్యో... వంద లోపు..." అంటున్నది.

సన్యాసయ్య హఠాత్తుగా "మీక్కావలిస్తే తీసేసుకోండి"- అన్నాడు ఆయన ఆశ్చర్యపోయి, అంతలోనే "అంత డబ్బు ఉన్నట్టు లేదే... అరవయ్యో అరవై అయిదో ఉన్నాయంతే... నిజంగానే ఇచ్చేస్తారా" అన్నాడు.

"అలాగే.. అరవయ్యే ఇవ్వండి చాలు" అన్నాడు సన్యాసయ్య.

ఆయన వెంటనే జేబులో నుంచి డబ్బుతీసి "చార్జీలకు మాత్రం ఉంచుకున్నాను. ఇదుగో అరవై రూపాయలు" అంటూ సన్యాసయ్యకు నోట్లు అందించాడు.

సన్యాసయ్య "ముచ్చటపడ్డారుగా. తీసుకోండి.. అసలు దాన్ని అవసరం ఉండి కొనలేదు నేను... ఒకడెవరో వెంటపడ్డాడు. 'తిండికి లేదు...' అని ప్రాణం తీశాడు. కొన్నాను... అంతే" అన్నాడు. కాస్సేపటికి ఏదో బస్సు వచ్చింది. ఆ దంపతులు వెళ్ళిపోయారు. సన్యాసయ్య సంచి ఒళ్ళో పెట్టుకుని ఆవులించి చిటికె వేసి లెక్కలు చూసుకున్నాడు. ఆ తర్వాత చాలా సంతృప్తిగా కూర్చున్నాడు. అప్పుడు వచ్చింది బస్సు... దూరంగా ఆగింది.

అతడు హడావిడిగా లేచి పరుగెత్తాడు.

కండక్టరు తలుపు పూర్తిగా తీయనైనా తీయకుండా "ఖాళీ లేదు... ఖాళీ లేదు" అని విదిలించి పారేస్తున్నాడు.

సన్యాసయ్య కండక్టరును ప్రాథేయపడ్డాడు. "చాలా దూరం పోవాలి. వెళ్ళకపోతే ప్రమాదం... ఉద్యోగం ఊడిపోతుంది. నిలబడతాను పోనీ."

"అసలు లోపల చోటే లేదు. తెల్లవార్లూ దిగేవాళ్ళే లేరు. నిలబడేందుక్కూడా వీల్లేదు.." అంటున్నాడు కండక్టరు.

సన్యాసయ్య వినిపించుకోకుండా బతిమాలాడు.

కండక్టరు ఏమనుకున్నాడో ఏమో, తలుపు తీశాడు.

"వెనగ్గా నిలబడాలి... తర్వాత అనుకుని ప్రయోజనం లేదు..."

సన్యాసయ్య లోపలికి వెళ్ళాడు. సీట్ల మధ్య స్థలంలో కూడా సామాన్లే.

బస్సంతా ఘోరంగా ఉంది. సీట్లలో జనం గాఢ నిద్రలో ఉన్నారు.

ఒకళ్ళమీద ఒకళ్ళు పడి మరీ నిద్రపోతున్నారు.

డ్రైవరు బస్సును వేగంగా ముందుకు దూకించాడు.

టికెట్టు తీసుకుని, సంచిని ఒకచోట సీట్ల మధ్య కుక్కి, పై రాడ్ పట్టుకుని నిలబడ్డాడు సన్యాసయ్య. ఒక్క కాలే అడుగున ఆనుతున్నది.

బస్సు పరుగెత్తుతున్నది. అటూ ఇటూ అంతా చీకటి... అతని కాలు మొద్దుబారి రాతికాలులాగ తయారయింది. రాడ్ పట్టుకున్న చెయ్యి నొప్పి పుట్టింది. నిద్రాభారంతో కళ్ళు కూరుకుపోతున్నాయి. ఒళ్ళంతా జ్వరం తగిలినట్టు ఘోరంగా

ఉంది. ఉన్నట్టుండి కూలబడితే బాగుండుననిపిస్తున్నది. కానీ, వీల్లేదు. నిమిషాలు గడిచేకొద్దీ బాధ ఎక్కువైంది. దేవుడనేవాడుండి ఇప్పుడు ప్రత్యక్షమై 'ఏ వరం కావాలి' అని అడిగితే, 'ఏమీ వొద్దు... కూర్చునేందుకు చోటు చూపించు స్వామీ చాలు' అంటాడు తాను. నరకం ఎక్కడో లేదు. తాననుభవిస్తున్నదే అనిపించింది. స్వర్గం కూడా ఎక్కడో లేదు. బస్సులో సీట్లలో స్థిరపడినవాళ్ళు అనుభవిస్తున్నదే అనిపించింది.

బస్సు మాత్రం ఆగడం లేదు. అందాల సీమ నుంచి రాళ్ళసీమకు పరుగెత్తుతూనే ఉంది.

# శనిదేవత పదధ్వనులు

"ఈ కళ్లజోడిక ఎంతమాత్రం లాభం లేదు. దీన్ని నమ్ముకుంటే ఉన్న కాస్త పోయేట్లుంది" అనుకున్నాను. కళ్లజోడు తీసి పంచె చివరతో తుడుచుకుంటూ. తర్వాత కళ్లజోడు ముఖానికి తగిలించుకుని చెవిపక్కకు చెయ్యి పోనిచ్చి స్విచ్ నొక్కాను. శబ్దం మొదలుయింది.

పైన గుబురుగా దయ్యపు గొడుగులా పెరిగిన నిద్రగన్నేరు చెట్టు... పైనుండి ఉండి ఉండి రాలిపడుతున్న చినుకులు...

వర్షం ఆగిపోయింది. కాని చల్లని గాలి విసురుగా వీస్తూనే ఉంది. పక్కగా నాటురకం టీస్టాలు, దానిముందు రెండో మూడో బల్లలు. ముగ్గురో నలుగురో కూర్చుని టీ సేవిస్తున్నారు. పెద్దగా అరుస్తున్నట్లు మాట్లాడుకుంటున్నారు. లారీ ఒకటి 'బొంయ్'మని రొదచేసుకుంటూ దూసుకుపోయింది.

ఉదయం పదిగంటలు దాటి ఉంటుంది. ఇంటి దగ్గర తొమ్మిదింటికే బయలుదేరాను. రెండు బస్సులు మారి వచ్చి, నాకు కావలసిన ఇంటికోసం వాకబుచేస్తూ తిరుగుతుండగా మొదలయింది వర్షం. ఎక్కడెక్కడి మబ్బులో కూడబలుక్కున్నట్లు గుమిగూడి వచ్చి పక్కా అరగంట సేపు కుండపోతగా వర్షించాయి. ఇదుగో, ఇప్పుడు నీళ్ళ బరువు తీర్చుకుని తేలికపడి ఆకాశంలో దూది పింజల్లాగా తేలిపోతున్నాయి. నేను హియరింగ్ ఎయిడ్ స్విచాఫ్ చేసి చేతివ్రేళ్లు విరుచుకుంటూ నిలబడిపోయాను. ఉన్నట్లుండి మళ్ళీ ఘనీభవించిన నిశ్శబ్దం.

నిన్న, అంటే శనివారం ఉదయం, ఆ కొద్ది పెన్షన్ రాళ్లూ తెచ్చుకుందామని బ్యాంకుకు వెళ్ళాను. వాకబు చేస్తే ఆ డబ్బు ఇంకా రాలేదన్నారు. ఆ కౌంటర్‌లో ఉండే వ్యక్తి నాకు పరిచితుడే. పేరు రవీంద్ర. చాలా సానుభూతితో 'ఇంకా రాలేదండీ మీ డబ్బు. సోమవారం రండి' అన్నాడు. బహుశా నా పరిస్థితి అతనికి అర్థమై ఉంటుంది. వచ్చే పెన్షన్ చాలా కొద్ది... నెలలో పదిరోజులకు కూడా సరిపోదు. మిగిలిన ఖర్చుఅంతా భరించేది మా అమ్మాయి లలిత. ఇంటికైన పెద్ద కూతురు. దాని తరువాతివాడు రాముడు... శ్రీరామచంద్రమూర్తి... రెండేళ్లయింది ఇల్లు వదలిపోయి. ఎక్కడ ఉన్నాడో, ఏం చేస్తున్నాడో, అసలు ఉన్నాడో లేడోకూడా తెలియదు. మూడోవాడు చిరంజీవి. వాడు డిగ్రీ పూర్తిచేసి ఏ పనీ దొరక్క రికామీగా తిరుగుతున్నాడు. తర్వాతది జానకి. దీనికి మాత్రం పెళ్లి చెయ్యగలిగాను. అది ఎక్కడో దూరంగా ఒరిస్సాలో భర్తతో ఉంటున్నది. లలితకు పెళ్లికాలేదు. అది చేసుకోలేదు.

చేసుకోనన్నది. ఇప్పుడిక దానికి పెళ్లికాదు. దానికా చింతకూడా లేదు. పాపం, తననుతాను కరిగించుకుంటూ ఆ గొర్రెతోక రాబడి గుమాస్తా ఉద్యోగం చేస్తూ వచ్చేదంతా ఇంటికోసం ఖర్చుచేస్తూ జంతువులాగ జీవిస్తున్నది.

అదిసరే, ఇలా ఎంతసేపు నిలబడడం? ఈ ఇల్లు కనుక్కోడం ఇవేళ సాధ్యం అయ్యేట్లులేదు. ఇక ఇంటిదారి పట్టడం మేలు. మళ్ళీ మబ్బులు పైన గుమిగూడుతున్నాయి. సముద్రం మీదినుంచి ఇలా ఉండి ఉండి మబ్బులు బయలుదేరివచ్చి కుండలతో వలె నీళ్లను కుమ్మరించిపోవడం ఈ కాలంలో మామూలే. నేను గొడుగు తెచ్చుకోకపోవడం తెలివి తక్కువ. అయినా ఆ గొడుగు ఉండిమాత్రం ఉద్ధరించేదేముంది? అది ఎప్పటిదో, ఇక్ష్వాకుల కాలంనాటిది.

నెమ్మదిగా కదిలి నడవడం ప్రారంభించాను. రోడ్డంతా ఈమాత్రపు వర్షానికే బురద బురదగా తయారై బీభత్సంగా ఉంది. అటూ ఇటూ చూస్తూ నడుస్తున్నాను. రవీంద్ర ఇంట్లో ఉన్న పాతకాలపు గ్రామఫోను రికార్డులు నన్ను నడిపిస్తున్నాయి. అతడు చెప్పిన ఇంటిగుర్తులు సరిగా గుర్తులేవు. ఒక కాగితంమీద రాసుకుని ఉంచుకుంటే బాగుండిపోయేది. చూస్తూనే నడుస్తున్నాను. ఒక ఇంటిముందు ఒక మధ్యవయస్కుడు నిలబడి తీరిగ్గా సిగరెట్టు కాల్చుకుంటున్నాడు. బహుశా ఉద్యోగి అయి ఉంటాడు.

నేను చెవిక్రిందికి చెయ్యి పోనిచ్చి స్విచ్ నొక్కి గబగబ అతనివైపు నడిచాను.

అతడు నన్ను చూసి కనుబొమలు ఎగురవేసి 'ఏమిటన్నట్టు' చూశాడు. నేను చెప్పాను. "ఆయన పేరు రవీంద్ర... రవీంద్రనాథ్ అనుకుంటాను. బ్యాంకులో ఉద్యోగం."

"ఈ వీధిలో బ్యాంక్ వాళ్ళెవరూలేరు. పక్క వీధిలో వాకబుచేయండి."

నేను నిరాశగా వెనుదిరిగాను. మళ్ళీ నడక సాగించాను. లాభంలేదు. ఇవాళ అంతా తిరిగినా ఆ యిల్లు కనుక్కోడం నా తరంకాదు. ఇక ఈ వ్యర్థ ప్రయత్నం మానుకుని బస్సుస్టాపుకు చేరుకుని సిటీ బస్సు ఎక్కి ఇంటి ముఖం పట్టడం క్షేమం అనుకున్నాను.

హియరింగ్ ఎయిడ్ స్విచాఫ్ చేసి నడుస్తున్నాను. దీన్ని అవసరం లేనప్పుడు ఆఫ్ చెయ్యకపోతే బ్యాటరీ వృధాగా ఖర్చయిపోతుంది. అసలే ఖరీదెక్కువ. ఈమధ్య ఆ సున్నితమైన బ్యాటరీలు దొరకడం లేదు. దీన్ని పొదుపుగా వాడుకోకపోతే అనర్థం. లలిత, పాపం, ఆరేడు నెల క్రిందట బ్యాటరీ అయిపోయి బాధపడుతూ ఉంటే అన్ని ఖర్చులలో ఇదీ ఒకటని వెదికి వెదికి మరీ కొనుక్కుని వచ్చింది. ఇక దీని ఆయుస్సుకూడా ఎంతోకాలం లేదు. అందువల్ల అతి జాగ్రత్తగా పొదుపుగా వాడుకోడం క్షేమం.

పొద్దున్న ఎప్పుడో తాగిన కాఫీ. పొట్టలో మరేమీ పడలేదు. ఇంట్లో చెబితే బయటికి రానివ్వరు. అందుకని 'ఇదుగో, వీధి చివరివరకే' అని చెప్పి బయలుదేరి వచ్చేశాను. నెమ్మదిగా అడుగులు వేస్తూ నడుస్తున్నాను.

అంతలో ఎవరో వెనుకనుంచి నా పంచె పట్టుకుని లాగినట్లనిపించి వెనుదిరిగి చూశాను. పది పన్నెండేళ్ల కుర్రాడు ఏదో అంటున్నాడు. హఠాత్తుగా స్విచ్చాన్ చేశాను.

"మిమ్మల్నేనండి! ఎంత పిలిచినా వినిపించుకోకుండా వెళ్లిపోతారేం? మా నాన్నగారు పిలుస్తున్నారు. అంతంత కేకలు పెట్టినా వినలేదు మీరు" అంటున్నాడు ఆ కుర్రవాడు రొప్పుతూ.

"రండి" అంటూ అతడు దారి తీశాడు.

దాదాపు ఇరవై గజాలు నడిచాము. రవీంద్ర వీధి గుమ్మంలోనే నిలబడి ఉన్నాడు. వడివడిగా వెళ్లిన నన్ను చూసి నవ్వుతూ "ఏమిటి బాబుగారూ! పెద్ద పెద్ద కేకలు పెట్టాను నేను. వినిపించలేదా?" అన్నాడు.

నేను చూపుడువ్రేలితో చెవి చూపించాను.

"ఓహో! అదా సంగతి? రండి రండి" అంటూ లోపలికి దారితీశాడు.

రవీంద్ర నన్ను పక్క గదిలోకి తీసుకుపోయాడు.

ఇల్లు చిన్నదే అయినా ముచ్చటగా ఉంది. ఆ గది చిన్నదే అయినా చక్కగా సర్ది ఉంది. ఒకవైపు బల్ల. ఖరీదైనదేమీకాదు. కాని పూలకుండీవల్ల అందంగా ఉంది. పక్కనే చక్కగా పేర్చిన పుస్తకాలు. గదికి ఒకవైపు పొడవాటి కిటికీ. బయట ఆవరణలోనుంచి చల్లనిగాలి వీస్తున్నది. కిటికీ అవతల మందారచెట్టు, ఆపైన ప్రహరీగోడ పక్కనే ముచ్చటగా పెరిగిన మామిడిచెట్టు. దాని గుబురులలో దాగివుండి కూస్తున్నదొక కోయిల. గోడ అవతలవైపునుంచి పొరుగింటి పిల్లలెవరో 'కూకూ' అని అరుస్తూ ఆ అమాయకపు వృద్ధ కోయిలను రెచ్చగొడుతున్నారు. నేను యంత్రాన్ని స్విచాఫ్ చేయకుండా అంతా వింటూ అలా హాయిగా కుర్చీలో కూర్చుండిపోయాను.

నేనింతవరకు చూడలేదు. నావెనక కొంచెం ఎత్తుగా గోడమీద ఒక పాత ఫోటో వ్రేలాడుతున్నది. తెలిసిన ముఖంలాగా కనిపిస్తే లేచి కళ్ళజోడు సర్దుకుని బాగా దగ్గరగా వెళ్లి చూశాను. ఈ ముఖం ఎప్పటిదో! అగాధమైన మనసు పొరలలో ఎక్కడో గుప్తమై నిక్షిప్తమై ఉన్నది. వెంటనే స్ఫురణకు రావడంలేదు. ఇరవై లేక ఇరవై అయిదేళ్ల ప్రాయం. గుండ్రని అందమైన ముఖం. పలుచని చెక్కిళ్లు. అరచేతి వెడల్పున వెలుగులు చిమ్ముతున్న నేత్రద్వయం. శంఖంలాటి మెడలో పలుచని గొలుసు.

"ఆ ఫోటో మా అమ్మగారిది."

రవీంద్ర భుజంమీద టవల్‌తో వచ్చాడు. వెనకనే కనకాంబరం రంగు చీరలో ఒక యువతి, ఇందాకటి కుర్రాడు వచ్చారు.

"మా ఆవిడ... పబ్లిక్ స్కూల్లో టీచరు" అని పరిచయం చేశాడు.

ముందే చెప్పినట్లున్నాడు. ఆమె అత్యంత గౌరవభావంతో నమస్కరించింది.

ఆ వెంటనే "టీ తెస్తాను" అంటూ వెనుతిరిగి వెళ్లింది. కుర్రాడు ఆమెను అనుసరించాడు.

రవీంద్ర ఆ ఫోటో చేతిలోకి తీసుకుని కూర్చున్నాడు.

"మా అమ్మ నా చిన్నప్పుడే పోయింది. అంటే బొత్తిగా చిన్నతన కాదనుకోండి. నాకప్పుడు పదిహేనేళ్ళు ఉంటాయేమో! మా నాన్నగారికి వేరే ఇల్లుండేది. వేరే పెళ్ళాం పిల్లలూ ఉండేవారు. మేము ఒక పాత పెంకుటింట్లో ఉండేవాళ్లం. మా నాన్న పోయాక మాకా ఇల్లే మిగిలింది. మా అమ్మ ఒక కుట్టుమిషనుతో కాలం గడుపుతూ ఉండేది. ఆ పని లేనప్పుడు విస్తళ్ళు కుట్టి నాచేత ఇంటింటికి పంపిస్తుండేది. ఒకనాడు నేను స్కూల్లో ఉండగా మా పొరుగింటి ఆయన నాకోసం వచ్చాడు. ఆయనవెంట వచ్చేశాను. అప్పటికే అమ్మ చచ్చిపోయింది. ఆ రెండో రోజున మా మేనమామనంటూ ఒకాయన వచ్చాడు." రవీంద్ర ఇక్కడ ఆగాడు. టీ వచ్చింది.

"తీసుకోండి" అని నాకొక కప్పు అందించి, మరొకటి తాను తీసుకున్నాడు.

"ఆ మేనమామ చిత్రమైనవాడు. ఇక్కడ అమ్మ దాచివుంచిన మూటలేమైనా ఉంటాయేమోనని వచ్చాడుతప్ప ప్రేమాభిమానాలతో రాలేదు. ఇక్కడేమీ లేదని తెలిశాక మెరుపు వేగంతో మాయమైపోయాడు. మళ్ళీ అయిపులేదు. ఆ తర్వాత పొరుగాయన నన్ను అభిమానంతో చేరదీశాడు. చదివించాడు. పైకి తీసుకువచ్చాడు. తన ఒక్కగానొక్క కూతుర్ని యిచ్చి పెళ్లి చేసి ఆయనా వెళ్ళిపోయాడు. మా ఆవిడే ఆవిడ. అదీ సంగతి. అన్నట్లు ఇప్పుడే వస్తాను. రికార్డు ప్లేయర్ కోసం ప్రయత్నిస్తాను."

ఈ మాటలని బయటికి వెళ్ళిపోయాడు. ఇది విన్న తర్వాత నా మానస మహాసాగరంలో అగాధాలలో ఎక్కడో దాగిన విషయం బయటికి వచ్చింది.

ఆమె అసలు పేరు రుక్మిణి. కోస్తా జిల్లాల్లో ఎక్కడి నుంచో ఎవడో ఆమెను మాయమాటలు చెప్పి తీసుకువచ్చాడు. అప్పటికే ఇది మహానగరం. ట్రాములూ వగైరాలతో హడావిడాగా ఉండేది. సినిమా స్టూడియోలు సందడిగా ఉండడం మొదలయింది. స్వాతంత్ర్యం ఇహనో ఇప్పుడో రాబోతున్న తరుణం. ఆమెను తీసుకువచ్చినవాడు దుర్మార్గుడు. వాడి వంచనకు గురై ఆమె యాతనలనుభవించింది. అప్పుడు నా బ్రతుకు కూడా బాగులేదు. ఆశలు అడియాసలైనాయి. చదువు వృథా అయింది. నేర్చుకున్న సంగీతం తిండి పెడుతుందేమోనని ఇక్కడికి చేరాను. కాని ఇక్కడా శనిదేవత నన్ను కాలూన నీయలేదు. చిల్లర మల్లర పనులు చేస్తూ బ్రతుకు వెళ్ళదీస్తూ ఉండేవాణ్ణి. రుక్మిణి పాపం చాలా అమాయకురాలు.

కొన్నాళ్లకే వాడి అసలు రంగు బయటపడింది. అప్పటికే ఆమె సాలెగూటిలో ఈగలాగ చిక్కుకుని ఉంది. ఓపికతో మంచి రోజుల కోసం ఎదురుచూడడంతప్ప, తలవంచి బ్రతకడం తప్ప, చేసేదేమీలేదని గ్రహించింది. అలా కొన్ని యేళ్ళు - బహుశా రెండు మూడేళ్ళు - గడిచాయి. అప్పుడొకనాడు ఆమె అదృష్టం పండి వాడొక ప్రమాదంలో మరణించడంతో ఆమెకు చెర తప్పినట్లయింది. అప్పుడు నాకు దగ్గరయింది. నా స్థితి చూసి ఆమె నామీద సానుభూతి చూపించింది. ఆమె స్థితి

చూసి నేను సానుభూతి చూపించాను. కలో గంజో ఇద్దరం కలిసే తాగేవాళ్ళం. అదీ కొద్ది కాలమే. ఆ తర్వాత ఒకనాడొక చిత్రం జరిగింది. ఒక రాత్రి అంతా నన్ను కూర్చోబెట్టి మాట్లాడింది. నా సలహా కోరింది. ఒక పెద్దమనిషి ఆమెకు ఆసరాగా ఉంటానన్నాడు. ఆమె పోషణ భారం వహిస్తానన్నాడు. ఏ లోటూ రాకుండా చూసుకుంటానన్నాడు. "ఏం చెయ్యమంటారు?" అని అడిగింది. నేను హతాశుణ్ణయ్యాను "నీకిష్టమేనా?" అని అడిగాను. "మరి చేసేదేముంది?" అని రెట్టించింది. నేను అంతవరకూ నా మనసులో మాట బయటపెట్టకుండా సంకోచించి తప్పు చేశానని అర్థంచేసుకున్నాను. అందువల్ల పెద్దమనిషిలాగా, ఆమె హితం కోరిన వాడిలాగా నటిస్తూ "అదే మంచిది" అని సలహా ఇచ్చాను. అక్కడితో ఆ కథ ముగిసిపోయింది. తరువాత నా బ్రతుకు నాదయింది. ఊళ్ళు మారాను. ఉద్యోగాలు మారాను. ఎదుగూ బొదుగూ లేని అతి సాదా సీదా జీవితం గడిపాను.

రవీంద్ర లోపలికి వచ్చాడు. "సారీ! ఇలా మిమ్మల్ని కూర్చోబెట్టి వెళ్లాను. ఏమీ అనుకోవద్దు. రికార్డు ప్లేయరు కోసం ప్రయత్నించి వచ్చాను. లాభం లేకపోయింది. ఒక ఫ్రెండ్ ఇంట్లో ఉంది కాని బొత్తిగా పనికిరాకుండా పాడైపోయి ఉంది."

అతడు బల్లక్రింది సొరుగు తీశాడు. లోపల బొత్తులు బొత్తులుగా రికార్డులున్నాయి. పైనుంచి చిరిగిపోయిన కవరుతోసహా ఒకదాన్ని బయటికి తీశాడు.

"ఇదిగో... నిన్న మీకు చెప్పానుగా... ఇది మీదే."

నాకు ప్రాణం లేచివచ్చినట్లయింది. ఎంతో ఆప్యాయంగా దాన్ని అందుకున్నాను. రికార్డు ఇవతలికి తీశాను. శుభ్రంగానే ఉంది. గ్రామఫోను, దాని బాకా, పక్కనే తిష్ఠవేసుకుని కూర్చున్న కుక్క అంతా పాతవాసన. అందమైన వాసన వచ్చింది. దానిమీద అక్షరాలు, నీలంరంగుమీద బంగారురంగు అక్షరాలు స్పష్టంగానే ఉన్నాయి. మిలమిల మెరుస్తూ పాట, ఆ క్రింద నాపేరు, రికార్డు నెంబరు వగైరాలున్నాయి.

నేను మిగిలిన రికార్డులు తీశాను. ఒక్కొక్కటి చూస్తూ కూర్చున్నాను. శ్రవణయంత్రం పనిచేస్తూనే ఉంది. రికార్డు ప్లేయరు లేకపోయినా అద్భుత సంగీతం వినిపిస్తున్నది. ఏవేవో, ఎప్పటెప్పటివో అమృతగళధ్వనులు. ఒక్కొక్క రికార్డులో ఒక్కొక్క సంగీతఝురి. ఒక్కొక్క విలక్షణమైన కంఠస్వరం. రకరకాల యంత్ర వాద్యాల బీభత్సమైన హోరు లేదు. నరాలమీద ప్రభావం చూపించే దరువులు, అరుపులు, విరుపులు లేవు. రసరమ్య లోకాలకు చేర్చి పారవశ్యం కలిగించే ప్రశాంత నాదాలు. కళ్ళముందు పరిచయమైన ముఖాలు. చెవులలో వారి విలక్షణ స్వరాలు... నా కళ్ళలో నీటిపొర నిలిచింది.

"ఇవన్నీ మా అమ్మ దాచి ఉంచింది. ఇవంటే ఆమెకెంత ఇష్టమో చెప్పలేను. ముఖ్యంగా మీ పాట అంటే మహా ఇష్టం. మాటిమాటికీ విని కళ్ళ నీళ్ళు పెట్టుకుంటూ ఉండేది. చిన్నతనంలో తెలియక 'ఎందుకమ్మా! ఏడుస్తున్నావు' అని చాలాసార్లు అడిగాను. నాకూ ఈ రికార్డంటే ఇష్టం. అసలా రచనే గొప్పది. పదాలతో

కళ్లముందు వెన్నెల విరియించినట్లు ఉంటుంది. దానికితోడు మీ కంఠస్వరం... సైగల్... పంకజ్ మల్లిక్... నాగయ్యలకు దీటుగా... సరే... ఇది మీది. మీరు తీసుకోండి. మీకిచ్చేశాను"

ఆ తర్వాతకూడా నేను శ్రవణయంత్రాన్ని ఆఫ్ చేయలేదు. చాలాసేపు మాట్లాడుకున్నాము. అతడెన్నో కబుర్లు చెప్పాడు. తర్వాత అతడు బలవంతం చేయగా భోజనంకూడా చేశాను. ఆ తర్వాత చిన్న కునుకుకూడా తీశాను. ఇంతసేపూ శ్రవణయంత్రం పనిచేస్తూనే ఉంది. నాలుగు గంటల వేళ కాఫీ తాగాను. మనసెంతో తేలికపడినట్లనిపించింది. ఇన్నాళ్ళు ఘనీభవించిన నిశ్శబ్దం, గ్లాని తొలగిపోయినట్లనిపించింది: అప్పుడిక లేచాను.

"చాలా దూరం పోవాలి. ఇంట్లో కంగారుపడుతూ వుంటారుకూడా" అన్నాను. "థాంక్యూ ఫర్ ఎవ్విరిథింగ్" అన్నాను. నాగొంతు ఆర్ద్రమై ఉండాలి.

అతడు కూడా లేచాడు. నవ్వుతూ "భలేవారండీ! నేనిప్పుడేమి చేశాను? ఆ రికార్డు మీది. మీకిచ్చేశాను. బహుశా ఇంకెక్కడా దొరకదు అది" అన్నాడు.

నేను ఆ రికార్డును భుజానవున్న సంచిలో భద్రంగా ఉంచుకున్నాను. రవీంద్ర భార్య వచ్చి నిలబడింది. 'వస్తానమ్మా' అని చెప్పి ఆవరణలో నడిచి ఇవతలికి వచ్చాను. బస్‌స్టాప్‌వైపు నడిచాను.

సిటీబస్సు జనంతో కిటకిటలాడుతూ కడుపుతో ఉన్న దయ్యపు తేలులాగా వచ్చి ఆగింది. దిగేవారు దిగేలోపుగా, ఎక్కేవారు ఎక్కేలోపుగా డ్రయివర్ బస్సును ముందుకు దూకించాడు. నేను ఎక్కలేకపోయాను. అలా రెండు బస్సులు వెళ్ళిపోయాయి. చివరకు రెండు బస్సులు మారి ఇంటికి చేరేసరికి బాగా పొద్దుపోయింది. ఇంతసేపూ భుజానవున్న సంచిలోని ఆ ప్లేటును అతిజాగ్రత్తగా చూసుకున్నాను. ఏమాత్రం ఒత్తిడి తగిలినా, ఇప్పటి రికార్డులలాగా కాదు, టప్‌మని విరిగి ముక్కలైపోతుంది.

ఇంట్లో ఎవరి పనుల్లో వారున్నారు. లలిత మాత్రం నాకోసమే ఎదురుచూస్తున్నది కాబోలు, నన్ను చూడగానే లేచి "ఏం నాన్నా! ఎక్కడికి వెళ్లావు? గాబరా పడిపోతున్నానింతసేపూ" అంటూ ఎదురువచ్చింది. "తెలిసినవాళ్లింటికి వెళ్లాను పొద్దున. బలవంతంచేసి ఉంచేశారు" అంటూ సంచిలోనుంచి రికార్డు ఇవతలికితీసి "దీన్ని జాగ్రత్తగా ఉంచు" అని అందించాను.

"ఏమిటిది?" అంటూ అందుకుని చూసింది.

ఆలస్యంగా వచ్చానన్న అలుక కొంచెం తగ్గింది.

"రా, అన్నం తిందువుగాని, అందరి తిండ్లూ అయిపోయాయి. నువ్వూ నేనూ మిగిలాం" అన్నది.

నేను చొక్కావిప్పి పెరట్లోకి వెళ్లి కాళ్ళు కడుక్కుని వచ్చాను. లలిత భోజనం వడ్డిస్తూ "పొద్దుటి వర్షానికి ఇంట్లో రెండుమూడుచోట్ల చినుకులుపడ్డాయి. పైన

పెంకుల పరిస్థితి అధ్వాన్నంగా ఉంది. తొందరలో తిరగనేయించడం మంచిది..." ఇలా సాగించింది. చాలా నెమ్మదిగా మాట్లాడుతున్నట్లున్నది. నేను వేరేలోకంలో ఉన్నాను. అది గమనించి పెద్దగా "ఏ లోకంలో ఉన్నావు నాన్నా! నేను చెప్పేది వింటున్నావా?" అని అడిగింది మళ్ళీ. నేను ఉలికిపడి "ఏం లేదు, ఏం లేదు. ఏమిటీ చెబుతున్నట్లున్నావు?" అని అడిగాను.

మళ్ళీ సణుగుడు మొదలుపెట్టింది. నేను ఉన్నట్లుండి "అమ్మడూ! పక్క రావుగారింట్లో రికార్డ్ ప్లేయర్ ఉందికదూ?" అని అడిగాను. "ఉంది" అన్నది లలిత. నేను సంశయిస్తూ "ఒక్కసారి మన రికార్డు విందామని ఉంది" అన్నాను. లలిత "అట్లాగే. నేను వెళ్ళి అడిగివస్తాను" అన్నది.

నేను తిండి ముగించి ముందుగదిలోకి వచ్చాను. లలిత పనులన్నీ పూర్తిచేసుకువచ్చి "ఇప్పుడే అడిగిరానా?" అన్నది.

"ఊఁ! వీలయితే ఇప్పుడే. విందాము..."

లలిత వెళ్లింది. నేను కుర్చీలో కూర్చున్నాను. సన్నగా గుండెల్లో ఎక్కడో నొప్పి మొదలయింది. ఈమధ్య కొంతకాలం నుంచీ ఇదొక కొత్త పరిణామం. చేత్తో గుండె నిమురుకుంటూ కూర్చుండిపోయాను. 'లోపల గుండె అనబడే అవయవం కొట్టుకోవడంలో ఏమన్నా తేడా వొస్తున్నదా' అని అనుమానం కలిగింది. భూమ్మీద పడ్డప్పటినుంచి, ఆమాటకొస్తే, తల్లి కడుపులో పడ్డప్పటి నుంచి డెబ్బై ఏళ్ళకు పైగా నిరంతరం సెకండు కాలం అయినా విశ్రాంతి లేకుండా కొట్టుకుంటూనే ఉన్నది. బాధల్లో, కష్టాల్లో, సుఖాల్లో, విషాదంలో ఎప్పుడూ తేడా రాలేదు. ఇప్పుడే ఏమన్నా లయ తప్పుతున్నదా?

అంతలోనే 'ఆ! ఏమీలేదు. అంతా పిచ్చిభ్రమ' అనుకుంటూనే కుడిచేత్తో ఎడమ చేతి నాడి పట్టుకుని చూసుకున్నాను. గుండె ఎలా ఆడుతున్నదో అంచనా వేసే ప్రయత్నం చేశాను. కాని చేతకాలేదు.

అంతలో లలిత వచ్చింది. "రావుగారు మేలుకునే వున్నారు నాన్నా! పిల్లలూ వాళ్లు చదువుకుంటున్నారు. నేను చెప్పగానే ఒప్పుకున్నారు. 'దానికేం భాగ్యం రమ్మన్నారు. మేమూ విన్నట్లవుతుంది' అన్నారు."

నేను ఒక రకమైన ఉద్వేగంతో లేచాను. కాళ్లు వణికినట్లనిపించింది. రావుగారి ఇంట్లో అప్పటికే అందరూ – రావుగారి భార్య, కొడుకులు, కోడలు, కాలేజీలో చదువుకుంటున్న కూతుళ్లు – ఒకచోట చేరారు. ఆయన రికార్డు ప్లేయరు స్పీడు సర్ది మేము వెళ్లేసరికి నన్ను చూసి నవ్వుతూ "నాకు తెలియదండీ బాబూ ఆ పాట పాడింది మీరని. చాలాసార్లు విన్నాను. అది నా ఫేవరిట్ సాంగ్" అన్నాడు. ఎందుకో ఆయన చాలా నెమ్మదిగా లోగొంతుకతో మాట్లాడుతున్నాడనిపించింది. సర్దుకు కూర్చోడంలో ఇద్దరు అమ్మాయిలు గొడవపడుతున్నారు. వాళ్లు కూడా నెమ్మదిగా అరుచుకుంటున్నట్లు అనిపించింది. ఉన్నట్లుండి ఒక అబ్బాయి ఏదో అని

నవ్వాడు. అది విని ఆడపిల్లలు కూడా నవ్వారు. అతడేమన్నాడో నాకు వినబడలేదు. నవ్వులు మాత్రం అతి తక్కువ స్థాయిలో మంద్రంగా వినిపించాయి.

ఆయన అంతా సిద్ధం చేసి రికార్డు పెట్టారు. 'ఏదీ, ఎంతకీ ధ్వని రాదేం' అనుకున్నాను. రికార్డు తిరుగుతూనే ఉంది. వాళ్లందరూ వింటున్నట్లు తెలుస్తూనే ఉంది. రావుగారైతే వింటూ ఆనందిస్తున్నట్లు కూడా తెలుస్తూనే ఉంది. లలిత వంక చూశాను. అది గొప్ప ఆనంద పారవశ్యంతో వింటున్నది.

నేను చెవి పక్క మెషిను స్విచ్ ఆన్‌చేసి ఉందో లేదో అని చూసుకున్నాను. ఆన్ చేసేవుంది. ముందేదో సన్నని ధ్వని చాలా దూరం నుంచివలె వినిపించింది తప్ప ఇప్పుడేమీ వినిపించడంలేదు. అంతా దాదాపు నిశ్శబ్దం.

అందరి ముఖాలలో మెప్పుదల, ఆనందం. రావుగారు ఏదో మాట్లాడుతున్నారు. పెదవుల కదలికను బట్టి చాలా మెచ్చుకున్నట్లు తెలిసింది.

ఉబికి వస్తున్న కన్నీళ్లను అతిప్రయత్నంమీద రెప్ప లప్పళించి ఆపుకుంటూ కూర్చుండిపోయానింతసేపూ. అంతా అయిపోయిన తర్వాత లలిత ఆ రికార్డు అందుకుని 'పద నాన్నా! పోదాం' అని కాబోలు అన్నది.

ఆ తర్వాత ఇద్దరం ఇంటికి వచ్చాము. నేను వచ్చీరాగానే మంచంలో కూలబడ్డాను. ఇంట్లో మిగిలిన వారు ఎవరిపాటికి వారు నిద్రకు పడ్డారప్పుడే.

లలిత రికార్డును భద్రంగా జాగ్రత్త చేసి వచ్చి ఏదో మాట్లాడుతూనే చాప పరుచుకుంది. మరేదో మాట్లాడుతూనే నడుం వాల్చింది.

నేను పడుకున్నాను. ఉన్నట్లుండి నిట్టూర్పు వచ్చింది. ఆ తర్వాత కళ్ళ నీళ్ళు ఉబికి ఉబికి వచ్చాయి. అంతలో లేచి "అమ్మడూ! బ్యాటరీ అయిపోయిందే బొత్తిగా" అన్నాను.

"పడుకో నాన్నా! రేపు చూద్దాంలే. అన్నట్లు ఆ బ్యాటరీలు దొరకడం లేదు. అయినా ప్రయత్నం చేద్దాం. రెండు మూడు రోజుల్లో ఎక్కడో ఒకచోట దొరకవచ్చులే. ఇప్పుడు పడుకో" అంది.

నేను వెల్లకిలా పడుకున్నాను.

కుడి చెయ్యి అప్రయత్నంగా గుండెల మీదికి వెళ్ళింది. ఇప్పటికిది ఆడుతూనే ఉంది.

రెండుమూడు రోజులు. బహుశా ఒకవారం రోజులు... అప్పటికి ఈ గుండె ఇలాగే ఆడుతూ ఉంటుందా? అంతలో మనసు లోలోపలి పొరలలో నుంచి ఒక ప్రశ్న ఉదయించింది.

'అసలిప్పుడు నిద్రపోతే తెల్లవారాక లేస్తానా?'

కాస్సేపటికి మగత నిద్రలో దూరంనుంచి మొదట మందంగానూ, ఆ తర్వాత ఉధృతంగానూ ఏవో వింత పదధ్వనులు వినిపించాయి.

❁ ❁ ❁

# తన జీవితం వైపు

మళ్లీ ఆవులింత...

నోటికి ఎడమ చేయి అడ్డం ఉంచుకని ఆవులించింది వల్లి.. పుష్పవల్లి.

కళ్లు మూసుకుపోతున్నాయి.

ఎదురుగా గోడ గడియారం పన్నెండున్నర చూపిస్తున్నది. మరో అరగంట గడిస్తే కానీ కుర్చీలో నుంచి లేచేందుకు వీలు లేదు. ఆమె ఎదురుగా బల్లమీద నిండా పరుచుకున్న బారెడు సైజు పుస్తకం. దాన్నిండా రూళ్లు... గడులు.. వాటినిండా అంకెలు. కొండవీటి చేంతాళ్లలాగా, కాళ్లజెర్రుల గుంపులలాగా, వానపాముల్లాగా - చూస్తుంటే ఒళ్లు జలదిస్తోంది.

అడుగో, సుబ్బారాయుడు, సీటు ముందు స్టూలు మీద కూర్చుని వాడు ఇందాకటినుంచీ ఇటే చూస్తున్నాడు. లావుపాటి కళ్లద్దాలూ, కారు నలుపు శరీర వర్ణానికి తోడు ముదురు పసుపురంగు చొక్కా, సగం సగంగా నెరిసిన జుట్టూ - దయ్యపు కళ్ల వెధవ! వాడి చూపులు పరమ వెకిలిగా... ఆకలిగా... నీచంగా... అన్నిటికీ మించి పెంట కలరు జీన్స్ ప్యాంటూ - వాడికి తగినట్టే.

ప్యూను వచ్చి, "అయ్యగారు...!" అని మాత్రం అన్నాడు. అంటే అయ్యగారు పిలుస్తున్నారు అని అర్థం.

ఆమె లేచి నడుం కలుక్కుమనగా మౌనంగా బాధ భరించింది. తర్వాత తేరుకుని కొంగు మెడ చుట్టూ చుట్టుకుని నడిచి వెళ్లి ఆఫీసరు గదిముందు స్ప్రింగ్ డోర్ నెట్టింది. అనుకున్నట్టుగానే ఆఫీసరు ఒంటరిగా లేడు. ఎవరో పరాయివాడు కూడా కూర్చుని ఉన్నాడు.

వెళ్లగానే తలెత్తి చూసి, "ఏం? ఇంకా కాలేదా?" అని అడిగాడు.

"అవుతుంది. అవుతున్నది!" అన్నదామె బలహీనంగా.

"ఇవాళ టపాలో వెళ్లాలి. స్పీడప్ చేయాలి. ఊc!" అన్నాడాయన. మధ్య వయసు దాటినవాడే. కానీ ఆయన కిదో దురద. ఎవరైనా మాట్లాడుతున్నప్పుడు కావాలని తనను పిలుస్తాడు. తన చేతికింద ఇంతటి అందగత్తె పని చేస్తున్నదని అవతలివాడికి తెలిసి వాడు ఆశ్చర్యపోవాలని వీడి తాపత్రయం.

"ఊc!" అన్నాడాయన మళ్లీ - 'వెళ్ల'మన్నట్టు సూచిస్తూ.

వల్లి ఇతవలికి వచ్చిపడింది. సీటులో కూలబడింది మళ్లీ. ఎదురుగా పెద్ద అంకెల పుస్తకం. బెర్ముడా ట్రయాంగిల్లాగ, బ్రహ్మజెముడు పొదల్లాగ... నోరు

తెరుచుకున్న బ్రహ్మ రాక్షసిలాగ... అది తనను మింగబోతున్నది. కాని తాను దానికి చిక్కబోవడంలేదు. మహా అయితే ఈ ఒక్కరోజు... ఈ భయం, ఈ బాధ.. అంతే!

సరిగ్గా ఒంటిగంటకు కరెంటు పోయింది. అంతవరకు అంతంత మాత్రంగానైనా తిరుగుతున్న పాత ఫ్యాను ఇప్పుడు వేగం తగ్గి... తగ్గి... తర్వాత మరింత తగ్గి... చివరకు 'బర్'మని శబ్దం చేస్తూ ఆగిపోయింది.

ఎదురుగా మరో ఆఫీసులో నుంచి లత వచ్చింది.

"ఇంకా కూర్చున్నావేం? రా!" అన్నది వస్తూనే. "ఏదైనా ఇంత తిని కాఫీ తాగొద్దాం. రా!'

వల్లి లేచింది.

ఇద్దరూ మూడంతస్తులూ దిగి కిందకి వచ్చారు. అక్కడి నుంచి తలెత్తి చూస్తే ఆ బ్రహ్మాండమైన కట్టడం అర్ధగోళాకృతిలో పెద్ద ఖాళీ స్థలంలో కట్టబడిన భద్ర భవనం. అందులో చిన్నా, పెద్దా, ప్రభుత్వ, ప్రభుత్వేతర అనేక ఆఫీసులూ – మొత్తం కలిపి వేయి మందికి పైగా చిన్నా చితకా ఉద్యోగులు... ఉదయం పది గంటల వేళ మొదలు ఘోరమైన సందడి. ఉన్న ఒక్క లిఫ్టు ముందు భయంకరమైన క్యూ ఎంతకూ తరగదు. ఎక్కువ మంది ఓపిక చేసుకుని మెట్లెక్కి పైకి పోతారు. వెళ్లి తమ తమ సీట్లలో కూలబడి ఆ ఆయాసం తీరేవరకు కూర్చుండిపోతారు తప్ప, కాగితాలేవీ ముట్టుకోరు.

లత ఏదో మాట్లాడుతున్నది. వల్లి వింటున్నది.

"రాత్రి ఆయనా, నేనూ చాలా పొద్దుపోయేదాకా టీ.వీ.లో సినిమా చూస్తూ కూర్చున్నాం. పన్నెండు దాటింది పడుకునేసరికి!"

వల్లి లోలోపల – 'నేనూ మా 'ఆయనా' కూడా రోజూ పొద్దుపోయేవరకూ మేలుకునే ఉంటాము. పన్నెండేమిటి? రోజూ పడుకునేసరికి తెల్లవారుజామున ఏ రెండో రెండున్నరో అవుతూ ఉంటుంది. నాకు నిద్రే ఉండదు. అతను మాత్రం బారెడు పొద్దెక్కే దాకా శవంలాగా పడి నిద్రపోతాడు' అనుకుంటున్నది.

లత మొగుడు పరమశివన్. ఒక ప్రవేటు కాలేజీలో పనిచేస్తూ ఉంటాడు. సన్నగా, పొడవుగా చామనఛాయతో ముచ్చటగా ఉంటాడు. లతకు కాస్త తల నొప్పిగా ఉంటే చాలు, విలవిలలాడిపోతాడు. అతని కాలేజీ పని రోజూ సాయంకాలం నాలుగింటికే అయిపోతుంది. నేరుగా ఇంటికే వచ్చేసి వంట ఇంట్లో సెటిలైపోయి కాఫీ తయారుచేసి ఫ్లాస్కులో పోసి ఉంచి, రాత్రికి కావలసిన వస్తువుల గురించి ఆలోచిస్తూ ఉండిపోతాడు. లత వెళ్లగానే పొగలు కక్కే అద్భుతమైన కాఫీ ఇచ్చి ఎదురుగా ఆహ్లాదకరంగా మాట్లాడుతూ కూర్చుంటాడు. అతను చదువుకున్నదీ, కాలేజీలో బోధిస్తున్నది ఇంగ్లీషు సాహిత్యం కదా!

వల్లి ఉలిక్కిపడింది.

లత పెద్దగా, "నిన్నే! ఏ లోకంలో ఉన్నావు?" అని హెచ్చరించడంతో ఈ లోకంలోకి వచ్చింది.

"తినకుండా అలా బొమ్మలా కూర్చున్నావేం?" అంటున్నది లత. ఎదురుగా ప్లేటులో ఇడ్లీలు.

"ఇడ్లీలా?" అన్నది వల్లి.

"అవును. ఇందాక అడిగితే 'ఊఁ' అంటివిగా?"

"సరే."

ఫలహారం ముగించి మళ్లీ వచ్చారిద్దరూ. వల్లి సీటులో కూలబడింది మళ్లీ.



నోరంతా అరుచిగా ఉంది. ఒళ్లంతా సన్నగా నొప్పులు. తన మొగుడు గుర్తొచ్చాడు. అసలు తను వాణ్ని మరిచిపోయిం దెప్పుడు? ఆ విలన్‌గాడు తన మెళ్లో పుస్తె కట్టి తనకు మొగుడయ్యాడు. తన శరీరం... తన మనస్సు... తన సంపాదన - అన్నిటిమీదా ఆధిపత్యం సంపాదించాడు. అంతకుముందు పెళ్లిచూపుల పేరుతో అయిదుసార్లు అందరిముందూ తల వంచుకుని సంతలో జంతువులాగున కూర్చుని అడ్డమైనవాళ్లూ అడిగిన అడ్డమైన ప్రశ్నలకూ అతి వినయంగా సమాధానాలిచ్చి మెప్పించినా ఫలితం లేకపోయింది. ఇక 'ఇక ఈ పిల్లకు అసలు పెళ్లయ్యే యోగం ఉన్నట్టు లేదు, అని తండ్రి పుట్టెడు దుఃఖంతో పోయాక వీడొచ్చాడు చివరికి. ఈ సంబంధం తెచ్చిన పెద్దమనిషి మహా గొప్పగా ఇద్దైపోతూ వర్ణించాడు. అంతకుముందు ఇద్దరు బంగారు బొమ్మల్లాటి ఆడపిల్లల పాలిట పెద్దపులి అనీ, వారి డబ్బు తప్ప వాడికింకేమీ అక్కర లేకపోయిందనీ మాత్రం చెప్పలేదు.

'కట్నం పైసా అయినా అక్కరేదుట. పెళ్లి మాత్రం చేస్తే చాలుట!" అని చెప్పగా, ఆమె అన్నా, వదినా అదే చాలు పది వేలనుకుని సంతోషించి అన్నింటికీ ఒప్పుకున్నారు. అన్న కూడబెట్టిన కాస్త డబ్బు... తన రెండేళ్ల సంపాదనా తగలేశారు ఈ పెళ్లికి. ఆ తర్వాత తనకు తెలిసి వచ్చింది అసలు సంగతి. ఇద్దరు పెళ్లాలను, వారి సంపాదనలు... ఆస్తిపాస్తులు, బీమా మొత్తాలు సహా మింగిన ప్రబుద్ధుడి సంగతి. వీడొక ప్రైవేటు కంపెనీలో రెండు చేతులా సంపాయిస్తూనే ఉంటాడు. దొంగ బిల్లులూ, దొంగ సంతకాలూ... ఇవి సరేసరి! వీడికి కావలసింది అర లక్షో, లక్షో కట్నం కాదు. జీవితాంతం సంపాయించే ఆడది కావాలి. నిరంతరం శారరీక సుఖమూ, నెల నెల బంగారు గుడ్లు పెట్టే బాతులాగా నిరంతరం సంపాయించి పెట్టే పెళ్లాం కావాలి. వీడు మిగిలిన మగవాళ్లలాగా కాదు, చాలా తెలివిగలవాడు. చక్కగా మంచి ఆరోగ్యం - అదీ అన్నీ వీళ్లూ వసతులు ఉన్న ప్రభుత్వోద్యోగం చేస్తున్న ఆడ యంత్రం కావాలి. ఇంట్లో పనిపాట్లు కూడా సణక్కుండా, వంచిన నడుం ఎత్తకుండా చేసే దాసి కావాలి. పడగ్గదిలో తన ఇష్టం వచ్చినట్టు కదిలే బొమ్మ కావాలి.

నిరంతరం ధనవర్షం కురిపించే ధనదేవత కావాలి. ఈ తెలివితేటలు పండిన మేధావి అతను.

ఆ విధంగా తను వాడి పాలబడింది. డబ్బు విషయంలో మహా జాగ్రత్త వాడికి. పైసా మాత్రమే పరమాత్మ స్వరూపం అని భావిస్తాడు. ఆ విషయంలో తనవారని, పైవారని భేద బుద్ధి కించిత్తయినా లేదు. తన వైపు వారైనా సరే, ఎందరో లేరు – ఒక తమ్ముడూ, వాడి పెళ్లాం, పిల్లలూ – ఎప్పుడైనా పుష్కర కాలాని కొకసారి "అయ్యో! అన్నయ్యే!" అని ఎప్పుడైనా చూసిపోదామని వస్తే మొహం మాడ్చుకుంటాడు. వాళ్లు ప్రేమగా పలకరిస్తే ముక్తసరిగా 'ఊఁ, ఆఁ' అంటాడంతే! వాళ్లు చిన్నబుచ్చుకుని కూడా, 'వదినమ్మ'తో కాసేపు మాట్లాడి వెళ్లిపోతారు. ఇక తన అన్నావదినలు వీడి తరహా చూసి, ఎప్పుడో రావడం మానేశారు. అప్పుడప్పుడు ఒక ఉత్తరం ముక్క. అంతే! తాను రోజూ ఉదయమే లేచి సర్వవిధాలైన చాకిరీ చేసి వండిపెట్టి, అన్నీ సర్దిపెట్టి, వాణ్ణి సాగనంపి ఉరుకులు పరుగులుగా ఆఫీసుకు వెళ్లాలి. ఎప్పుడైనా ఓపిక లేక సెలవు పెట్టి ఇంట్లో విశ్రాంతి తీసుకుందామనుకుంటే ఇంకా ఘోరం. ఆనాడు సెలవు పెట్టి ఇంట్లో ఉండిపోతాడు. ఆ పగలూ రాత్రవుతుంది. ఇక విశ్రాంతి ఎక్కడ?



వల్లి మళ్లీ ఆవులించింది.

తలంతా దిమ్ముగా ఉంది.

చేతి సంచిలో వెదికి ఒక టాబ్లెట్ తీసుకుని మింగి గ్లాసెడు నీళ్లు తాగింది. తర్వాత ముందున్న పుస్తకం మూసి, తాను అంతకుముందు టైపు చేసి సిద్ధంగా ఉంచుకున్న కాగితాన్ని ఒక కవరులో ఉంచి పైన ముచ్చటగా ఆఫీసరు పేరు రాసి మరునాడు అందజేయమని సుబ్బారాయుడి చేతికిచ్చింది. వాడు దాన్ని ఈ రాత్రికి ఎట్లాగూ చదవకుండా ఉండలేదు. 'అందులో ఏ ప్రేమ లేఖో ఉంటుంది. థ్రిల్ అనుభవించవ'చ్చని తప్పకుండా అనుకుంటాడు. ఆ కవరు అందుకుంటూ "ఏముందందులో?" అని అడిగాడు కూడా. తాను ఏమీ బదులు పలక్కుండా ఇవ్వడంతో వాడు మరిన్ని ఊహాగానాలు చేస్తాడు.

మళ్లీ వచ్చి కూర్చుంది.

ఇలా తన మొగుడి యావ అంతా, మోహం అంతా డబ్బు మీదే కదా! ఇక వాడితో మరో పెద్ద యాతన ఉంది. నిజానికి అదే అన్నిటికన్నా బాధాకరం. వాడంత డబ్బు మనిషి అయినా, పిసినారి అయినా, అప్పనా తనా మనా అనేది లేని వాడైనా తనకేమీ దిగుల్లేదు. వాడి పైశాచికపు ప్రవర్తనతోనే అసలు బాధ అంతా. రోజల్లా మాటా, పలుకూ లేకుండా ఒంటరి మూగ జంతువులాగ, మాట్లాడితే ఎక్కడ పెళ్లానికి లోకువై పోతానో అన్నట్టు కూర్చుంటాడా? ఇక రాత్రయితే... వాడి దుగ్ధ చెప్పతరం కాదు. నెమ్మదీ, సున్నితమూ, నిదానమూ లేదు. ఒట్టి గొడ్డులాగ

ప్రవర్తిస్తాడు. బాధపెట్టడం, హింసించడం తప్ప, మరో కళ తెలియదు. ఏవేవో మందు బిళ్లలు మింగి అనేక రకాలుగా ప్రాణాలు తోడేస్తుంటాడు. అన్నిటికీ మించి పిల్లా జెల్లా అనే ఆరాటమే లేదు. ముద్దొచ్చే పసిపిల్లలు కనిపిస్తే మామూలుగా ఎవరైనా ముచ్చటగా చూస్తారు. పలకరిస్తారు. దగ్గరికి తీసుకుంటారు. మరీ చిన్న పిల్లలైతే ఎత్తుకోవాలనీ అనుకుంటారు. కానీ ఈ గొడ్డు వెధవకు ఎంత ముద్దొచ్చే పిల్లలను చూసినా చలనమే ఉండదు. పైగా విసుక్కుంటాడు. రెండుసార్లు నానా గొడవ చేసి బంగారంలాటి కడుపులు బలవంతంగా తీయించేశాడు - దుర్మార్గుడు!

ఇక... ఇప్పుడు... ఇవ్వేళ...

వల్లి లేచింది. నెమ్మదిగా మెట్లు దిగి కిందికి వచ్చింది.

ఇన్నాళ్ల తన అనుమానం తీరాలి... అది అనుమానం కాకూడదు. నిజమే కావాలి!



మరో గంటలో...

వల్లి డాక్టరు వనజమ్మకు నమస్కరించి బయటకు వచ్చింది. సంతోషంతో తూలిపోతూ నడిచింది. ఆటో పిలిచి ఎక్కి "పోనివ్వ"మన్నది. ఆమెకు గర్వకారణంగానూ ఉంది. అమితానందంగానూ ఉంది. ఇన్నాళ్లూ ఒక మగాడికి చాకిరీ చేసే దాసిగాను, పరిచారికగాను, డబ్బు సంపాదించిపెట్టే మరబొమ్మగానూ, పడకటింటి వేశ్యగానూ జీవితం గడిచింది. ఇక అలా కాదు. తన జీవితం తనది. తన కోసమే తాను బతుకుతుంది. ఒకే ఒక అందాల పుష్పం పూచిన చెట్టులాగ బతుకుతుంది.

ఇంటికి చేరుకోగానే తన అదృష్టం కొద్దీ ఇల్లు గల వారి అబ్బాయి ఎదురుగా వచ్చి తాళం చెవీ, ఒక ఉత్తరం అందించి "అంకుల్ ఇమ్మన్నారు!" అన్నాడు.

పెద్ద ఉత్తరమే. తాను అర్జంటుగా ఆఫీసు పనిమీద (అంటే బోలెడు డబ్బు ఇన్వాల్వ్ అయి ఉంటుందందులో) క్యాంప్ వెళ్లవలసి వచ్చిందనీ, మూడు నాలుగు రోజుల మకాం అనీ అసలు విషయం. మిగిలినవన్నీ బోలెడు జాగ్రత్తలు- పత్రికల్లో గ్రహఫలాలలాగ - రోడ్డుకు ఎడమ వైపునే నడవమనీ, పెద్దలతో, అధికారులతో జాగ్రత్తగా, మర్యాదగా వ్యవహరించమనీ, శ్రమానంతరం ఫలితం సంభవమనీ వగైరా... వగైరా...

వల్లి తలుపు తీసి లోపలికి వెళ్తూనే ఆ ఉత్తరాన్ని ఉండ చేసి శక్తికొద్దీ మూలకు విసిరికొట్టింది. ఫ్యాన్ పెట్టుకుని కాస్సేపు అలా పడుకుండిపోయింది. తర్వాత వంట చేసుకుని తిని, పెందరాళే నిద్రకు పడింది. ఎన్నాళ్ల తర్వాతనో ఇన్నాళ్లకు హాయిగా ఒళ్లు తెలియని కలలు లేని బంగారం లాంటి నిద్ర.

ఉదయమే లేచి ఒళ్లు విరుచుకుంది. కిటికీలోనుంచి హాయిగా గాలి వీస్తున్నది. కిటికీ పక్క మందార చెట్టు ఎర్రని పెద్ద పూలు పూచింది. గోడ మీద ఏదో చిన్న పక్షి మధురమధురంగా రాగాలు తీస్తున్నది.

వల్లి కాసేపు అలాగే పడుకుని తర్వాత లేచి ఎన్నడూ లేనంత ఆనందంగా, రుచిగా కాఫీ పెట్టుకుని తృప్తిగా సేవించింది. అరగంటసేపు స్నానం చేసింది. తర్వాత గుప్పెడు జీడిపప్పు వేసి, ఇంత నెయ్యి పోసుకుని ఉప్మా తయారుచేసుకుని సుష్టుగా ఆరగించింది.

కాస్సేపు పేపరు చూసింది.

తర్వాత 'టైమవుతున్నది' అనుకుంటూ, లేచి తన సూట్‌కేస్‌లో కేవలం తనవీ, తనకు సంబంధించినవీ మాత్రం వస్తువులు సర్దుకుంది. రాత్రి బాగా ఆలోచించి అతి క్లుప్తంగానూ, నిశితంగానూ రాసిన ఉత్తరం మడిచి ముందు హాల్లో స్టూలు మీద ఉంచి బరువు ఉంచింది.

తరువాత తలుపులన్నీ జాగ్రత్తగా వేసి, ముందు తలుపు తాళం మరింత జాగ్రత్తగా వేసి లాగి చూసింది. ఇల్లు గల వారి అబ్బాయిని పిలిచి, తాళంచెవి అందజేసి "వారొస్తే ఇవ్వండి!" అని మాత్రం చెప్పి, ఇవతలికి వచ్చింది.

నలభై ఐదు నిముషాల తర్వాత వేగంగా వెళ్తున్న రైల్లో... తనదైన జీవితం వైపు... కేవలం తనదైన మంజుల భవిష్యత్తు వైపు... తాను పుష్పించి ఫలించవలసిన దిక్కుకు... వేగంగా... వేగంగా...

# ముఖచిత్రం

కమలా పళ్ళు వొలిచి ముందు పళ్ళెంలో పెట్టుకుంటున్నాను వరుసగా. . మూడు... నాలుగు... అయిదు... ఇలా.

అంతలో నా ఎదురుగా అంతవరకూ కూర్చుని నా వంకనే చూస్తూన్న ఎత్తుపళ్ల మెల్లకన్ను అర్ధనగ్నపు వెధవ ఒకడు పళ్లన్నీ బయటపెట్టి నవ్వుతూ "అయ్యగారూ! పురుగులు... పురుగులు" అన్నాడు.

చూద్దునుకదా! పళ్లన్నీ పురుగుల మయం... పురుగులు లుకలుక లాడుతున్నాయి.

"ఛీ! పాడు..." అని అన్నీ తోసేసి లేచి వెళ్లి చేతులు కడుక్కుని వచ్చాను. తీరా చూస్తే ఆ వెధవ వాటిని దులుపుకుని అబగా తింటున్నాడు.

విసుగ్గా లేచి వీధిలోకి వచ్చి నడవసాగాను.

ఈ సాగడం ఏమిటి? వెనకటికి ఒక రచయిత్రి (అవును రచయిత్రే... బాగా గుర్తు) ఈ సాగడం విపరీతం చేసేది. 'ఆమె నడవసాగింది... కళ్ల నీళ్లు తుడుచుకోసాగింది. అతడు విలపించసాగాడు.' అంటూ.

ఈ వీధులన్నీ జనసంచారంతో భయంకరంగా ఉన్నాయి. ఇంతమంది జనం హఠాత్తుగా ఇంత తక్కువ వ్యవధిలో ఎలా ఎక్కడి నుంచి పుట్టుకువచ్చారు దేవుడా?

దూసుకుపోతున్నారందరూ. ఎవరిదారి వారిదిలా వుంది. ఎవడూ ముందువాణ్ణి చూడ్డం లేదు. మనిషిని మనిషి పలకరించడంలేదు. చిరునవ్వులు లేవు. ఒకణ్ణి ఒకడు తోసుకుంటూ ఎక్కడ ఒక్క క్షణం వృథా అయిపోతుందో అన్నట్టు కొందరు కాలి నడకన... . కొందరు ద్విచక్ర వాహనాల మీద... మరి కొందరు నిర్భాగ్యులు త్రిచక్ర వాహనాల మీద... కొందరు కుబేరాంశలో పుట్టిన వారు నాలుగు చక్రాల వాహనాల మీద దూసుకుపోతున్నారు. మధ్యమధ్యలో దేని క్రిందనోపడి ఒకడో అరో, ఆడవాళ్లో, మగవాళ్లో, ముదుసలులో, పసిపిల్లలో క్షతగాత్రులవుతున్నారు. వాళ్లను తీరిక, దయ గల 'స్థానికులు' లాగి బళ్లలో వేసుకుని జనరల్ ఆసుపత్రులలో పడేసి మళ్లీ తమ తమ పనులమీద పరుగులు పెడుతున్నారు. కొందరు లంచాల నిమిత్తం, కొందరు ముడుపుల నిమిత్తం, కొందరు ఆఫీసులలో కేవలం కాలక్షేపానికి పరుగులు పెడుతున్నారు రొప్పుతూ... రోజుతూ...

వీధిలో నడుస్తుండగా వీడు - జగన్నాథం... ఎదురైనాడు నాకిప్పుడు. శనిమొహంవాడు. జీవితం అన్నీ యిచ్చినా తృప్తిలేదు వీడికి. ఇప్పుడే కాదెప్పటి నుంచో తృప్తి వీసమన్నా ఎరుగడు వీడు. నన్ను చూసి నవ్వుతూ వచ్చి

పలకరించాడు. నా ముందు నేల మీద ఏదో ఖాళీ కాగితమూ, ప్లాస్టిక్ ముక్క ఉంటే వాటిని పదిలంగా అందుకుని మడతపెట్టి జేబులో పెట్టుకుని "ఎందుకైనా పనికొస్తాయి" అన్నాడు.

ఆ తర్వాత చాలా గొప్ప విశేషం చెబుతున్నట్టు, "అన్నట్టు మా అమ్మాయిని ఎంసెట్ లాంగ్ టర్మ్ కోచింగ్‌లో చేర్చా"నన్నాడు. నాకు గుర్తొచ్చింది. చాలా రోజుల క్రిందట ఒకనాటి ఉదయం వీడు ఒక పెట్టె, చాప చుట్ట, ప్లాస్టిక్ బొక్కెనా, చెంబూ వగైరాలు పట్టుకుని కూతురిని వెంటబెట్టుకుని నడిపించుకుంటూ రైలు స్టేషనుకు వెళుతూ నాకు ఎదురై నేను 'ఎక్కడికి?' అని అడిగితే అప్పుడేమీ బదులు పలకలేదు. బహుశా ప్రయాణమై వెళ్లే వాడిని 'ఎక్కడకని' ప్రశ్నించకూడదనే సెంటిమెంట్ వల్లనేమో! ఇప్పుడు నేనేమీ అడగకుండానే వెకిలిగా నవ్వుతూ గొప్పగా చెబుతున్నాడు. 'అక్కడ రూము అదీ మాట్లాడి అన్నీ అమర్చిపెట్టి వొచ్చేశాను. చాలా ఖర్చు అయిందిలే" అంటున్నాడు.

తర్వాత "టీ తాగుదామా?" అన్నాడు.

నేను కాదననని కాదనలేనని వాడికి తెలుసు.

అ ప్రక్కనే నాలుగడుగులు వేసి రోడ్డు పక్కన 'ఫాస్ట్... ఫాస్ట్... ఫాస్ట్ ఫుడ్స్' అని బోర్డున్న చోట నిలబడ్డాము. అక్కడా జనం. జనం... నిలబడి ఆబగా ఏదేదో మింగుతున్నారు. టీలు, కాఫీలు సాసర్లలో పోసుకుని తేమ అయినా మిగల్చకుండా జుర్రుకుంటున్నారు. పైనుంచి చెవులు బద్దలు కొడుతూ ఒక ఛండాలపు సినిమా బూతు పాట శబ్దపు మూటలాగా వచ్చి పడుతున్నది.

జనం వాళ్లలో వాళ్లు ఎదురెదురుగానే ఉన్నా తమ తమ గొంతులు పెంచి షడ్జమ స్థాయిలో పోచికోలు కబుర్లు చెప్పుకుంటున్నారు.

వాడు మాట్లాడుతున్నాడు. మొన్న కలుసుకున్నప్పుడేమో తమ ఇరుకు ఇంటిలోని తాతలనాటి 'కరివేపాకు' చెట్టు, అమిత లాభానికి అమ్మిన విధంబు చెప్పి నా ప్రాణాలు తీశాడు. ఇప్పుడీ కడుపున పుట్టిన సొంత కూతుర్ని వందమైళ్ల దూరంలో ఎమ్సెట్ కోచింగ్ సెంటర్లో చేర్చి వచ్చిన వైనం సవివరంగా – సాంగో పాంగంగా, సాంగంగా... వినలేక చస్తున్నాను. వాడు మాట్లాడుతున్నంతసేపూ కొంత దూరంలోని విద్యా వ్యాపార కేంద్రంగా పేరు పొందిన ఊళ్లో ఎక్కడో రూములో ఒంటరిగా 'ఎలాగో' ఉన్న ఆ అమ్మాయే గుర్తుకు వస్తున్నది. ఇంతకాలమూ అక్కడ కోచింగ్ పేరుతో పోయి హాయిగా గడిపి వొచ్చేస్తుందా అమ్మాయి. ఆపైన పరీక్ష... ఆపైన... ఏదో ఒక దుర్ముహూర్తాన... వీడి భార్య... పాపం.. మూడు దశాబ్దాలపాటు ఈ పిసినారి సింగరాజు లింగరాజుగాడి పెద్దన్న లాంటి ఈ దరిద్రుడికి పిల్లల్ని కన్న ఆ వృద్ధజీవి, ఆ సాధ్వి ఉన్నట్లుండి కళ్ల నీళ్లు పెట్టుకుని వొచ్చి "ఏమండీ! జరగరానిది జరిగిపోయిందండీ...?' అంటుందేమో!

'ఏమిటే? ఏమిటేమిట'ని వాడు ఆత్రుత ప్రదర్శిస్తాడా? లేక నిమ్మకు నీరెత్తి నట్టు కూర్చుని, 'ఏం కొంప మునిగిందని అట్లా ఏడుస్తావు? నాకు ముందే

తెలుసులే. అమ్మడు నాకు అంతా చెప్పిందిలే. డాక్టరు దగ్గరికి పోయివస్తే సరి. అంతా ఫినిష్' అంటాడా?

అయ్యో! ఇప్పుడు వీడి వాగ్బాణాలు నేరుగా నా మీద కురుస్తున్నాయి. ఎవణ్ణి గురించో చెబుతున్నాడు - "కాస్త జాగ్రత్తగా ఉండాలి వాడి విషయంలో. వాడసలే రోగ్... అలాంటి వాణ్ణి దరిజేరనిస్తావా?" అంటూ నాకు జాగ్రత్తలు చెబుతున్నాడు.

"వెళ్దాం... ఇంక" అంటే అప్పుడు కదిలాడు నా అదృష్టం కొద్దీ. అప్పుడే మరొకడు దొరికితే వాడి వెంటపడిపోయాడు.

నేను నిట్టూర్చి ముందుకు నడిచాను. వేగం. వేగం... వేగం ఎక్కువయింది. ఇక్కడో పెద్ద వంతెన.. ఫ్లై ఓవరు... దాని మీద రకరకాల బళ్లు దూసుకుపోతున్నాయి. మనుషులు మైళ్లకు మైళ్లు రోజూ ఇళ్ళ నుంచి ఆఫీసుకు, ఫ్యాక్టరీలకు, షెడ్డులకు ప్రయాణాలు చేసి కష్టపడుతున్నారు. ఎవరికీ శాంతిలేదు. నిలకడ అసలే లేదు. కొందరైతే ఎ.సి. రూముల్లో ఆపసోపాలు పడుతున్నారు. కొందరు తమ క్రింద పనిచేసే వారిని నంచుకుతింటున్నారు. పోలీసులు మామూళ్లు, ముడుపుల కోసం, లాయర్లు అబద్ధాలు సుబద్ధాలుగా నిలబెట్టడానికీ, టీచర్లు క్లాసులలో కాక 'విద్యా బందిలదొడ్ల'లో పాఠాలు చెప్పడానికీ పరుగులు పెడుతున్నారు. వయసులో ఉన్న ఆడపిల్లలు చేతులలో టిఫిన్ బాక్సులతో మెడలకు, భుజాలకు బ్యాగులతో దుకాణాలలో అరవ చాకిరీ చెయ్యడానికీ, స్కూలు పిల్లలు తమ బాల్యం అంతా పుట్టగానే ఖర్చయిపోయి దిగులుగా ఏడుపు మొహాలతో స్కూళ్ళకూ పరుగెత్తుతున్నారు. బస్సులలో, రైళ్లలో ఆసుపత్రులలో, హోటళ్లలో, దేవాలయాల్లో అంతటా క్రిక్కిరిసిన జనసందోహం... మామూలు మనుషుల, అసంతృప్తజీవుల, పసిమనసులలో పంచరంగులు కృత్రిమ ప్రపంచాలు సృష్టించే ఖరీదైన రంగుల అశ్లీల చలన చిత్రాలు కోట్లు కోట్లు పెట్టుబడితో నిరంతరం తయారవుతున్నాయి. మద్యం దుకాణాలు నిరంతరం తెరవబడి ఉంటున్నాయి. దేవాలయాల్లో ప్రభుత్వ ముద్రణాలయం నుంచి అప్పుడే బయటకు వచ్చిన కొత్త అయిదు వందల రూపాయల నోట్ల కట్టల్లా నవనవ రెపరెపలాడుతున్న పూజారులు అందరి తరఫునా శత సహస్ర నామార్చనలు ముగించి అనంత కోటి దేవతలకు పూజలు చేసి అందరినీ 'వ్యాపారాభి వృధ్యర్థం' అని దీవిస్తున్నారు. బుద్ధిహీనులు, మందమతులూ కోట్లాది మంది నిష్క్రియాపరులై ఉదయం నుంచి సినిమా హాళ్లలో కూలబడి పనికిమాలిన హాస్య అశ్లీల చిత్రాలు చొంగ కార్చుకుంటూ చూస్తున్నారు. నటవిట గాయక బృందం రాజకీయ రంగ ప్రవేశం చేసి రాణిస్తున్నది. రాజకీయ ధూర్తులు రాబోయే ఎన్నికలలో విజయం సాధించేందుకు అవసరమైన అన్ని చిట్కాలూ నేర్పేందుకు తమ తమ కార్యకర్తలకు నిరంతర శిక్షణ శిబిరాలు నిర్వహిస్తున్నారు. అంతటా తొడ తొక్కిడి...

'రామనాథం ఎట్లా ఉన్నాడో' అనిపించింది. 'పోనీ ఒకసారి చూసి వద్దాం. అడ్డంపడి ఉన్నాడు నెల రోజుల నుంచీ...' అనుకున్నాను. అటు నడిచాను. రోడ్ల

కటూ యిటూ అన్నీ ఎత్తయిన అపార్ట్‌మెంట్లు.. కాస్త ఖాళీ స్థలంలో నేరుగా పైకి... పైపైకి వ్యాపించిన కట్టడాలు. వాటి మధ్య అక్కడక్కడ బీదాబిక్కి ఇళ్లు ఉంటే అవి బిక్కచచ్చి బిక్కు బిక్కుమంటున్నాయి. వాటిలో మగ్గుతూ బ్రతుకుతున్న వాళ్లకు గాలి లేదు. వెలుతురూ లేదు.

ఈ పెద్ద బిల్డింగ్‌లో మూడవ అంతస్థులో రామనాథం. మంచంలో 'తీసుకుంటున్నాడు.' నాకు తెలిసిన ఇటీవలి సమాచారం ప్రకారం 'ఇహనో ఇప్పుడో' అనేట్టున్నాడు. ఆవరణలోకి వెళ్లి. లిఫ్టు ముందు నిలబడ్డాను. అక్కడ నా ముందు వచ్చిన వాళ్లు చాలా మందే ఉన్నారు. చాలాసేపు వేచి ఉండాల్సిన పరిస్థితి. పోనీ మెట్లెక్కి పైకి వెళితే...? అమ్మో! అలుపు వచ్చి మనం పడిపోయే ప్రమాదం పుష్కలంగా ఉంది. అలాగే నిలుచున్నాను. లిఫ్టు కిందకీ పైకీ వొస్తూ పోతూ ఉన్నది. నా కాళ్ల క్రింది నుంచి ఒక అవ్యక్త మూగ రోదన ధ్వని. ఆశ్చర్యపోతూ చెవులు రిక్కించుకుని విన్నాను. నిజం! ముందు ఏదో బాధతోకూడిన మూలుగు ధ్వని... కొన్ని మాటలు... అవును... మాటలే... భూదేవి... ఘోష పెడుతున్నది...! 'పైనుంచి ఇన్ని అంతస్తులలోని ఇన్ని కాపురాలలోని ఇందరు మనుషులు – పాపాత్ములైన మనుషులు – వొదిలే కల్మషాన్ని, కాలుష్యాన్ని ఎట్లా భరించాలిరా దుర్మార్గులారా? ఇలా నేనెన్నాళ్ళో సహించలేనురా' అంటూ భూమాత ఘోష పెడుతున్నది.

నాకు మతిపోయినట్టయింది. ఈ ఘోష – హృదయ విదారక ఘోష – ఇంకెవ్వరికీ వినబడటం లేదా? నాకొక్కడికీ వినబడుతున్నదా? ఇతరులకు వినబడినా వినబడనట్టే ఉంటున్నారా?

ఏమిటో, అంతా అయోమయం అనిపించింది. ఇంతలో ఎవరో పలకరించారు– కాస్త ముఖపరిచయం ఉన్నవారనుకుంటాను.

"ఏమిటిలావచ్చారు?" అని.

చెప్పాను.

ఆ వ్యక్తి ఆశ్చర్యపోయి "రామనాథమా? ఇంకెక్కడి రామనాథమండీ! పోయి వారం పైన అయిందిగా!" అన్నాడు చప్పరిస్తూ.

నివ్వెరపోయి "అయ్యో! పాపం. పోయాడా!" అన్నాను.

"అవును పోయాడు" అన్నాడాయన రెట్టిస్తూ.

"జీవితమంతా కట్టుకున్న గయ్యాళి భార్య కోసం, కన్న బిడ్డల కోసం తాపత్రయపడ్డాడు. చివరకు మంచంలో పడి తీసుకుని తీసుకుని 'పోడేం ఎంతకీ' అని తన వారి చేతనే అనిపించుకుని మరీపోయాడు!" అంటున్నాడాయన ఇంకా.

జీవితాన్ని బ్రతికున్నన్నినాళ్లూ మోహించడం... తర్వాత నిశబ్దంగా నిష్క్రమించడం... 'ఏమీ చూసీ నను మోహిస్తివీ. దేహ మేలాటిదని తలపోస్తివీ' అని ఎవరో ఎప్పుడో ఏదో రైల్లో అడుక్కుంటూ పాడిన పాట గుర్తుకు వచ్చింది.

అయిందా? తిరిగి ఇంటి ముఖం పట్టాను.

ఇప్పుడు పెద్ద వంతెన మీద నడుస్తున్నాను. ఫుట్‌పాత్‌ల మీద రకరకాల వ్యాపారాలు నడుస్తున్నాయి. రోడ్ల మీద వాహనాల జోరు. ఒక చోట ఆగి అలసట తీర్చుకుందామనుకున్నాను. రైలింగ్‌లమీద ఆనుకుని నిలుచున్నాను. క్రింద రైళ్ల రొద. ఆవులించాను.

ఇంతలో నా చూపు క్రిందికి మళ్లింది. బ్రిడ్జి క్రింద ఎన్నెన్నో రైలు పట్టాల పక్కన రాతి కట్టడానికి పక్కగా ఒక మూలగా మందమైన వెలుతురులో, ఒక మానవ కళేబరం... ముందు 'ఎవరైనా నిద్రపోతున్నారేమో అక్కడ' అనుకున్నాను. కాని ఎంత నీచులకైనా, నిర్భాగ్యులకైనా ఇది నిద్ర వేళ కాదు.

అప్రయత్నంగా నా ముందు నడిచిపోతున్న ఒకణ్ణి ఆపి, "అటు చూడండి. అక్కడెవరో..." అంటున్నాను. వాడు విరక్తిగా "అదే పని మనకు..." అంటూ ఎగతాళిగా నవ్వి వెళ్లిపోయాడు.

నేను జాగ్రత్తగా మెట్లు దిగి క్రిందికి వెళ్లి చూశాను. ఇప్పుడు స్పష్టంగా కనిపించింది. అది శవమే! ఇంకా క్రిందికి దిగాను. వయసులో ఉన్న ఆడపిల్ల. తెల్లని చీరె... ఆకుపచ్చ రంగు జాకెట్టు... బోలెడు జుట్టు. అంతా చెదిరిపోయి ఉంది. ముఖం స్పష్టంగా కనిపించడంలేదు. పక్కన ఒక సంచీ. నేను నిట్టూర్చి ఇవతలకి వచ్చాను. మనసులో ఏదో తెలియని ఆందోళన... అనవసరమైన దిగులు... చింత... నిండు నూరేళ్ళూ నిశ్చింతగా జీవించవలసిన ఆడపిల్ల అట్లా దిక్కులేని చావు చస్తే.

వంతెన క్రిందనే పోలీసు స్టేషను. అటు త్వరత్వరగా నడిచాను. ఎదురుగా ఎర్ర ఇటుకల ఎత్తయిన గోడ. పైన బోర్డు. గుమ్మం పక్కన చేతిలో బందూకుతో ఒక పోలీసు. ఆ గుమ్మం చూస్తే భయం వేసింది. ఏదో భయంకర మృగం తాలూకు తెరుచుకున్న గుహ లాంటి నోరులా ఉంది గుమ్మం....

లోపల ఎక్కడో వరండా దాటి లోపలికి వెళితే అధికారులు - ఖాకీ దుస్తుల్లో పెరిగిన పొట్టలతో, బొడ్డు క్రింది బెల్టులతో, ఆకలి చూపులతో కొందరు, కుర్చీలు పట్టకుండా బలిసిన కొందరు అధికారులు - ఈ దృశ్యం నాలో ఏదో తెలియని కంపం పుట్టించింది. ఎన్ని వృత్తాంతాలు వినలేదు? లోపలికి వెళితే లేనిపోని ప్రశ్నలు... సవాళ్లు.. అనుమానాలు.. వ్రాతకోతలు - సంతకాలు... ఇలా మొత్తం మీద మనం మనకు తెలియకుండానే ఏదో ఒక ఘోరమైన చక్రబంధంలో చిక్కుకోవలసి వస్తుందని ఊహ రాగానే వొణుకు పుట్టింది. ఒక్క ఉదుటున వెనుదిరిగి గబగబ నడిచాను. చాలా దూరం నడిచాను. అలసట వచ్చే దాకా నడిచాను. తర్వాత ఒక చోట ఆగి అలుపు తీర్చుకున్నాను. తర్వాత ఇంటి ముఖం పట్టాను. నడక వేగం మందగించింది.

జగన్నాథం ఎదురుగా వొస్తుంటే కంగుతిన్నాను. వాడు ఆదుర్దాగా, "ఒరే ఒరే! ఉత్తరం వొచ్చిందిరా ఇవ్వాళ... మా అమ్మాయి మూడు రోజుల నుంచీ

కనిపించడంలేదట... కోచింగ్ సెంటర్ వాళ్లు రాశారు." అంటూనే వేగంగా స్టేషన్ వైపు సాగిపోయాడు.

'దేవుడా!' అనుకున్నాను. మనసంతా మొద్దుబారిపోయింది. 'వీడి కూతురు ఎక్కడో క్షేమంగా ఉండే ఉంటుంది!' అనుకున్నాను మాటిమాటికీ.

లోపలికి వెళ్లి అద్దంలో ముఖం చూసుకుంటే వింత అనిపించింది. ప్రతిబింబంలో నా జుట్టు మొత్తం తెల్లగా పండిపోయి ముగ్గుబుట్టలా కనిపించింది.

# అందని ఆ రెండు ఫలాలు

"ఏమన్నాడయ్యా హెడ్ గుమాస్తా?" అని పరాంకుశం పలుకరించాడు ఇసాక్‌ను.

"పోనీ, చూద్దాం అన్నాడు" అని చెప్పాడు ఇసాక్.

'అంటేమని,, పోయాక చూద్దమనేగా?' అంటూ నవ్వాడు పరాంకుశం. ఇసాక్‌కు కూడా నవ్వు వచ్చింది కాని అది నవ్వే సందర్భం కాదు.

అయిదు నిముషాల క్రిందట ఇసాక్ స్కూలు ఆఫీసు గదిలోకి వెళ్లి హెడ్ గుమస్తాకు నమస్కారం చేసి ఎంతో అణకువగా తన తండ్రి పరిస్థితి బొత్తిగా బాగులేదనీ రోజు రోజుకూ ఆరోగ్యం క్షీణిస్తూ వచ్చి ఇప్పుడు బాగా ఆందోళనకరంగా మారిందనీ, వీధి చివరి వైద్యుడు అప్పుడే పెదవి విరిచి పెద్దాసుపత్రికి తీసుకువెళితే మంచిదని చెప్పాడనీ విన్నవించుకున్నాడు. హెడ్‌గుమస్తా అంతావిని "అయితే నన్నేం చెయ్యమంటావు?" అని అడిగాడు. "డబ్బు సార్... కొంచెం డబ్బు కావాలి?" అన్నాడు ఇసాక్, ఆయన అప్పుడు చిత్రంగా అన్నమాట– "పోనియ్. చూద్దాంలే" అని....

పైన ఎత్తుగా గుబురుగా దట్టంగా పెరిగిన నిద్రగన్నేరు చెట్టు ఆకులు ముడుచుకుని అప్పుడే నిద్రకు ఉపక్రమించినట్టున్నది. ఆ చెట్టు ఇరవై ఏళ్లనాటిది. ఆ స్కూలు మొదలుపెట్టిన మొదటి సంవత్సరం నుంచీ ఆ స్కూలువలెనే దినదినాభివృద్ధి చెంది శాఖోపశాఖలుగా విస్తరించి నేటికి ఇలా మహోన్నతంగా ఉంది. అప్పటి నుంచీ ఇసాక్ ఆ స్కూలు బస్సు డ్రయివరుగా పని చేస్తూనే ఉన్నాడు. ఇరవై ఏళ్ల ప్రాయంలో ఆ బస్సు చక్రం పట్టి, నడి వయస్సు దాటినా ఇంకా ఆ పనిలోనే ఉన్నాడు. ఆ స్కూలు పెరిగింది భవాలు పెరిగాయి. విద్యార్థుల సంఖ్య పెరిగింది. ఆదాయాలు లక్షలు కోట్లలో పెరిగిపోయాయి. విద్యార్థులకోసం మరి రెండు బస్సులు వచ్చాయి. అవి నగరంలో అన్ని మూలలకూ తిరుగుతూ ఉంటాయి.

ఎదురుగా మాయామహల్‌లాటి అద్భుతమైన కట్టడం. లెక్కలేనన్ని గదులు... వేల సంఖ్యలో విద్యార్థులు.

ఇంక కొద్ది సేపటిలో విద్యార్థులు – చిన్నాపెద్ద అందరూ – బిలబిలమంటూ బయటికి వస్తారు. పూల బంతుల్లాగా, గాలి బుడగల్లాగా, గలగలలాడుతూ... పరుగులు పెడుతూ... కొందరు పిల్లల తల్లిదండ్రులు గేటు బయట ఉంటారు. ఈ సమయంలో – పదుల సంఖ్యలో ఖరీదైన స్వదేశీ విదేశీ కారులూ... కొన్ని ఆటోలు... మరి కొన్ని రిక్షాలు...

ఇసాక్ పచ్చికలో కూలబడి ఉన్నాడు. మనసులో దృశ్యాలు... ముందు తమ ఇల్లు... పెద్ద ఇంటిలో చివర రెండు గదుల భాగం. ముందు గదిలో కిటికీ పక్కన మంచంలో తండ్రి... ఎవరెప్పుడు ఏమని పలకరించినా అన్నిటికీ సమాధానంగా దగ్గుతూ 'అల్లా పిలుపుకోసం ఎదురుచూస్తున్నాను' అంటూ ఉంటాడు. బంగ్లాదేశ్ యుద్ధంలో అబ్దుల్ హమీద్‌కు పరమవీరచక్ర మిగిలితే, ఇతనికి ఒక కాలు పూర్తిగాపోయి అవిటివాడై మిగిలిపోయాడు. ఇప్పుడిక చివరి దశ చివరి రోజులు కూడా గడిచి చివరకు గంటలు మిగిలినట్టున్నాయి.

ఇసాక్ చేతివ్రేళ్లు విరుచుకుని పండిన గడ్డం నిమురుకున్నాడు. కొన్ని చిన్న క్లాసులు వొదిలారు. పరాంకుశం బస్సు పిల్లలకోడిలా కదిలి వెళ్లిపోయింది. కొన్నికార్లు కూడా కదిలిపోయాయి.

ఇసాక్ తన మొదటి కొడుకు పుట్టగానే ఎన్నో కలలు కన్నాడు. వాణ్ణి బాగా చదివించి పెద్ద ఉద్యోగస్థుడిగానో ఆఫీసరుగానో చెయ్యాలని ఎంతో అనుకున్నాడు. హబీబ్ మంచివాడు. నెమ్మదస్తుడు. ఏళ్లు గడిచే కొద్దీ తండ్రిని గురించి, తమ ఆర్థిక స్థాయిని గురించీ ముందే అర్థం చేసుకున్నాడు. చదువు చాలా ఖరీదైనదనీ, తమకు అందరానిదనీ తేల్చుకుని వయసురాగానే పెద్దల నాశ్రయించి నగర కబేళాలో స్థిరపడిపోయాడు. ఉన్నంతలో తృప్తిపడటం నేర్చుకుని తనకు తగిన పిల్లను పెళ్లాడి విడిగా ఉంటున్నాడు. రెండోవాడు అన్వర్. వీడు బొత్తిగా లాభం లేదు. బుద్ధిమంతుడేగాని చదువు అబ్బలేదు. పైగా వేలువేలు ధారపోసి అందమైన చదువును 'కొనే' తాహతులేకపోయె. వీధి చివరి చవక బడులలో కొంత మేర చదివి విరక్తుడై ఒక స్కూటర్ మెకానిక్ దగ్గర కుదురుకున్నాడు. వాడికి అందులో ఆనందం లభించింది. చిన్నచిన్న తప్పులకే కాక తప్పు చేయకపోయినప్పటికి మెకానిక్ స్కూటర్ చెయిన్లూ, సైకిల్ ట్యూబులూ పెట్టి చావగొట్టేవాడు. మొదట్లో తన కొడుకును కొడతాడా అని ఇసాక్ కోపం తెచ్చుకునేవాడు. కాని కొడుకు అంతంత దెబ్బలు తింటూ కూడా కిమ్మనకుండా సహిస్తూ సర్దుకుపోవడం చూసి ఆశ్చర్యపోయేవాడు. అప్పుడప్పుడు "ఏరా? వాడు చచ్చేట్టు కొడుతూ వుంటే ఎందుకక్కడ చాకిరీ చెయ్యడం?" అని అడిగితే వాడు అరిందాలాగా నవ్వి "అట్టా అయితే తప్ప పని చేతకాదయ్యా" అనేవాడు. వాడిప్పుడు ఆ మెకానిక్ దగ్గర అసిస్టెంటు స్థాయికి ఎదిగిపోయాడు. మరి కొన్నాళ్లలో కొందరు స్కూటరు యజమానులను మంచి చేసుకుని మరోచోట స్వతంత్రంగా చిన్న షెడ్డు ప్రారంభించే స్థాయికి చేరుకున్నాడు. పరాంకుశం అప్పుడప్పుడు "మీవాడు దెబ్బలు తింటున్నాడని బాధ పడేవాడివి. ఇప్పుడు చూడు. వాడు తన కింద మరి కొందర్ని పిల్లలను పెట్టుకుని వాళ్లను కొట్టడం మొదలుపెడతాడు" అంటూ ఉంటాడు.

ఇసాక్ మళ్లీ చేతివ్రేళ్లు విరుచుకుని ఆవులించాడు. వచ్చేటప్పుడు పోయేటప్పుడు తన బస్సు నిండా పిల్లలుంటారు. ఆడపిల్లలూ, మగపిల్లలూ... పూలబంతుల్లాగా... కలకలలాడుతూ... వాళ్లే ముందు తరం దేశపాలకులు,

అధికారగణమూ... అందరూ ఎక్కడి వారక్కడ దిగిపోయాక ఖాళీబస్సు శూన్యంగా అసహ్యంగా ఉంటుంది. ప్రాణం లేని ఎముకలగూడులాగా... దాన్ని షెడ్‌లో పెట్టి తన సైకిల్ మీద ఆ మూడు నాలుగు కిలోమీటర్లు జనారణ్యం వంటి సిటీ వీధుల్లో ఇంటికి చేరుకుంటాడు.

ఇవాళ ఉదయం బస్సు బయటికి తీస్తుండగా స్కూలుగేటు దగ్గర అందాల ఉడుత ఒకటి అడ్డంగా పరుగెత్తుకు వచ్చింది. దాన్ని తప్పిద్దామని ఎంత ప్రయత్నించినా తనకు సాధ్యం కాలేదు. వెనక చక్రం క్రిందపడి క్షణంలో అణిగిపోయింది. బస్సు ఆపి దిగి వెళ్ళి చూశాడు. ఘోరమనిపించింది. కళ్లనీళ్లు తిరిగాయి. మరోపాపం చేసినట్టనిపించింది. పరాంశుశం మాత్రం అదివిని నవ్వి 'సదేలే... ఈ మాత్రం దానికే డీలాపడిపోతే మనం బతికినట్టే... మనుషులే లెక్కలేకుండా పోతున్నారు. కొంపలేమీ మునిగిపోవడంలేదు పదపద' అన్నాడు.

ఇసాక్ మనసేమి బాగులేదిప్పుడు. లోలోపల ఏదో తెలియరాని అలజడి... ఉదయం నాలుగు మెతుకులు తిని టిఫిన్ బాక్సు ఉన్న సంచి భుజానికి తగిలించుకుని బయలు దేరుతుండగా భార్య వెనకనుంచి 'అయ్య పిలుస్తున్నారు' అన్నది. ఇసాక్ ముందు గదిలోకి వెళ్లాడు. కిటికీ పక్కన మంచంలో తండ్రి పచ్చగా పండులాగా... ముఖంలో కొడుకును చూడగానే రవ్వంత ఆనందం... అంతలో కన్నీటిపొర... ఇసాక్ తండ్రి పక్కన కూర్చున్నాడు. ఏమీ మాట్లాడలేదు. చెయ్యి తండ్రి భుజం మీద వేశాడంతే. ఇద్దరి మధ్యా మాటలు లేవు. కాని ఒకరి కళ్లలోనుంచి మరొకరి కళ్లలోకి ఎడతెగని భావ స్రవంతి. ఎంతో ఆప్యాయత ఒలికే నిశ్శబ్ద సంభాషణలు... కొన్ని క్షణాలాగి పెద్దాయన కదిలి తన తల క్రింద ఉన్న దిండు క్రింద చిన్న పెట్టె చూపించాడు కొడుక్కి కోడలికీ... ఆ తర్వాత విశ్రాంతి కోరినవాడిలా కళ్లు మూసుకున్నాడు. ఆయనది పెద్ద వయసేమీకాదు. అరవైకి కొంచెం అటూయిటూ. మంచి వైద్యం చేయిస్తే పదేళ్లు చక్కగానే బ్రతకగలడు. కాని అంత ఖరీదైన వైద్యం తమకు ఎలా సాధ్యం? సంవత్సరం క్రిందట ఒక ఖరీదైన ఆసుపత్రికి తీసుకువెళితే ఆ ఒక్కసారికే చెమటలు పోశాయి. డాక్టర్లు రకరకాల పరీక్షలు అవసరమైనవీ అనవసరమైనవీ కూడా – చేసి పెద్ద మొత్తం వసూలు చేసి వైద్యం ఎంత ఖరీదవుతుందో కూడా చెప్పారు. ముసలాయన ససేమిరా ఒప్పుకోలేదు. పోతే పోతానన్నాడు. తన కోసం అప్పులుచేసి భంగపడవద్దన్నాడు. మంచాన పడ్డాడు. ఇప్పుడిక జరగబోయేదానికి సిద్ధపడటం తప్ప చేసేదేమీ లేదు. కొడుకులు చదువుకుని పెద్దవాళ్లు కావాలనుకున్నాడు ఇసాక్. వేలకు వేలు ధారపోస్తే తప్ప ఆ చదువులు రావని తెలిసి బుద్ధిమంతుల్లాగా వారిద్దరూ జీవితంలో సర్దుకుపోయారు. తండ్రి ఆరోగ్యం కూడా అంతే... వేలకు వేలు ధారపోస్తే తప్ప అదీ కుదరదు. ఆయన కూడా బుద్ధిమంతుడి వలె మంచంలో సర్దుకుపోయాడు.

ఇసాక్ ఇప్పుడు బస్సును షెడ్‌లో ఉంచి తన సైకిలు తీసుకుని ఇంటి ముఖం పట్టాడు. నగరంలో ఏమూలనో ఏదో గొడవ అయినట్టున్నది. జనం వీధులలో

పలుచగా ఉన్నారు. ఆ ప్రాంతంలో దుకాణాలు కొన్ని మూతపడి ఉన్నాయి. వీధి దీపాలు కొన్ని మాత్రం మందంగా వెలుగుతున్నాయి. వీధులలో వెలుగు చీకట్లు చారికలు చారికలుగా పరుచుకుని ఉన్నాయి. వీధి చివరి ఇల్లు... దూరం నుంచే ఇసాక్ గుండెలు దడదడలాడాయి. తమ ఇంటిముందు షామియానా... తండ్రిని చూసి కొడుకులిద్దరూ లేచి ఎదురువచ్చారు. ఇసాక్ భార్య మరి కొందరు స్త్రీలు మెట్లమీద కూర్చుని ఉన్నారు నిశ్శబ్దంగా.

ఇసాక్ దుఃఖం పొంగి వచ్చింది. సైకిలు గోడకానించి ఒక పక్కన కూలబడ్డాడు.

నిముషాలు గడిచేకొద్దీ అయినవారూ... తెలిసినవారూ... తెలియనివారు కూడా ఎందరో నిశ్శబ్దంగా చేరుకున్నారక్కడికి....

# షాక్

అబ్బో, ఎప్పటిమాట యిది! సుమారు నలభై సంవత్సరాల క్రిందటి వ్యవహారం.

ఇంత జీవితం గడిపి రిటైరయి విశ్రాంతిగా జీవితం గడుపుతున్న ఈ సమయంలో ఆ వృత్తాంతం అంతా గుర్తుకు వస్తున్నది.

ఉదయం లేచి కాలకృత్యాలు తీర్చుకుని తీరుబడిగా పేపరు ఆమూలాగ్రం చదివి విసుగుపుట్టి ఆవులించి చేతివ్రేళ్లు విరుచుకుని వాలుకుర్చీలో వెనక్కు వాలి కళ్లు మూసుకున్నాను. అప్పుడు గుర్తుకు వచ్చాడొక వ్యక్తి... కరుణాకరన్... ఇంట్లో ఉదయం ప్రారంభమైన సందడీ ఆర్భాటమూ అంతా సద్దుమణిగింది. మా పెద్దబ్బాయి తెల్లవారుజామునే లేస్తాడు. ఆ తర్వాత ఇక ఎవ్వరినీ నిద్రపోనివ్వడు. కోడలు సరేసరి లేచీ లేవగానే వంట ప్రారంభం చేస్తుంది. ఇంటిల్లిపాదికి కాఫీలు వగైరా సరఫరాచేసి యంత్రంలాగా తొమ్మిది గంటలలోపునే వంట పూర్తిచేస్తుంది. మా రెండోవాడు ఎనిమిదిన్నరకల్లా తయారై ఉరుకులు పరుగులుగా వెళ్లిపోతాడు. మా అమ్మాయి త్వరత్వరగా తయారై పుస్తకాలు తీసుకుని తొమ్మిది గంటలకల్లా కాలేజీకి వెళ్లిపోతుంది. పిల్లలు చేసినంత గొడవచేసి తలా ఒక సంచీ భుజాన తగిలించుకుని స్కూళ్ళకు వెళ్ళిపోతారు. తొమ్మిదిన్నర అయ్యేసరికి అందరూ వెళ్ళితారు. ఇక ఇంట్లో మిగిలేది నేను. అక్కడి నుంచి ఏమీ తోచి చావదు. నిముషం గడవటానికి గంట పడుతుందనిపిస్తుంది. నిర్వ్యాపారంగా కూర్చోవడం, అలిసిపోయినప్పుడు పడుకోడం, మరి కాస్సేపు ఏదో చదువుకోడం... ఇంకా విసుగుపుడితే మరింత విసుగుపుట్టించే రేడియో వినడం... ఇదీ తంతు.



ఇవ్వేళ ఎందుకో మనసంతా హాయిగా వుంది.

కరుణాకరన్ గుర్తు వచ్చాడు. ఇన్ని యేళ్లుగా మనసనే మహా సముద్రంలో ఏదో ఒకమూల పడిపోయి మరుగునపడిపోయిన వ్యక్తి.

సన్నగా పచ్చగా పొడుగ్గా వుండేవాడు. సన్నని ఫ్రేముగల కళ్ళద్దాలు పెట్టుకునేవాడు. నున్నని గడ్డంతో మడత నలగని దుస్తులతో శుభ్రంగా ఉండేవాడు. చాలా నెమ్మదిగా ముక్తసరిగా మాట్లాడేవాడు.

అప్పుడు నేనెలా ఉండేవాణ్ణి? చదువుముగించి ఉద్యోగంలో చేరిన కొత్తరోజులు... హుషారుగా ఉండేది. కొత్తగా సిగరెట్ కాల్చటం అలవాటు చేసుకున్న రోజులు... వయసు అనే పంచకళ్యాణి గుర్రంమీద ఎక్కి సరదాగా ఆకాశ సంచారం

చేస్తున్నట్టు కలలుగనే రోజులు... ప్రపంచం అంతా పచ్చపచ్చగా హాయిగా కనిపించే రోజులు. కాలేజీ చదువు సాగించినన్నాళ్ళూ అందరి విద్యార్థుల లాగానే బేఫర్వాగా నిష్పూచీగా ఉండేవాణ్ణి. నిరంతరం వాదనలతో వాగ్యుద్ధాలతో కాలం గడిపేవాణ్ణి. భారతంలో దుర్యోధనుడు, రామాయణంలో రావణుడే నన్ను ఎక్కువగా ఆకర్షించేవారు. విశృంఖలత్వం ఎక్కువగా ఆకర్షించేది. అయితే పుట్టి పెరుగుతున్నది మామూలు మధ్యతరగతి సంసారంలో కావడంచేత చదువు విషయంలో జాగ్రత్తగానే వుండేవాణ్ణి. ఆ రోజుల్లోనే ఒక చిన్న కథ విన్నాను. తండ్రి తన అయిదేళ్ళ కొడుకును మొదటిసారిగా బడికి పంపిస్తున్నాడు. కుర్రవాడు కొత్తదుస్తులతో కొత్త పలకాబలపాలతో బడికి వెళ్ళే హుషారులో ఉన్నాడు. తీరా తయారై బడికి బయలుదేరేముందు తండ్రి కొడుకును కొంచెం ఎత్తయిన అరుగుమీద నిలబెట్టి చేతులు చాపి "దూకు... పట్టుకుంటాను..." అన్నాడు. కుర్రవాడు ఒక్క ఉదుటున దూకాడు. కాని తండ్రి వాణ్ణి పట్టుకోలేదు. వాడు క్రిందపడ్డాడు. ఏడుస్తూ "పట్టుకోలేదేం నాన్నా" అని తండ్రిని అడిగాడు. తండ్రి నవ్వి "బడికి మొదటి సారిగా పోతున్నావు. నీకిది మొదటిపాఠం... ఎవర్నీ నమ్మకు..." అన్నాడు

నేను గ్రాడ్యుయేట్‌నయి గర్వంతో కొన్నాళ్ళపాటు ఇంటి దగ్గర ఉన్నాను. ఫస్టుక్లాసులో పాసైనానని నేను మా పెద్దలూ కొంతకాలం గర్వించాం కాని తర్వాత తర్వాత ఇరుగూ పొరుగూ 'మీవాడేమీ చెయ్యడంలేదా?' అనడం మొదలుపెట్టడంతో వాంటెడ్ కాలమ్స్ చూడటం వివిధ సంస్థలకు, రకరకాల డిపార్టుమెంటులకు అప్లికేషన్లు పెట్టడం ప్రారంభమైంది. ఇక రోజూ పోస్టుమాన్ కోసం ఎదురుచూడటం... ఉద్యోగం కోసం నిరీక్షణ....

ఒకనాడు నా కల ఫలించింది. అప్పాయింట్‌మెంట్ ఆర్డరు వచ్చింది. సెంట్రల్ గవర్నమెంటు ఉద్యోగం. మంచి జీతం... అంతా బాగానే వుంది... కాని మొదటి పోస్టింగ్ ఎక్కడో దక్షిణాదిన వందల మైళ్ళ దూరంలో ఒక మధ్యతరగతి పట్టణంలో... మన ప్రాంతం కాదు.... మన ప్రజలు కాదు... మన భాషకాదు. పైగా యింట్లో ముసలమ్మల సణుగుడు 'దేశంకాని దేశానికి పసివాణ్ణి పంపడమెలా?' అని. అక్కడికీ అదేదో మరో దేశమైనట్టూ అక్కడికి వెళ్ళినవాళ్ళు తిరిగే రారన్నట్టూ. మా నాన్న నేనూ అతి చాకచక్యంగా ఎవరికి చెప్పవలసినవి వాళ్ళకు చెప్పి ఎట్టకేలకు జయించాం. అందర్నీ ఒప్పించాం కాని మా నాయనమ్మను ఒప్పించడానికి పెద్ద పెద్ద ఇండియా మ్యాపులూ గ్లోబులూ ఉపయోగించవలసి వచ్చింది. అదీ మన దేశంలోని భాగమేననీ అక్కడా మనలాటి మనుషులే ఉన్నారనీ చెప్పి ఒప్పించేందుకు ఇంటిల్లపాదీ నానా హైరానా పడ్డాం... చివరకు అనేక హెచ్చరికల తర్వాత ప్రబోధాల తర్వాత ప్రయాణం నిశ్చయమైంది.

మొట్టమొదటిసారి జీవితంలో ఒంటరిగా అంతదూరం ప్రయాణం చేయడం... మంచి థ్రిల్ అనిపించింది.

అంతా సజావుగా జరిగి మూడురోజుల ప్రయాణం తర్వాత గమ్యస్థానం చేరుకుని వారినీ వీరినీ వాఽబుచేసి నేను ఆఫీసుకే వెళ్ళాను.

ఒక మోస్తారుగా పెద్దదే ఆఫీసు... అవసరమైన వారిని కలుసుకుని ఉద్యోగంలో జాయినైనాను. అప్పటికప్పుడే ఒక కుర్చీ కూడా ఆక్రమించేశాను.

సాయంకాలంవేళకు చుట్టుపక్కల వారితో ముక్తసరి సంభాషణలో ఒక విషయం తెలిసింది. అంత ఆఫీసులో వేరే వింగ్‌లో తెలుగు తెలిసిన వ్యక్తిఒకరున్నారని. అతనొక పెద్ద ఆఫీసరని, పేరు కరుణాకరన్ అనీ...

అతని కోసం వెతుక్కుంటూ వెళ్ళాను. స్వింగ్‌డోర్ తీసుకుని లోపలికి వెళ్ళగానే తలపైకెత్తి చూసి కూర్చోమని సైగ చేశాడు. కూర్చుని నన్ను నేను పరిచయంచేసుకున్నాను. చిరునవ్వు నవ్వాడు. 'మంచిది... మీరిక్కడ ఫారినర్‌గా ఫీల్ కానక్కర లేదు. మేము తెలుగు వాళ్లం కాదుకాని తెలుగుదేశంలో కొంతకాలం ఉన్నాం. నా చిన్నతనమంతా తెనాలి, గుంటూరులలో గడిచింది. ఇక ఇక్కడ హాయిగా ఉండండి. అన్నట్టు మీరుండడానికి ఒక రూము ఏర్పాట్లు చూద్దాం... ఆఫీసు అవగానే కలిసే వెళదాం...' అన్నాడు.

నాకు కొండెక్కినంత సంతోషమయింది పరాయిచోట పెద్ద అండ దొరికిందనిపించి హాయిగా నిట్టుర్చాను.

ఆయన అన్నమాట ప్రకారం ఆనాడు సాయంకాలమే నన్ను వెంటబెట్టుకుని తనకు తెలిసినవారి యింట్లో చక్కని రూము కుదిర్చిపెట్టారు. ఇంటి గలవారికి నన్ను 'గురించి చక్కగా పరిచయం చేశాడు.

ఆ రాత్రి గదిలో అన్నీ సర్దుకొని, వసతిగా పడుకుని అతన్ని గురించే ఆలోచించాను. ఆ కొద్ది గంటల పరిచయంలో అతన్ని అంచనా వేశాను.

కరుణాకరన్ మంచివాడు. అయితే మొహమాటి. ముక్తసరిగా లిమిట్స్‌లో ఉంటాడు. ఆఫీసు నుంచి ఆ సాయంకాలం హోటల్‌కు వెళ్ళాం. అక్కడ కాఫ్యాదులు సేవించిన తర్వాత ఎవరి బిల్లు వారికే తెప్పించాడు. బయట నేను సిగిరెట్ కొంటూవుంటే నా వంక అతడు చూసిన చూపు నన్ను కలతపెట్టింది. ఇలాంటి అలవాట్లు కూడా ఉన్నాయా?' అన్నట్టు చూశాడు. అతనికి ఆఫర్ చెయ్యబోగా మొహం తిప్పుకొని 'సారీ, అలవాటులేదు' అన్నాడు.

ఆ రాత్రి నిశ్చింతగా హాయిగా నిద్రపోయాను. మరునాడూ ఆ మరునాడూ ఆఫీసులో కలుసుకుని 'వీలైనంత తొందర్లో మా ప్రాంతానికి ట్రాన్స్‌ఫర్ అయ్యేట్టు ప్రయత్నించమని' మాటల సందర్భంలో అర్థించాను. 'అలాగే... చూద్దాం' అన్నాడు.

అంతవరకూ మామూలు కథ...

పాత సాదా కథ... అది నాలుగైదు రోజుల్లో వింత మలుపు తిరిగింది.

ఆ రోజు ఉదయం ఆఫీసుకు వెళ్లేందుకు తయారవుతున్నాను. వీధి గుమ్మంలోకి ఒక సైకిల్ రివ్వున వచ్చి ఆగింది. కరణాకరన్ సైకిల్ స్టాండ్‌వేసి

లోపలకి వస్తున్నాడు. అతని చేతిలో సిగిరెట్ వెలుగుతున్నది. రెండోచేతిలో ఖరీదైన సిగిరెట్ ప్యాకెట్ వుంది. మెట్లెక్కి వస్తూనే నన్ను చూసి 'మీరేనా వాసుదేవ్‌రావ్?' అని అడిగాడు. నాకు మతిపోయినట్టయింది. కళ్లు పెద్దవి చేసుకుని వింతగా చూశాను.

అతను అంతలో నవ్వి సిగిరెట్ పొగ వదులుతూ కూర్చుని 'సారీ, మీరు కంగారు పడుతున్నట్టున్నారు. లెట్ మీ ఇంట్ర డ్యూస్ మై సెల్ఫ్... నా పేరు కమలాకరన్... కరుణాకరన్ మా అన్నగారు... మేమిద్దరం కవలలం... మా అన్నయ్య నా కంటే రెండు నిమిషాలు పెద్దవాడు... సరేనా? మిమ్మల్ని కలుసుకోవడం ఎంతో సంతోషంగా వుంది. ఇక్కడ ఫ్రెండ్స్ లేక విసుగుపుడుతున్నది. ఇక మీరు దొరికారు అన్నట్టు మా అన్నయ్య మీకీ లీవ్‌లెటర్ ఇచ్చిరమ్మని పంపాడు. వాడికి పనిపడింది ఇంట్లో...' అంటూ సెలవు చీటీ అందించాడు. ఆ తర్వాత పది నిముషాలసేపు కూర్చుని మాట్లాడి వచ్చినంత వేగంగానూ సైకిలుమీద వెళ్ళిపోయాడు. వెళ్ళేముందు ఆనాడు సాయంకాలం రూముకు వస్తాననీ ఆఫీసు నుంచి వచ్చి తనకోసం వుండమనీ 'ఎటైనా' సరదాగా వెళ్ళి కాలక్షేపం చేద్దామనీ అన్నాడు. మాట్లాడుతున్నంతసేపూ సిగిరెట్ తర్వాత సిగిరెట్ వూదేశాడు.

నేను కొన్ని నిమిషాలు దిగ్భ్రాంతితో నిలబడిపోయాను. కాస్సేపటిలో అన్నాదమ్ముల మధ్య తేడా కొట్టొచ్చినట్టు కనిపించింది.

అతను మితభాషి, ఇతడు మాటల పోగు.

అతను సిగిరెట్ కూడా తాకని మంచివాడు. ఇతను వ్యసనపరుడు. ఆనాడు ఆఫీసు నుంచి తిరిగివచ్చేసరికే రూము దగ్గర వెయిట్ చేస్తున్నాడు కమలాకరన్, సిగిరెట్లు ఊదేస్తూ.

నేను మొహం కడుక్కుని తయారైన తర్వాత ఊరిమీదికి బయలుదేరదీశాడు. ముందు ఖరీదైన హోటలూ ఆ తర్వాత సినిమా... మధ్యలో విపరీతమైన వాగుడు. సిగిరెట్లకూ కాఫీలకూ సినిమాలకూ పైసాకూడా నన్ను ఖర్చుపెట్టనీయలేదు. అలా మా యిద్దరిమధ్య ప్రారంభమైన పరిచయం రోజుల వ్యవధిలో గట్టిపడింది. అతను రావడం కొద్ది నిమిషాలు ఆలస్యమైతే పిచ్చెక్కినట్టయ్యేది నాకు.

క్రమంగా రోజులు గడిచేకొద్దీ ఆఫీసులో కరుణాకరన్‌ను కలుసుకోవటం బొత్తిగా తగ్గిపోయింది. ఒకరోజు ఆఫీసులో కనబడ్డప్పుడు కరుణాకరన్ నన్ను తనతో రమ్మన్నాడు. వెళ్ళి కూర్చున్నాను. అతడొక్క క్షణం ఆగి "మీ ట్రాన్స్‌ఫర్ కోసం ప్రయత్నిస్తున్నాను. త్వరలోనే పని జరగవచ్చు..." అన్నాడు. నేను ఆనందంతో "థాంక్యూ..." అన్నాను.

అతడు మళ్ళీ "మా తమ్ముడితో మీకు బాగా దోస్తీ కుదిరినట్టుందే..." అన్నాడు.

"అవునండీ. ఆయన మంచి హుషారైన వ్యక్తి....

అతడు ఎటో చూస్తూ "అవును హుషారైనవాడే! మరీ మోతాదు మించిన హుషారు. మెడికల్ రిప్రెజెంటెటివ్ కదా బోలెడంత డబ్బు.... చేతినిండా తీరిక...

కలు తెలీవు... ఏమీ పట్టించుకోడు... ఇంటి గొడవలు... అవి ఏమీ పట్టవు... డబ్బును మంచినీళ్లకన్నా అన్యాయంగా దుబార్గా చేస్తాడు..." అన్నాడు.

నేనేమీ మాట్లాడలేదు. కాస్సేపు కూర్చుని వచ్చేశాను. ఆనాడు సాయంకాలం కమలాకరన్‌తో హోటల్లో కూర్చుని వున్నప్పుడు ఈ ప్రసంగం ఎత్తాను. అతని అన్న తనను గురించి అన్న మాటలు చెప్పగానే అతడు నవ్వి సిగిరెట్ ముట్టించుకుని "మావాడి సంగతి నాకు చెప్పకండి. వొట్టి బుద్ధూగాడు. ఇల్లూవాకిలీ తప్ప ఏమీ ఎరగడు. నాటకమూ, సినిమా, షికారు ఏమీలేదు... జీవితం అనుభవించటం తెలీని బడుద్ధాయి"అన్నాడు.

నా మనస్సు చివుక్కుమన్నది. నేనేమీ మాట్లాడలేదు.

రోజులు హుషారుగా హడావిడిగా గడిచాయి.

ఉన్నట్టుండి ఒకరోజున ఆఫీసుకు ట్రాన్స్‌ఫర్ ఆర్డర్లు అందాయి ఆత్రుతగా అందుకుని చూశాను. మన ప్రాంతాలకునన్ను మార్చారు. ఆనందంగా కరుణాకరన్ గార్కి చెప్పి కృతజ్ఞతలు తెలియజేద్దామని పరుగెత్తాను. దురదృష్టవశాత్తు అతడులేడు. ఆనాడు సెలవు పెట్టాడు. సాయంకాలం రూముకు వెళ్ళగానే సామాన్లు సర్దుకోడం మొదలుపెట్టాను. మరునాడు ఉదయమే ప్రయాణం. కమలాకరన్ హడావిడిగా వచ్చాడు. "ఏమండీ... మీకు ట్రాన్సఫర్ అయిందటగా... సంతోషమే.... కాని ఇక్కడ నాకున్న బెస్ట్‌ఫ్రెండ్ ఒక్కరూ దూరంగా వెళ్ళిపోతున్నారే అని నాబెంగ. రియల్లీ మిస్ ఐ యూ వెరి మచ్...' అన్నాడు. నేను నొచ్చుకున్నాను. 'అన్నట్టు ఇదంతా మీ అన్నగారి చలవే... చాలా సాయంచేశారు. థాంక్స్ చెబుదామనుకున్నాను. ఆయన ఆఫీసుకు రాలేదు. ఇంటికి వెళ్ళివద్దామా ఒకసారి?' అని అడిగాను.

'లాభంలేదు వాడు ఊళ్లో లేడు. రెండు మూడు రోజులకుగాని రాడు. అత్తారింటికిపోయాడు. అయినా ఫరవాలేదులెండి. నేను చెబుతా లెండి...' అన్నాడు కమలాకరన్.

ఆ సాయంకాలం హుషారుగా కాలక్షేపం చేశాము. అతను ఆ రాత్రి పొద్దుపోయేదాకా నాతోనేవుండి సామాన్లు సర్దడంలో సాయపడ్డాడు. మర్నాడు స్టేషన్‌కి త్వరగా వస్తానని వెళ్లిపోయాడు.

మర్నాడు స్టేషన్లో... రైలు కదలబోతున్నది. ఇద్దరం ప్లాట్‌ఫారం మీద నిలబడివున్నాము.

నేనన్నాను, 'చాలా థ్యాంక్సండీ... ఇక్కడున్న నెలా పదిహేను రోజులూ మీరు అద్భుతమైన కంపెనీ ఇచ్చారు. ఆనందంగా గడిచింది. అన్నట్టు మీ బ్రదర్ సమయానికి లేకపోవడం నా దురదృష్టం... మీరు చెప్పండి. ఆయనచేసిన సహాయానికి ఎంతో కృతజ్ఞుణ్ణి...!'

రైలు కదలబోతుండగా కిటికి దగ్గర కూర్చున్నాను.

'మా అన్నయ్యలేడని బాధపడకండి నేను చెబుతానన్నానుగా... నిశ్చింతగా వెళ్ళండి...' అన్నాడు కమలాకరన్.

రైలు కదులుతుండగా నా కళ్ళలో నీళ్ళు నిలిచాయి. కమలాకరన్ నాచేయి పట్టుకుని స్నేహపూర్వకంగా నొక్కి వొదిలాడు. రైలు కదిలింది. సరిగ్గా అదే సమయంలో ఒక ఉత్తరం నాచేతిలో ఉంచి 'గుడ్‌బై... ఆల్ ది బెస్ట్' అన్నాడు. తర్వాత చేయి వూపుతూ నిలబడ్డాడు.

క్రమంగా దూరమైపోతున్న అతనివైపే చూస్తూ చేయి వూపాను. రైలు వేగం పుంజుకుంది. క్రమేణా క్షణాలమీద స్టేషను కనుమరుగైపోయింది.

అప్పుడా ఉత్తరం విప్పి చూశాను. 'మై డియర్ ఫ్రెండ్... మా అన్నయ్య సమయానికి లేకుండాపోయారే అని బెంగ పడకండి. నేను కరుణాకరాన్నే. నేను చేసిన చిన్న సాయానికి ఎంతో గొప్పగా కృతజ్ఞతలు చెప్పారు. నేను చేసింది అంతపెద్ద సాయమేమీకాదు. చాలా చిన్నవిషయం. అన్నట్టు మీరేమీ అనుకోకపోతే అసలు నాకొక తమ్ముడు లేడు. ఉన్నది నేనొక్కణ్నే. మిమ్మల్ని చూసిన మొదటిరోజునే చిన్న ప్రయోగం చెయ్యాలనిపించింది. విచ్చలవిడితనం, విశృంఖలత్వం మనలని ఆకర్షిస్తాయని నా నమ్మకం. అందుకే సరదాగా మీతో చిన్న నాటకం ఆడాను. గుట్టు బైటపడకుండా ద్విపాత్రాభినయం చేశాను. నా నమ్మకం బలపడింది.

మొత్తానికి మీరు స్వస్థలానికి వెళుతున్నందుకు అభినందనలు. ఎప్పుడన్నా ఉత్తరాలు రాస్తూండండి.

-కరుణాకరన్"

నేను జీవితంలో మొదటి 'షాక్' తిన్నానని వేరే చెప్పనక్కరలేదు.

తర్వాత ఉత్తర ప్రత్యుత్తరాలు ఎక్కువకాలం నడవలేదు.



ఇంట్లో హడావిడి మొదలయింది.

మా కుటుంబసభ్యులంతా ఒక్కొక్కరే యింటికి చేరుకుని సందడి చేస్తున్నారు. నేను తేలికపడిన మనసుతో లోపలికి నడిచాను. స్నానం చేస్తుండగా 'కరుణాకరన్... నాకు జీవితంలో మొదటి గుణపాఠం నేర్పిన వ్యక్తి... మొదటి షాక్ యిచ్చిన వ్యక్తి... ఇప్పుడెలావున్నాడో' అనిపించింది.

అంతలోనే 'అసలున్నాడో లేదో' అని కూడా అనిపించింది.

# బుజ్జమ్మ అదృష్టం

"అవళ్‌పారుంగ... అపకుమారి మాదిరియే ఇరిక్కా..."

"నీంగ సరియా సొల్లిర్కింగ... అచ్చం కుమారిలాగే వుంది"

ఇలా మాట్లాడుకుంటున్న వాళ్లిద్దరూ ఎంతో దూరంలో లేరు. కేవలం పది పదిహేను గజాల దూరంలో నిలబడి వుండి తనవంకనే కళ్లార్పకుండా చూస్తూ మాట్లాడుకుంటూ వుంటే బుజ్జమ్మకు గుండెలు దడదడలాడుతున్నాయి.

గోడకానుకుని ఒదిగి ఒదిగి బిక్కు బిక్కుమంటూ కూర్చునివుంది. వాళ్లిద్దరూ తనను గురించే మాట్లాడుకుంటున్నారని మాత్రం స్పష్టంగా తెలుస్తున్నది. ఇద్దరూ వయసు మళ్లినవాళ్లేమీ కాదూ పాతిక యేళ్లకు మించివుండవు. ఆధునికంగా దుస్తులు ధరించి డాబుసరిగా వున్నారు.

రాత్రి పొద్దుపోయినట్టే లెక్క. తాము నలుగురూ పినాకినిలో దిగారు. అప్పటికే ఆ బండి ఆలస్యంగా తొమ్మిది గంటలు దాటుతుండగా వచ్చింది. రైలులోనే డబ్బుల పంపిణీ జరిగిపోయింది. ఉదయం బెడవాడ నుంచి బయలుదేరి ఒంగోల్లో మొదలుపెట్టి రైలు పెట్టెలు ఊడ్చి శుభ్రంచేసి దయగల తండ్రులూ దయగల తల్లులూ ఇచ్చిన చిల్లర నలుగురూ సమంగా పంచుకుని మరీ ప్లాట్‌ఫారం మీద దిగారు. రైలు దిగీ దిగగానే నిప్పుకోడిగాడు తెచ్చిపెట్టాడు సమస్య.

"పోదామా?" అన్నాడు ముందు.

చింపిరిగాడు తల విసురుతూ "పదండి పోదాం" అని వంతపలికాడు.

వాళ్లిద్దరికంటె కొంచెం చిన్నవాడు కదా, కోటిగాడికయినా వుండాలి బుద్ధి... కానీ, వాడు కూడా పై ఇద్దరితో కలిశాడు. "పోదాం.. తొరగా పదండి" అన్నాడు.

బుజ్జమ్మ తెల్లబోతూ "ఎక్కడికి?" అని అడిగింది.

"మేము ఇప్పుడు సినిమాకు పోతున్నాం... రెండో ఆటకి... ఇంగ్లీషు... ఇవాళ ఆఖరు రోజు... రేపు ఉండదు. చాలారోజుల నుంచి చూడాలని ప్లాను..." అన్నాడు నిప్పు కోడిగాడు.

కోటిగాడు "అవునవును" అన్నాడు.

వాడి బుర్రలో తానొకానొక రోజు పోలీసు దెబ్బతిని పారిపోయినవాడు చూసిన సినిమా హాలు... హాలు ముందున్న బొమ్మలు... ఇంకా చెరిగిపోలేదు. ఊరిస్తూనే వున్నాయి.

బుజ్జమ్మ చిరాకుపడింది. 'వీళ్ల వరస చూస్తే చాలా ముందునుంచే వ్యూహం పన్నినట్టున్నారు' అనుకుంది.

"నన్నొంటిరిగా వొదిలేసి మీరందరూ పోతారా?" అని జాలిగా నసిగింది.

"నువ్వూ రా" అన్నాడు చింపిరిగాడు.

"నేన్రాను... మీరుకూడా మానేయండి" అన్నది బుజ్జమ్మ మొండిగా.

వాళ్లూ మొండికేశారు. "వెళ్లాల్సిందే" అన్నారు.

"నువ్వు వొస్తేరా. లేపోతే మానెయ్" అనికూడా అన్నారు. తర్వాత "నువ్వు ఎక్కడికీ కదలకు. ఇక్కడే పడుకో. ఏం భయంలేదు" అనికూడా చెప్పారు. అన్నీ చెప్పి హడావిడిగా వెళ్లిపోయారు.

బుజ్జమ్మ ముందు తన డబ్బు లెక్కచూసుకుంది. ఇవాళ్టి సంపాదనలో తనవంతు నాలుగున్నర రూపాయలు... అన్నీ పావలా బిళ్లలూ, పదిపైసల బిళ్లలూ... వాటిని తన గుడ్డసంచిలో ఉంచుకుని భద్రంగా బొడ్లో దోపుకుంది. తర్వాత గోడకానుకుని కూర్చుని ఆవులించి నిద్రపోదామని ప్రయత్నించింది. అదుగో, సరిగా అప్పుడు మొదలైంది ఈ బాధ...

వాళ్లిద్దరూ ఇంకా అలాగే నిలబడి చాలా సీరియస్‌గా మాట్లాడుకుంటున్నారు. ఇప్పుడు గొంతు తగ్గించి మాట్లాడుకుంటున్నారు. గుసగుసలుపోతున్నారు. తర్కించుకుంటున్నారు.

బుజ్జమ్మ 'లేచి ఎట్లైనా పారిపోదామా' అనుకుంది ముందు. కానీ అలా చేయలేదు. పారిపోవడం పిరికితనం అనుకుంది. ఏది ఏమయినా ఇంత పెద్ద స్టేషనులో తనకు ఎదురుకాగల ప్రమాదమేమీ లేదనుకుంది. బాగా పొద్దుపోయినందువల్లను, రైళ్లరాకపోకల మధ్య వ్యవధి ఉన్నందువల్లను, తాను కూర్చుని వున్నచోటు దూరంగా ఉన్నందువల్లను భయంగా ఉంది తప్ప అంతగా తనకు సంభవించగల ఉపద్రవం ఏదీలేదు. వాళ్లిద్దరూ ఏదైనా కానిపనికి పూనుకుంటే అప్పుడు ఉన్నట్టుండి జింకలాగా లేచి పరుగెత్తితే ఇక అంతా జనసమర్దమే...

ఇద్దరు టీసీలు నిరంతరం ఉంటారు. జనం హడావిడి, లైట్ల వెలుతురు... అంతా పట్టపగలులాగే ఉంటుంది ఎప్పుడూ. తనకేమీ ప్రమాదంలేదు.

అయితే వాళ్లు హఠాత్తుగా మీదపడి ఏ మందోమాకో వాసన చూపించి తనను స్పృహతప్పేట్టు చేస్తే మాత్రం ప్రమాదమే.

ఈ మధ్య ఆడపిల్లల్ని... ఆమాట కొస్తే మగపిల్లల్ని కూడా... అపహరించుకుపోయి ఎక్కడో అమ్మివేసే దుర్మార్గపు ముఠాలు తిరుగుతున్నాయట. 'ఎందుకైనా మంచిది. కొంచెం జాగ్రత్తగా ఉందాం' అనుకుంది.

కొంతసేపటి తర్వాత వాళ్లిద్దరూ ఏమనుకున్నారో ఏమో, ఏకాభిప్రాయానికి వచ్చినవారిలా బుజ్జమ్మ వైపు రావడం ప్రారంభించారు.

నెమ్మదిగా అడుగులు వేస్తున్నారు.

బుజ్జమ్మ భయంతో ముడుచుకుపోయింది. గుండెలు దడదడ కొట్టుకున్నాయి. ఉన్నట్టుండి శివమెత్తినదానిలా "ఏమిటి? ఏమిటి? ఎవరు మీరు?" అని గావుకేకలు పెట్టింది.

వాళ్లేదో చెప్పబోయారు. కానీ బుజ్జమ్మ వాళ్లను మాట్లాడనివ్వకుండా తానే పిచ్చిగా పెద్దగా అరిచింది.

దాంతో వాళ్లిద్దరూ ఏమనుకున్నారో ఏమో హడావిడిగా వెనుదిరిగి

బుజ్జమ్మ మనసు కుదుటపడింది. 'హమ్మయ్య' అనుకున్నది. తాను పెద్దగా అరిచి గోలచెయ్యడంవల్ల మంచి జరిగింది. లేకపోతే వాళ్లు ఏ అఘాయిత్యం తలపెట్టేవాళ్లో అనుకుంది.

నెమ్మదిగా కాళ్లు జాపుకున్నది. గోడకానుకుని పడుకుంది. తర్వాత ఆవులించింది – గోడపక్కన దోమలు జుమ్మని ముసురుతున్నాయి. లోపల ఆలోచనలు... 'గాడిద వెధవలు' అనుకున్నది సహచరులు ముగ్గురినీ గురించీ...

'రైలు పెట్టెల్లో చెత్తాచెదారమూ రెక్కలు ముక్కలు చేసుకుని ఊడ్చి అందర్నీ అడుక్కుని డబ్బు సంపాయిస్తామా, దాన్ని వెంటవెంటనే ఊదేస్తారు. దాచుకుందామని బుద్ధేలేదు.

మొన్నటికి మొన్న నిప్పుకోడిగాడికి ఆ మాష్టారెవరో వంద రూపాయిలిచ్చిపోయాడు. వందరూపాయిలంటే సామాన్యమా? ఏం లాభం? ఈ వెధవలు ముగ్గురూ చేరి జమిలిగా అంత డబ్బునూ వారం రోజుల్లో తగలేశారు. ఎక్కడబడితే అక్కడ పచ్చిమిరకాయ బజ్జీలు, మిక్చర్‌లు, అయిస్‌ఫ్రూటులూ మెక్కితే ఎన్నాళ్లుంటుంది డబ్బు?'

బుజ్జమ్మ నిట్టూర్చింది. తనకెవరూలేరు. నేలమీద పడింది మొదలు తల్లెవరో తండ్రెవరో తెలియకుండా ఈ రైల్వే ప్లాట్‌ఫారమ్మీదే బతికింది.

ఒక ముసలి రైల్వేకూలీ ఉండేవాడు. అతని పేరు రాజన్న. రెండేళ్ల క్రితమే పోయాడు.

అతడు అంటూ ఉండేవాడు. "ఈ పిల్ల ఉందే, దీనికి బుజ్జమ్మ అని నేనే పేరు పెట్టాను. దీన్ని నెలల వయసులో రైల్లో వదిలేసిపోయారెవరో. ఏడుస్తూ వుంటే నేనే చూసి వాకబుచేసి ఎవరూ దొరక్క చివరకు రైల్వే పోలీసులకు అప్పజెప్పాను. దయగలవారు కాసిని పాలుపట్టి కనిపెట్టి చూశారు. అట్లా దీనికి నడక వచ్చేదాకా చూసి తర్వాత వాళ్లూ గాలికి వొదిలేశారు. ఇదుగో, తర్వాత ఇది ఇట్లా ఆ దిక్కులేని వెధవలతో కలిసి రైలు పెట్టెలు ఊడుస్తూ ప్రయాణీకులను అడుక్కుంటూ సొతంత్రంగా బతుకుతున్నది."

బుజ్జమ్మ ఇవాళ పగలంతా రైల్లో ఒకచోటనే స్థిరపడిపోయింది. చాలాసేపు మద్రాసు నుంచి విజయవాడ వచ్చేదాకా ఒకేచోట పీఠం వేసుకున్నట్టు కూర్చుండిపోయింది.

ఒక కుటుంబం... భార్యాభర్తలు మహాఅందంగా దేవతల్లా ఉన్నారు. పచ్చని ఛాయ ఇద్దరిదీని. ఇద్దరు పిల్లలు. పెద్దవాడు మూడేళ్లవాడేమో, గాలికొట్టిన బెలూనులాగున్నాడు. చిన్నపిల్ల బంగారు బొమ్మలాగున్నది. వాళ్ల అచ్చట్లు ముచ్చట్లు చూడ్డానికి బుజ్జమ్మకు రెండు కళ్లూ చాలలేదు. పైగా కింద చెత్తా చెదారం అంతా ఊడ్చి చేయి జాపితే ఆయన రూపాయి నోటు ఇచ్చాడు.

ఇప్పుడు బుజ్జమ్మ కళ్లవెంట అనవసరంగా నీళ్లు ఉబికి వచ్చాయి. చేయి వెనక్కి తిప్పుకుని రెండుకళ్లూ గట్టిగా తుడుచుకుంది.

ఎంతసేపయిందో... పక్కనే సవ్వడి...

హఠాత్తుగా లేచి కూర్చుంది. ఎదురుగా నల్లకోటు ధరించి టీ.సీ.గారు... పక్కనే తనను గురించి ఇందాక మాట్లాడుకున్న ఇద్దరు మనుషులూ... బుజ్జమ్మ లేచి నిలబడి తెల్లని పళ్లు బైటపడేలా నవ్వింది.

టీ.సీ. గారు మధ్యవయస్కుడు. బెజవాడలోనే చాలాకాలంనుంచీ ఉంటున్నాడు. ప్లాట్‌ఫారమే ఇల్లుగా బ్రతికే ఈ నలుగురు అనాథలను గురించి తెలిసినవాడు. వాళ్లు రైలెక్కి ఎటెటో పోయి పెట్టెలు ఊడ్చి శుభ్రంచేసి ప్రయాణీకులను అడుక్కుని తమనుతాము పోషించుకుంటున్నారని సానుభూతి కలవాడు.

ఆయన నవ్వుతూ నెమ్మదిగా "బుజ్జమ్మా" అని అనునయంగా పలకరించాడు.

"వీళ్లిద్దర్నీ చూసి ఇందాక నువ్వు భయపడ్డావట. పెద్దగా అరిచి గోలపెట్టి తరిమేశావుట. ఇదుగో ఈ అబ్బాయి మా అన్నకొడుకే. అయితే ఎప్పుడూ మద్రాసులోనే ఉంటాడు. సినిమాలు తీస్తూ ఉంటాడు"

ఆయన ఆగాడు.

అంతలో నిప్పుకోడిగాడు, ఆ వెనకనే చింపిరీ, పక్కన కోటిగాడు కూడా వచ్చి నిలబడ్డారు.

"ఏంలేదమ్మాయ్! వీళ్ళకు నీతో పనిపడింది. ఊరికే భయపడకు. నెమ్మదిగా విను"

బుజ్జమ్మ బిక్కు బిక్కుమంటూ నిలబడింది.

టీ.సీ.గారు తాపీగా చెప్పాడు–"ఏంలేదు... వీళ్లొక సినిమా తీస్తున్నారు. ఈ దగ్గరలోనే వారం రోజుల నుంచీ... అరవంలోనూ తెలుగులోనూ ఒకేసారి తీస్తున్నారు. రేపటితో పని పూర్తిచేసుకుని వెళ్లిపోవాలి.

సినిమాలో నీలాటి ఒక అమ్మాయి ఉంది. కుమారి ఆ అమ్మాయి పేరు. అచ్చం నీలాగే ఉంటుందిట. అయితే ఆ అమ్మాయి మద్రాసు నుంచి రాలేదు. జ్వరంట. అలా అని అక్కడివాళ్లు కబురు చేశారు. నువ్వు చెయ్యవలసిందల్లా ఏమిటంటే... జాగ్రత్తగా విను... భయపడకు... రేపు ఒక్కరోజు ఆ పిల్లబదులు నువ్వు నటించాలి.

నీకేమీ ఫరవాలేదు. నువ్వేమీ మాట్లాడనక్కరలేదు కూడా. ఏమీ కష్టం వుండదు. ఒక్కరోజు పని... డబ్బు ఇస్తారు..." బుజ్జమ్మ గుండె ఒక్కక్షణం ఆగింది. ముందు భయం. ఆ తర్వాత ఆశ్చర్యం... కళ్లు పెద్దవైనాయి.

నిప్పుకోడిగాడు ముందు మాట్లాడాడు. నిర్లక్ష్యంగా "అంతా మేం చూసుకుంటాంలెండి... మా బుజ్జమ్మ వొస్తది" అన్నాడు.

"ఊఁహూఁ నాకు భయం" అన్నది బుజ్జమ్మ.

"మేముంటాము నీకు తోడుగా" అన్నాడు ధైర్యం చెబుతున్నట్లు చింపిరిగాడు.

టీ.సీ.గారు ఆ ఇద్దరివంక తిరిగి "చిన్నపిల్ల... భయపడుతున్నది. నేను చెబుతాను. మీరు రేపు ఉదయమే మా ఇంటికి - క్వార్టర్సుకు - రండి" అన్నాడు. తర్వాత తమిళంలో ఏదో అని నవ్వాడు.

వాళ్లిద్దరూ వెళ్లిపోయారు.

తర్వాత టీ.సీ.గారు ముగ్గురు మగవెధవలను ఉద్దేశించి - "ఒరే వెధవాయిల్లారా! జాగ్రత్తగా వినండి. వాళ్లు ఒక్క రోజు పనికి అయిదొందలుదాకా ఇస్తామన్నారు. ఈ పిల్ల ఏమీ బరువులు మోయనక్కరలేదు. కష్టపడనక్కరలేదు. వాళ్లు చెప్పినట్టు విని చెప్పినట్టు చెయ్యడమే. అయిదొందలంటే సామాన్యమా?

ఎన్ని రోజులు రైలు పెట్టెలు ఊడ్చి ఎందరిని అడుక్కుంటే అంత డబ్బు కళ్లజూస్తారు? రేపు ఉదయం వాళ్లను తీసుకొస్తాను. సిద్ధంగా ఉండండి లేదా మీ ఖర్మ..." అని వెళ్లిపోయాడు.

ఆ రాత్రి ఎవరికీ నిద్రలేదు. చాలాసేపు దగ్గర దగ్గరగా కూర్చుని మాట్లాడుకున్నారు. గుసగుసలు పోయారు. బుజ్జమ్మ ముందు తల అడ్డంగా ఊపింది. మాటిమాటికీ "నాకు భయంబాబూ" అన్నది.

చివరకు నిప్పుకోడిగాడు తన పెద్దరికం అంత వొలకబోస్తూ - "ఒసే ఎర్రి మొగమా! అందరూ సినిమాలో అని ఏడుస్తావుంటే నువ్వు వొద్దని ఏడుస్తావేమే. మేముంటాంగదా? ఊరికే బయపడి సావకు" అని ముగించాడు.

బుజ్జమ్మ అలిసిపోయి గోడకు జారగిలబడి నిద్రపోయింది. మిగిలిన ముగ్గురూ కాస్సేపు కబుర్లాడుకున్నారు. 'రేప్పొద్దున్న పినాకిని ప్రయాణం రద్దు' అనుకున్నారు. తాము కూడా బుజ్జమ్మ వెంటనే ఉంటామనీ, అందుకు వాళ్లు ఒప్పుకోకపోతే "కుదరద"ని చెప్పేద్దామనుకున్నారు.

నడిరాత్రి దాటింది. రైళ్ల రాకపోకలు తగ్గాయి. ప్లాట్‌ఫారాల మీద రద్దీకూడా తగ్గింది.

తెల్లవారుతుండగానే బుజ్జమ్మ లేచి ప్లాట్‌ఫారం చివరకు వెళ్లింది. పది నిముషాల తర్వాత తిరిగి వచ్చేసరికి ఇంకా ముగ్గురు గాడిదలూ మొద్దునిద్రపోతున్నారు. ఎదురుగా వెలుతురు వ్యాపిస్తున్నది.

ఏడు గంటలలోపే టీ.సీ.గారితో సహా ఆ ఇద్దరు వ్యక్తులూ వచ్చేశారు.

వస్తూనే హడావిడిగా "ఏం రెడియా?" అన్నారు.

ఈ కలకలంతో ముగ్గురు మగపిల్లలూ లేచారు.

"ఒక్క పావుగంటలో తయారు సార్" అన్నారు.

"మీరెక్కడికి?" అన్నాడు టీ.సీ.గారు.

"మేమూ వొస్తాం సార్" అన్నాడు నిప్పుకోడిగాడు.

"వాళ్లు రాకపోతే నేనూ రాను" అన్నది బుజ్జమ్మ.

అవతలివాళ్లు పెద్దగా పట్టించుకోలేదు.

"సరే" అన్నారు.

కాస్సేపటితర్వాత మురికిదుస్తులతో మగవెధవలూ, మాసిన చిరిగిన గౌనుతో బుజ్జమ్మా పెద్దకారులో అయిదారు మైళ్లు ప్రయాణంచేసి నగరశివార్లలో ఒక గ్రామం చివర ఒక పెంకుటింటి ముందు ఆగారు.

అక్కడ అంతా కోలాహలంగా ఉంది. అలజడిగా ఉంది. అందరూ వీళ్లకోసమే ఎదురుచూస్తున్నట్టున్నారు. ఖరీదైన సిగరెట్ ప్యాకెట్ చేతిలో పట్టుకుని నిర్మాతా, టోపీ పెట్టుకుని ఒక దర్శకుడు, ఇంకా ఇతరులూ బుజ్జమ్మను చూసి "అచ్చం కుమారిలాగే ఉంటుంది మేకప్‌లో" అని సంతృప్తి ప్రకటించారు.

బుజ్జమ్మను నేరుగా లోపలికి తోలుకుపోయారు. మేకప్ మాన్ ఆ పిల్ల ముఖాన్ని పట్టుకుని అటూ ఇటూ తిప్పి చూసి "ఆల్‌రైట్..." అన్నాడు. ఒక కుర్చీలో కూలేసి మేకప్ మొదలుపెట్టాడు. ఆ తర్వాత దుస్తులు కట్టబెట్టాడు.

ఒకాయన వచ్చి అనునయంగా "నువ్వు మేం చెప్పినట్టు నడుచుకో చాలు" అన్నాడు.

పక్కవారితో "కుమారి అయితే సుకుమారం. దీన్తో మనకా ఇబ్బంది లేదు. కావలసిన ఎఫెక్ట్ రాబట్టుకోవచ్చు" అన్నాడు.

తర్వాత అందరికీ టిఫిన్లు పెట్టారు. నిప్పుకోడిగాడు, చింపిరీ, కోటిగాడు బుజ్జమ్మను చూసి ఆశ్చర్యంతో ఆవులించారు. 'అబ్బ! రాజకుమారిలాగున్నది మన బుజ్జమ్మ' అనుకున్నారు.

ఆ తర్వాత షూటింగ్ మొదలయింది. అసలు హింస మొదలయింది. నలుగురు భయంకరాకారులు బుజ్జమ్మను ఎత్తుకుని ముందు ఆరుబయట రాళ్లూ రప్పల మధ్య పరుగులుపెట్టారు.

ఒకడు వాళ్లను వెంబడిస్తున్నాడు.

వాళ్లు బుజ్జమ్మను గాల్లోకి విసిరేశారు. క్రిందపడేశారు. మళ్లీ ఎత్తుకున్నారు. విలవిల్లాడుతున్న ఆ పిల్లతో వాలీబాలూ పుట్‌బాలూ ఆడుకున్నారు.

అదికాగానే బుజ్జమ్మ ఏడుస్తూ ఉంటే ఒకాయన వచ్చి అనునయించాడు. "ఇంకెంత... కాస్సేపే..." అన్నాడు ఓదారుస్తూ.

మళ్లీ మేకప్ సరిచేశారు. ఈలోపల మళ్లీ కేకలు వినిపించాయి. అంతా సిద్ధమైనారు. ఈసారి దూరంగా ఉంచిన పెట్టెలోనుంచి ఒక పెద్ద కొండచిలువను తీశారు. ఒకడు బుజ్జమ్మను గుంజకు కట్టేశాడు. తర్వాత ఆ కొండచిలువను తెచ్చి ఆ పిల్లగొంతు చుట్టూ, ఒంటి చుట్టూ చుట్టాడు.

బుజ్జమ్మ కేకలు పెట్టింది. భయంతో వొణికిపోతూ అరిచింది. "బాబోయ్, నాయనోయ్" అని బొబ్బలు పెట్టింది. నిప్పుకోడిగాడు, మిగిలిన ఇద్దరూ చూడలేక బైటికి పోయి నిర్విణ్ణులై నిలబడ్డారు. అందరూ "బాగుంది... బాగుంది... మంచి రిజల్టు వొస్తున్నది" అని ఆనందించారు.

కొద్ది నిముషాలపాటు ఆ గుహ అంతా బుజ్జమ్మ అరుపులతో కేకలతో హోరెత్తిపోయింది. అంతా షూట్‌చేసి 'బ్యూటీపుల్' అనుకున్నారందరూ.

ఆ తర్వాత నిలువెల్లా వొణికిపోతున్న బుజ్జమ్మను మళ్లీ మళ్లీ బుజ్జగించారు. మళ్లీ ఒక దేవత పటం ముందు దణ్ణం పెట్టుకుంటూ ఏడుస్తున్న దృశ్యం చిత్రీకరించారు. 'ఏడవ'మన్నారు. వాళ్లలా అడగకముందే ఆ పిల్ల ఏడుపు మొదలుపెట్టింది.

మధ్యాహ్నం బుజ్జమ్మకీ, ముగ్గురు మగపిల్లలకి ఇతరులతోపాటు తిండి పెట్టారు.

నిర్మాత "అమ్మయ్య! అనుకున్న ప్రకారం పని పూర్తిచేశాం" అని సంతృప్తి ప్రకటించాడు.

నలుగురు పిల్లలూ "బ్రతుకుజీవుడా' అనుకుంటున్నట్టు దూరంగా చెట్టుకింద కూర్చున్నారు. బుజ్జమ్మ తన పాత గౌనుతో పాత అవతారంతో కూర్చుంది. మిగిలినవారందరూ ఇక తిరిగి ప్రయాణానికి సిద్ధమవుతున్నారు.

ఒక వ్యక్తి – నిన్న బుజ్జమ్మను చూసినవాళ్లిద్దరిలో ఒకడు – నడిచి వచ్చి – "ఇదుగో డబ్బు. ప్రొడ్యూసర్‌గారు ఇమ్మన్నారు" అని ఒక నోటు అందించాడు బుజ్జమ్మకు. ఇచ్చి వెంటనే వెళ్ళిపోయాడు.

రంగురంగుల నోటు... సరికొత్త నోటు.

బుజ్జమ్మ దాన్ని ఆబగా అందుకుని కళ్లు పెద్దవి చేసుకుని చూసింది.

"ఐదొందలు నోటు" అన్నాడు నిప్పుకోడిగాడు.

బుజ్జమ్మ దాన్ని వాడికి అందించింది.

ముగ్గురూ అతి మృదువుగా నెమ్మదిగా దాన్ని అందుకుని చూశారు.

మరికాస్సేపటిలో ఒక క్రిక్కిరిసిన వ్యానులో వాళ్లను చాలా సామాన్లతోపాటు కుక్కి స్టేషను దగ్గరికి తెచ్చి వొదిలిపెట్టారు. వాళ్లు కిందికి దూకగానే వ్యాను రివ్వున వెళ్లిపోయింది.

సాయంకాలమైంది. ఎదురుగా ఆకాశం అంతా ఎర్రగా ఉంది. సూర్యుడు జ్వాలాగోళమై అస్తమిస్తున్నాడు. స్టేషనులో తమ మామూలు చోటుకు చేరారు

నలుగురూ. బుజ్జమ్మ ఎందుకో వెక్కి వెక్కి ఏడుస్తూనే నిద్రపోయింది. మిగిలిన ముగ్గురూ పక్కనే కూర్చుని అయిదువందల రూపాయల నోటు ముందుంచుకుని రంగు రంగుల కలలు కంటున్నారు.

టన్నులకొద్దీ అయిస్క్రీము, వందలకొద్దీ పచ్చిమిరపకాయ బజ్జీలు, లెక్కలేనన్ని గోల్డ్‌స్పాట్‌లు, కొన్ని రంగుల స్టంట్ సినిమాలు వాళ్ల కళ్ల ముందు తిరిగుతున్నాయి.

బుజ్జమ్మకు మాత్రం చాలా పొద్దుపోయాక ఒక రాత్రివేళ కల వచ్చింది. పెద్ద పాము తనమీద పాకుతున్నట్టు... కెవ్వుమని కేకపెట్టి లేచి అంతలోనే కుదుటపడి మరో పక్కకు తిరిగి పడుకుంది.

# సున్నా శాతం స్కూలు

ముందుగా భయపడ్డంత దూరం ఏమీ కాదు, కేవలం రెండు గంటల ప్రయాణం. కాకపోతే బస్సుమాత్రం ఈ మే నెల నాటి భారతదేశం వలె కిటకిటలాడుతూ ఉండటం కొంచెం కష్టమనిపించింది. తీరా బస్సు దిగి చూద్దును కదా, స్కూలు ఊరి బయట దూరంగా ఉంటుందన్నారు. కనబడిన పాక హోటల్లో కాసిని కాఫీనీళ్లు గొంతులో పోసుకుని హుషారుగా నడిచి ఊరు దాటి స్కూలు ముందుకు వచ్చి నిలబడ్డాను.

స్కూలు మంచి షేపులోనే ఉంది. పాతబడినదే అయినా ఒక ముఖద్వారం, చుట్టూ ఇంగ్లీషు తుమ్మల హద్దు, లోపల ఒకమోస్తరు పాకలు ఇదీ స్కూలు పరిస్థితి. వాలకం చూస్తే లోపల ఏమీ కలకలం ఉన్నట్టు లేదు.

లోపలికి వెళ్లి హెచ్.ఎం. అని చిన్న బోర్డు ముందు ఆగి లోపలికి చూశాను. అవతల నుంచి ప్యూను అనుకుంటాను. ఒకడు నా వంక కళ్లెగరేసి 'ఏమిటన్న'ట్టు చూశాడు. ఆ తర్వాత నేను అతని సమ్మతి లేకుండానే లోపలికి అడుగుపెట్టాను. ప్యూను వెళ్లిపోయాడు.

హెచ్.ఎం. నావంక పరీక్షగా చూసి "మీరు... నువ్వు... వినాయకరావు కదూ?" అని పలకరించాడు.

నేనూ అతన్ని గుర్తుపట్టాను. తులసీదాసు... ఎప్పుడో ముప్పయి ఏళ్ల క్రిందట గుంటూరులో ఒకే కాలేజీలో ఇంటర్ వెలగబెట్టాం ఇద్దరమూ. అంతమందిలోనూ ఆనాడు మేమిద్దరం కలిసి మెలిసి ఉండటం చూసి అందరూ మమ్మల్ని 'కరటక దమనకు'లని సరదాగా వ్యవహరిస్తూ ఉండేవాళ్లు. నాకు ఇప్పుడతన్ని చూస్తే ముఖ్యంగా అక్కడ ఆ పొజిషన్లో చూస్తే అమితానందం కలిగింది.

నవ్వుతూ, "ఊరికే వచ్చాను, సరదాగా! ఈ స్కూలు చూసిపోదామని, అంతే!" అన్నాను.

"కూర్చో... కూర్చో! చాలా ఏళ్లకు తగిలావు, నిన్నొదలిపెట్టను!" అని, తర్వాత "ఏం చేస్తున్నావు? ఎక్కడుంటున్నావు?" వంటి ప్రశ్నలు సంధించాడు.

అన్నింటికీ సమాధానాలు చెప్పాను.

"ఊఁ బాగుంది. ఇప్పుడో, కాస్సేపటిలోనో మినిస్టరు గారొకాయన ఆకస్మిక వస్తున్నారు. ఆ తంతు పూర్తి అయ్యాక మా ఇంటికి పోదాం!"

"ఆకస్మిక తనిఖీకి వస్తుంటే ఆ విషయం నీకెట్లా తెలిసింది?" అని అడిగాను

అతను నన్నొక వెర్రివాణ్ణి చూసినట్టు చూసి, "అదంతేలే... వెయిట్ అండ్ సీ!" అన్నాడు.

"మరి... స్కూలులో పిల్లలేరీ? క్లాసులు లేవా?" అని అడిగాను.

"లేకేం? నిక్షేపంగా ఉన్నాయి!" అన్నాడు.

"అందర్నీ నిన్నటినుంచి ఇళ్లల్లో, రోడ్డుపక్కనా, పొలాల్లో, పక్కవాళ్ల పొలాల్లో, ఇళ్లల్లో ఇంకుడుగుంటలు తవ్వమని పంపించేశాను. అయినా పదో క్లాసు ఎలాగూ లేదిప్పుడు.... మిగిలిన వెధవలు అందరూ కలిసి వందమంది ఉంటారంతే! ఆడపిల్లలు ఒక పాతికమంది... వాళ్లెట్లాగూ రావడంలేదు!"

"మరి టీచర్లు?"

"ఉన్నారున్నారు. వస్తూ ఉంటారీపాటికి. మంత్రిగారి ఆకస్మిక తనిఖీ ఉందని కబురు పెట్టానందరికీ."

అంతలో ముగ్గురు నలుగురు మహాట్టహాసంగా కోలాహలంగా గదిలోపలికి వచ్చి హెచ్.ఎం.గారికి సవినయంగా సందడిగా నమస్కారాలు చేశారు.

తులసీదాసు వాళ్లందర్నీ పేరు పేరునా పరిచయం చేశాడు. "వీరు విష్ణురావు, ఎం.ఎస్.సి., పక్కపట్నంలో ఉంటూ ఉంటారు. రోజంతా చిట్‌ఫండ్‌లు, ఉదయం, సాయంకాలం ట్యూషన్లు. వీరు భగవంతంగారు... బి.ఏ.బి.ఇ.డి. సోషల్. వీరు షేరు మార్కెట్ వ్యవహారాల్లో నిష్ణాతులు. ఇక వీరు నందివర్ధనరావుగారు... భీమా బకాసుర బిరుదాంకితులు. వీరు కవి వృకోదర వీరభద్రయ్యగారు... వీరి కవితలు చదివే ఉంటావు... ఇక ఈవిడ..." అంటూ ఉండగా ఆమె తనంతట తనే, "నా పేరు శ్రీదేవి, మావారు ఎం.ఎల్.ఏ.గారికి పి.ఏ." అని పరిచయం చేసుకుంది.

"బాగుంది బాగుంది!" అన్నాను నేను.

అంతలో బయట కోలాహలం. అమిత సందడి. అందరం ఇవతలికి వచ్చాము.

హెచ్.ఎం.తోపాటు మిగిలిన టీచర్లు గేటు దగ్గరకి పరుగుపరుగున వెళ్లారు. గేటు పక్కన చెట్టుచాటున ఉంచిన బుట్టలో నుంచి పూలదండలు ఇవతలికి తీసి నిలబడ్డారందరూ. రివ్వురివ్వున ధ్వని చేసుకుంటూ దుమ్ము లేపుకుంటూ కొన్ని కార్లు వచ్చాయి. వెనుక ఆగిన కార్లలోనుంచి సాయుధలైన అంగరక్షకులు దిగి పరుగులు పెట్టుకుంటూ ముందుకు వచ్చారు. మంత్రిగారు రెండో కారులో ఉన్నారో, మూడో కారులో ఉన్నారో తెలియక కొన్ని క్షణాలు గందరగోళం నెలకొన్నది. చివరకు మూడో కారులో నుంచి మంత్రిగారు ప్రత్యేక రంగు చొక్కా, పంచె, పై పంచెలతో నల్ల కళ్లజోడుతో దిగివచ్చారు. ఆ వెనుక నుంచి బుల్లితెర ప్రైవేటు ఛానళ్లవారు దిగి అప్పటికప్పుడే కెమెరాలు సారించారు. ముఖద్వారం దగ్గర స్వాగత సత్కారాలందుకున్న వెంటనే మంత్రిగారు అందర్నీ వదిలి పక్కకు నాలుగడుగులు వేసి ఒకచోట ఆగి భ్రుకుటి ముడివేసి కళ్లజోడు తీసి, "ఏమిటిది?" అని గర్జించారు.

హెచ్.ఎం. "ఏమిటిది?" అని ప్యూన్‌ని చూసి గర్జించాడు. ప్యూన్ నీళ్లు నములుతూ "బహుశా... పక్క ఇళ్లవాళ్లు... మనమంటే గిట్టని ఎగస్పార్టీ వాళ్లు వాళ్ల పిల్లలను కూర్చోబెట్టి ఉంటారండీ...!" అంటున్నాడు.

మంత్రిగారు టీవీ కెమెరావైపు గంభీరంగా చూసి, "ఇట్లా అయితే ఊరుకోను, జాగ్రత్త! కఠినమైన యాక్షన్ తీసుకోవలసి ఉంటుంది. అది సస్పెన్షన్ అయినా కావచ్చు. ట్రాన్స్‌ఫర్ అయినా కావచ్చు! ఒళ్లు దగ్గర పెట్టుకుని ఉండండి అందరూ!" అన్నాడు. ఆ తర్వాత దండధరులై ముందుకు నడిచారు. ఆయన వెంట బలగమూ నడిచింది.

వరండాలో పర్యవేక్షణ జరుగుతూ ఉండగా రెండు మూడు గదుల్లో మాత్రమే అయిదారుగురికి మించి విద్యార్థులు లేకపోవడం గమనించి, మంత్రిగారు "మరి స్కూల్లో క్లాసులు జరగటంలేదా?" అని అడిగారు.

"చిత్తం! జన్మభూమి కార్యక్రమంలో భాగంగా ఇంకుడుగుంటలు శక్తికొద్దీ ఎక్కడపడితే అక్కడ తవ్వమనీ, అదయిన తర్వాత వీధుల్లో చెత్తాచదారమూ ఊడ్చిపారబోయమనీ మేమే చెప్పి తోలేశామండీ! ఈపాటికి వాళ్లంతా ఆ పనిమీదనే ఉండి ఉంటారండి. వాళ్లవెంట ముగ్గురు టీచర్లు కూడా ఉన్నారండి... పని పర్యవేక్షణ చేస్తూ, మిగిలిన టీచర్లు ఇక్కడే ఉన్నారండీ!" అని వివరించాడు హెచ్.ఎం. ఆ తర్వాత టీచర్ల రిజిస్టర్ ఒక్కసారి తిప్పి చూసి మంత్రిగారు సంతృప్తి చెందినవారై టీవీ కెమెరాల కెదురుగా నిలబడి టీచర్లను, హెచ్.ఎం.ను ఉద్దేశించి రెండు నిమిషాలే అయినా గంభీరంగా ఉపన్యసించారు. స్థానికులు కూడా కొందరక్కడ చేరి మంత్రిగారికీ, రాజధాని నగరంలో ఉండే పార్టీ ప్రముఖులకూ జయజయధ్వానాలు చేశారు. మంత్రిగారు సపరివారంగా మళ్లీ వెనుదిరిగిపోయారు. కార్లు కదలిపోవడంతో అంత కోలాహలమూ ఒక్కసారిగా సద్దుమణిగింది.

"హమ్మయ్య!" అనుకుంటూ కూర్చున్నాడు హెచ్.ఎం.

టీచర్లు కూడా "హమ్మయ్య!" అనుకుంటూ కూర్చుని సంతోషంగా ముఖాలు పెట్టి మాట్లాడుకుంటున్నారు.

డ్రింకులు వచ్చాయి. ప్యూన్ అందరికీ అందిస్తూంటే, "నా కొద్దు బాబూ! చల్లని డ్రింకు జలుబు చేస్తుంది!" అంటూ చెయ్యి అడ్డంగా ఊపింది శ్రీదేవి. అందరూ తమకేవేవో అర్జంటు పనులున్నాయని చెప్పి ఒకరి వెంట ఒకరుగా వెళ్లిపోయారు.

హెచ్.ఎం. బల్లమీద తన ముందున్న రకరకాల రిజిస్టర్లు విసిరి అవతల పడేశాడు విసుగుతో.

"అవన్నీ రాత్రల్లా చచ్చినట్టు తయారుచేశాము మేము నలుగురం కూర్చుని... చూడనే లేదు మహానుభావుడు!" అన్నాడు.

అప్పుడు వచ్చాడొకాయన. తళతళలాడే సిల్కు చొక్కా, గ్లాస్కో పంచె, వ్రేళ్లకు లావుపాటి ఉంగరాలు... మెడలో పులుగోరుతో పెద్ద గొలుసు... చాలా ఆర్భాటంగా

ఉన్నాడు. పెద్ద గొంతుకతో వచ్చీ రావడంతోనే "మంత్రిగారిని సాగనంపి వచ్చా! ఐసయిపోయినాడులే! మళ్లీ ఇప్పట్లో ఇటేపు సూడ్డు!" అన్నాడు కుర్చీ పట్టకుండా ఒదిగి ఒదిగి కూర్చుంటూ.

తులసీదాసు నన్నాయనకు పరిచయం చేసి ఆయన ఎవరో నాకు చెప్పనే లేదు. నేనే చొరవ తీసుకుని "వారిని పరిచయం చెయ్యనేలేదు!" అన్నాను. ఆ వ్యక్తి అందుకు అనవసరంగా ఫెళ్లున నవ్వి, "నేనా... నే నీద... ఈ ఊళ్లో... ఏం జెప్పాలబ్బా...?" అంటూ ఆగి, ఇంకొంచెం పెద్దగా నవ్వుతూ, "సర్పంచ్‌గారి మొగుణ్ణి అని అనుకోండి...!" అన్నాడు మరింత పెద్దగా నవ్వాడు.

ఆ తర్వాత మరో రెండు మూడు నిమిషాలే కూర్చుని మాటి మాటికీ పైకప్పు ఎగిరిపోయేలా నవ్వుతూ గడిపి, తర్వాత "ఎల్లొస్తా... మళ్లీ కలుస్తా!" అంటూ వెళ్లిపోయాడు. అతనివెంట అతని అంగరక్షకులిద్దరు, కండలు తిరిగిన వస్తాదులవంటివారు కూడా కదలిపోయారు.

"అది సరే..." అని మొదలుపెట్టాను నేను.

"రెండు సంవత్సరాలుగా వరుసగా... ఈ స్కూలు పదవతరగతి స్టూడెంట్స్ అందరూ ఏమాత్రం మినహాయింపు లేకుండా తప్పుతున్నారుట. పబ్లిక్ పరీక్షల్లో మా ఎడిటర్‌గారు ఒకసారి చూసిరమ్మంటే వచ్చాను నేను. సున్నాశాతం స్కూళ్లెన్నో ఉన్నాయట... అందులో ఇదొకటి అంటున్నారు...!"

అదే అదే చెప్పబోతున్నాను నేనుకూడా. పోయిన సంవత్సరం, ఆ క్రితం సంవత్సరం మొత్తం అందరూ తప్పారు. మొదటి సారి ముప్పయి మంది తర్వాత ముప్పయ్‌రెండు మందీ పబ్లిక్ పరీక్షలు రాసి మొత్తం ఫెయిలయినారు. ఈ సంవత్సరం ముప్పైయ్ ఒక్కమంది. అందులో ఆడపిల్లలు అయిదుగురు, పరీక్షలు రాస్తే ఇద్దరు పాసయినారు. ఒక అమ్మాయి, ఒక అబ్బాయి, వాళ్ళెందుకు ఎట్లా పాసయినారో తెలియడం లేదు. కబురు వెళ్లింది. రావాలి కాస్సేపటిలో – నిజానికి నేను ఈసారి కూడా మొత్తం అందరూ తప్పితే ఈ విషయంలో హ్యాట్రిక్ సాధించి ఏకంగా ప్రపంచ రికార్డు నెలకొల్పుదామని ఆశపడ్డాను. ఈ ఇద్దరు కుంకలూ నా ఆశమీద నీళ్ళు చల్లేశారు!" అంటూ కణతలు పట్టుకున్నాడు హెచ్.ఎం.

అంతలో ప్యూన్ కూడా హడావిడిగా వచ్చి, "వచ్చారు సార్!" అన్నాడు పెద్దగా.

"ఇదుగో, రోశయ్య, ఈయన ఏసురత్నం!" అంటూ ఇద్దరు నడివయసు వ్యక్తులను చూపించాడు. వారిద్దరూ దణ్ణాలు పెడుతూ లోపలికి వచ్చి ఒదిగి ఒదిగి గోడకానుకుని నిలబడ్డారు. వారివెంట ఒక పదిహేనేళ్ల నల్లని అమ్మాయి పెద్దపెద్ద తెల్లని కళ్లతో చుట్టూ భయంభయంగా చూస్తూను, మరో పదహారేళ్ల కుర్రవాడు జుట్టు వెనక్కి నెట్టుకుంటూను లోపలికి వచ్చి నిలబడ్డారు.

"ఏమయ్యా... ఏం చేస్తూంటావు నువ్వు?"

"తాపీ పని సార్. ఊళ్లు తిరుగుతుంటాను." అన్నాడతడు

"మీ అమ్మాయి పాసయింది."

"సంతోషం, సార్! మా ఆవిడ ఇంటర్ చదువుకుందయ్యా. తర్వాత మా పెళ్లి అయినంక సదువు మానేసింది. అదే కాస్త ఇంటికాడ కూలేసి సదివించింది సార్!" అన్నాడు ఏసురత్నం. "అవును, సదుంకొన్నాను..." అన్నది పిల్ల మెల్లిగా.

"సర్లే... సర్లే...!" అని విసుక్కున్నాడు హెచ్.ఎం.

"నువ్వు? నువ్వేం చేస్తుంటావు?" అని అడిగాడు మరో వ్యక్తిని.

"నా పేరు రోశయ్యండి. పక్కూళ్లో పొలం కౌలుకు చేస్తూంటానండీ!" అన్నాడతను.

హెచ్.ఎం. కుర్రవాడి వంక తిరిగి, "ఏరా వెధవా! ఎప్పుడూ స్కూలుకు రాకుండా తిరుగుతుండేవాడివి కదా, నువ్వెట్లా పాసైనావురా?" అని అడిగాడు.

"మరి హాజరు సంగతి?" అన్నాను మధ్యలో నేను.

"సరే... సరే... అదే అడిగావూ? అదంతా మేము మేనేజ్ చెయ్యడమేగా?" అంటూ, "చెప్పు... ఎలా పాసయినావు?" అని అడిగాడు కుర్రవాణ్ణి హెచ్.ఎం.

వాడు ముందు సందేహించినా, నీళ్లు నమిలినా చివరకు కొంచెం దబాయించేసరికి నిజం బయటపెట్టాడు. లెక్కల్లోనూ, సైన్సులోనూ వాడికి ఓ అంటే న రాదు. మిగిలినవి ఫర్వాలేదుట. ఆ రెండు సబ్జెక్టులను గురించీ అమిత శ్రద్ధ వహించి పరీక్ష జ్వరతీవ్రత మితిమీరి అద్భుతమైన ప్రజ్ఞతో కాపీలు తయారుచేసుకుని అంతకన్నా నైపుణ్యం చూసి హాల్లో తన పని కానిచ్చుకున్నాడు.

నేను ఆశ్చర్యపోయి, "మరి వాచర్లు చూడలేదా, పట్టుకోలేదా?" అని అడిగాను.

వాడు చిత్రంగా చూస్తూ "వాళ్లసలు రూములో ఉంటే కదండీ – వరండాలో పేపరు చదువుకుంటూ కూర్చున్నారండీ పరీక్ష జరుగుతున్నంతసేపూ..." అన్నాడు.

"మరి మిగిలిన స్టూడెంట్స్ అట్లాంటి పనికి పూనుకోలేదా?" అని అడిగాను నేను.

"అప్పటికీ నేను కొందరికి చెప్పానండీ, అళ్లు ఇనలేదండీ... అళ్ల అంతరాత్మలు అట్టాంటి తప్పుడు పనులు సెయ్యడాని కొప్పుకోలేదన్నారండీ!"

"సరే... సరే! వచ్చేవారం రండి, మార్కులొస్తాయి!" అన్నాడు హెచ్.ఎం.

వాళ్లు వెళ్లిపోయారు.

బయట గాలి బిగించింది. ప్యూను బయట గోడపక్కన ఘుట్కా నములుతూ కూర్చుని ఉన్నాడు. ఎక్కడో ఏదో పేరు తెలియని పక్షి వికృతంగా అరిచింది.

నేను లేచాను.

"అదేమిటి... వెళ్తున్నావా?" అన్నాడు హెచ్.ఎం.

"వెళ్తున్నాను...!" అన్నాను.

హెచ్.ఎం. వెనుక పెద్ద భారతదేశపు పటం గోడకు అంటించి ఉంది. దానిమీద పురుగులు కొట్టేసినందువల్ల అనేక రంధ్రాలు అసహ్యంగా. బల్లమీద ఒక చిన్నసైజు గ్లోబు. అతను చిరునవ్వు నవ్వి, "వస్తూ ఉండు, అప్పుడప్పుడూ!" అన్నాడు.

"అట్లాగే!" అంటూ నేను బయటికి నడిచాను. విచిత్రంగా ఆకాశంలో మబ్బులు కమ్మి వెలుతురు మందగించింది.

# మెత్తని చూపు

పద్దమ్మకు గుండెలో రాయి పడింది.

'ఉస్సుర'ని నిట్టూర్చి క్రింద కూలబడింది.

ఉదయం ప్రశాంతమైన వేళ. ఎంద రెండరో వచ్చి వెళ్తున్నారు.

కొండపైన గుడి... ఎత్తుగా మెట్లు... అన్ని మెట్లమీదా రెండు చివరలా అడుక్కునేవాళ్ళూ. కుంటివాళ్ళూ, గుడ్డివాళ్ళూ, సాధువులూ, బైరాగులూ, అందరూ చేతులు చాపి అడుక్కుంటున్నారు. దైవ దర్శనం కోసం పైకి వెళ్ళేవారి ముందు చేతులుచాపి కొందరూ, నలిగిపోయిన సత్తుగిన్నెలు చాపి కొందరూ గొడవగొడవగా రొదచేస్తూ అడుక్కుంటున్నారు. ఇన్ని దాటుకుని అన్ని మెట్లు ఎక్కి పైకి వెడితే కొండమీద వెలసిన అమ్మవారి దర్శనం అవుతుంది. ఆమె ఎప్పుడో చిరకాలం క్రిందట కొండెక్కి కూర్చున్నది. ప్రపంచమంటే అసహ్యం పుట్టిందో, లేక ప్రపంచంలో కరుడుకట్టిన విషాదం చూసి భరించలేకనో, కాకపోతే ఈ ప్రపంచాన్ని ఉద్ధరించే శక్తిలేకనో మరెందుచేతనో అమ్మవారు కొండెక్కి కూర్చుండిపోయింది.

గుడిమెట్ల క్రింద రొద... జీవితపు సందడి... వరసగా చిన్న చిన్న దుకాణాలు... వాటిమీద కొబ్బరికాయలు పేర్చబడివున్నాయి. దుకాణాలుమీద వున్నవారు వచ్చేపోయేవారిని "అయ్యా రండి... అమ్మా రండి... అమ్మవారికి పసుపు కుంకుమ టెంకాయ కర్పూరం అన్నీ యిక్కడున్నాయి. చెప్పు లిక్కడ విడిచి పొండి. మేము భద్రంగా చూస్తూ వుంటాం" అని అరుస్తూ పిలుస్తున్నారు.

పద్దమ్మ తన గాజుకళ్ళను మాసిపోయిన చిరిగిపోయిన చీరె కొంగుతో తుడుచుకుంది. మళ్ళీ ఒక్కసారి ప్రక్కనే దుకాణంమీద కూర్చుని వున్న సూరమ్మను ఆఖరి ప్రయత్నంగా "సూరమ్మా... తీసుకోనా?" అని అడిగింది.

సూరమ్మ గొంతు పెద్దది చేసి "వొద్దని చెప్పానుగా, అయినా నీకు మేమే దొరికామా? ఇన్నాళ్ళూ సంగతి తెలియక ఊరుకున్నాను. ఇప్పు డొద్దంటున్నాను... అంతే... దాన్ని ముట్టుకోకు." అన్నది బేరం చూసుకుంటూనే.

సూరమ్మ మొగుడు ప్రక్కనేవుండి కొబ్బరికాయ పీచు తీస్తున్నాడు. అతనుకూడా తలవూపి "అంతే, దాన్ని ముట్టుకోకు." అన్నాడు. అతడు కొబ్బరిపీచు కొట్టు క్రింద పడేస్తున్నాడు. ఇప్పటికే అది పెద్ద గుట్టయింది. పద్దమ్మ ఆ కొబ్బరి పీచువంకనే ఆశగా చూస్తున్నది. కళ్ళార్పకుండా చూస్తున్నది.

ఆడామగా పిల్లామేకా యావన్మందీ సందడి చేస్తూ పూజాద్రవ్యాలు కొనుక్కుని పైకి వెడుతున్నారు.

పద్దమ్మ ఇకఏమీ మాట్లాడలేదు. చూపులు మాత్రం కొబ్బరి పీచుమీదే వున్నాయి. ఆ పీచు తనకి కావాలి. తనకది చాలా అవసరం.

పద్దమ్మ మళ్ళీ మరొకసారి కొబ్బరి పీచువంక చూసింది. తలపెకెత్తి సూరమ్మ ముఖంలోకి చూసి ఆ మొహంలో కాఠిన్యం గమనించింది. వెంటనే లేచి "పోన్లే అమ్మా, తాకన్లే దాన్ని, ఇదుగో పోతున్నాను." అంటూ చేతికర్ర, పాత గోనె సంచీ రెంటినీ అందుకుని తడబడుతూ నడిచి ఇవతలకి వచ్చింది.

ఎదురుగా ఉన్న మరో దుకాణం దగ్గరికి తూలుతూ నడిచి వెళ్ళింది. ఆ దుకాణదారుడు పద్దమ్మ వంక చూశాడు. ఆమె ఎండిన కొమ్మలాగున్నది. ఎముకల పోగులాగున్నది. జీవితమంతా నెత్తినెక్కి కూర్చున్న దారిద్ర్య దేవత బరువుకు క్రుంగిపోయి శుష్కించిపోయి వున్నది.

ఆమె ఆ కొట్టు క్రింద పడివున్న కొబ్బరి పీచు మీద చెయ్యివేసిందంతే... అతడు గద్దించాడు. "ఏవఁమ్మోవ్, దాన్ని తియ్యకు." అని గర్జించాడు.

పద్దమ్మ తలఎత్తి "కొంచెం తీసుకుంటాన్నాయనా? ఎవరూ లేనిదాన్ని కడుపుకోసం" అంటున్నది.

అతడు మళ్ళీ గర్జించాడు. "అదేం వీల్లేదు - పో ఇక్కణ్ణుంచి."

పద్దమ్మ దీనంగా ఇవతలకి వచ్చింది. ఈ తంతు చుట్టుపక్కల దుకాణాల వారందరూ చూడనేచూశారు. ఇహ లాభం లేదనుకొని ఇవతలకి వచ్చింది పద్దమ్మ. వీధి చివర మేడముందు మెట్టుమీద చతికిలబడింది. ఆమెకు అంతలో సముద్రం గుర్తు వచ్చింది. ఎందుకు గుర్తు వచ్చింది? ఎందుకు గుర్తు వచ్చిందో తెలీదు. ఆమె సముద్రం ఒకసారి మాత్రమే చూసింది. ఎప్పుడో భర్తవెంట సముద్ర స్నానానికి వెళ్లింది. ముందు ఆ అనంత జలరాశిని చూడగానే భయం కలిగింది. తర్వాత ఆనందం కలిగింది. అప్పుడే సూర్యుడు ఉదయిస్తున్నాడు నిప్పు ముద్దలా. పెద్దపెద్ద అలలు పెనుపాములు దొర్లుతున్నట్టున్నాయి. అంతలో క్రమంగా నీళ్ల మీద బంగారు పూత వేస్తూ పైకి వచ్చింది సూర్య బింబం. సముద్రుడు శ్వాస పీలుస్తున్నట్టు, సముద్ర గర్భంలో ఎక్కడో ఉన్న ఏవో అదృశ్య లోకాల విషాద సంగీతం లాటి నిర్విరామ ఘోష.

పద్దమ్మ మళ్లీ కళ్లు తుడుచుకున్నది. చిన్నతనంలో శ్రావణ మాసాలు. ఆ సాయంకాలాలు. కుచ్చెళ్లు పైకి పట్టుకుని పసుపు కాళ్లతో ఆనందంగా నడిచిపోయే పడుచు పిల్లలు. ఆకాశంలో గుంపులు గుంపులుగా మబ్బులు.. ఉన్నట్టుండి పూలజల్లు కురిసినట్టు వాన జల్లులు, శనగలు ఇవన్నీ గుర్తొచ్చాయి.

పద్దమ్మ నిట్టూర్చింది. కొబ్బరిపీచు దొరకలేదు. ఇంక దొరకదు. కాస్త ఆధరువు పోయింది. ఇన్నాళ్లూ కొబ్బరి పీచు కూడా డబ్బు తెచ్చి పెడుతుందని తెలియక సూరమ్మ దాన్ని తనకు వదిలేసింది. ఇవాళ ఆ వివరం తెలిసింది. ఇక తీసుకో నిస్తుందా?

పద్దమ్మ లేచింది. ఇవాల్టికి గూటికివెళ్లి ఇంత తిని పడుకోడం మంచిది. ఇక రేపటి సంగతా? పైన దేవుడు లేడూ? అంతగా ఏమీలేకపోతే గుడిమెట్లమీద ఎక్కడో ఖాళీచూసుకుని కూర్చుంటే సరి... కాని అదీ అంత తేలిక కాదే, ఇవాళ ఉదయమే మెట్ల దగ్గర ఇద్దరు ముష్టివాళ్లు... ఇద్దరూ ఆడవాళ్లే... అందులో ఒకతె కుంటిది - జుట్టు జుట్టు పట్టుకుని క్రిందపడి దొర్లుతూ పోట్లాడుకున్నారు. పేచీ ఎక్కడ వచ్చింది? తాను రోజూ కూర్చుని అడుక్కునే చోట మరో మనిషి వచ్చి కూర్చోడం కుంటిది సహించలేకపోయింది. ముందు వాగ్యుద్ధం-లాపాయింట్లు.... ఆ తర్వాత అసలు యుద్ధం... అలాటప్పుడు తనకు అక్కడ చోటు దొరుకుతుందా? అదీ అనుమానమే.

పద్దమ్మ నడుస్తున్నది. పైన ఎండ... రోజూ నెత్తిమీద కొబ్బరి పీచుతో గోనె సంచి వుండేది. ఇవాళ ఆ బరువు లేదు... విసురుగా వచ్చే లారీలను, బస్సులను, తోపుడు బండ్లను, రిక్షాలను తప్పుకుని నడిచింది. వంతెన దాటి ఎత్తైన రోడ్డు మీదకి వచ్చింది. ఆ రోడ్డు క్రింద అటూ యిటూ పాకలు. పాకలనిండా జనం.

ఇది బాగా లారీలూ, బస్సులూ తిరిగే రోడ్డు.... పద్దమ్మ రోజూ కొబ్బరిపీచు తీసుకువెళ్లి ఆ రోడ్డు మీద పరిచి వుంచుతుంది. క్షణాని కొకటిచొప్పున విసురుగా కార్లూ, లారీలు, బస్సులూ వస్తుంటాయి కదా? ఆ పీచు బాగా నలుగుతుంది. తెల్లవారగానే పద్దమ్మ దాన్ని పోగుచేసి పలుచగా విడదీసి కొట్టువాడికిస్తే వాడు డబ్బులిస్తాడు. వాడు దాన్ని రిక్షాలకూ బస్సులకూ, ఉపయోగించే సీట్లుగా మార్చి విపరీతంగా సంపాయిస్తాడు.

నిన్నరాత్రి పద్దమ్మ కొబ్బరి పీచును నడిరోడ్డు మీద సర్దిపెట్టింది. అది బాగా నలిగివుంటుం దీపాటికి. ఒక గంటసేపు ఓపికగా కూర్చుని పలుచగా విడదీసి సంచిలో వేసుకుపోతే ఇవాల్టికి పావలా, లేక ముప్పై పైసలు వస్తాయి. దానితో ఈపూట గడుస్తుంది. రేపు సరే... ఏదో చూసుకోవచ్చు.

పద్దమ్మ నడుస్తున్న దల్లా చెయ్యి కళ్ళకు అడ్డం వుంచుకుని చూసింది. దూరంగా ఎవరో తన కొబ్బరి పీచును పోగుచేసి తీసుకుపోతున్నట్లు అనిపించింది. కలవరపాటుతో త్వరత్వరగా అడుగులు వేసింది.

అంతలోనే తడబడుతూ పరుగెత్తింది. "ఎవర్రా అది? అది నాది... దాన్ని ముట్టుకోకు" అని అరుస్తూ పరుగెత్తింది.

వెనక ఏదో తగిలినట్లయింది. పెద్ద లారీ... పైన దయ్యం బరువు.

పద్దమ్మ రోడ్డుమీదినుంచి దొర్లిపోయింది. చేతికర్ర దూరంగా పడిపోయింది. గోనెసంచి మరోప్రక్క పడిపోయింది. లారీ ఆగలేదు. రివ్వున దూసుకుపోయింది. పద్దమ్మ మళ్ళీ లేవలేదు.

# చిన్నమ్మ నవ్వింది

"ఒరే బుజ్జిగా! ఎన్నిసార్లు పిలవాలిరా? అన్నానికి రా! ఆ జెష్టను కూడా రమ్మను మింగటానికి!" అన్నది చుక్కమ్మ లోపలి నుంచి పెద్దగా.

బుజ్జిగాడు పుస్తకం మూసి లేచాడు. చొక్కా చివరతో ముక్కు తుడుచుకున్నాడు. వెనుతిరిగి గుమ్మంలో కూర్చుని ఉన్న అక్క వైపు చూశాడు.

పన్నెండేళ్ళ చిన్నమ్మ కదలకుండా కూర్చుని ఉంది. పక్కనే కర్ర. ఆమె పిన్నమ్మ మాటలు విన్నది. అయినా లేవలేదు. ఆమె కళ్లల్లో నీళ్లు నిలబడుతున్నాయి.

బుజ్జిగాడు నెమ్మదిగా – "అక్కా! అమ్మ రమ్మంటున్నది అన్నానికి!" అన్నాడు.

చిన్నమ్మ వాడి వైపు చూసిందే కాని కదలలేదు.

రెండు భాగాలుగా చిన్న పాక. పడమటి పక్కన రెండడుగుల ఖాళీ స్థలం. చివర దడి. సూర్యుడు నడినెత్తి మీదికి వచ్చాడు. ఎండ మాడ్చేస్తున్నది. వేడి గాలి విసురుగా వీస్తున్నది. చిన్నమ్మకు ఆకలవుతున్నది కాని లేవలేదు.

బుజ్జిగాడు అక్క దగ్గరకి వచ్చి, "రా అక్కా! అన్నం తిందాం" అన్నాడు మళ్లీ.

చిన్నమ్మకు మనసు బాగాలేదు. అప్పుడే కాదు, ఈ మధ్య కొద్ది రోజుల నుంచి అంతే. సంక్రాంతి పండుగ వెళ్లిన దగ్గరనుంచి అంతే. అంతకుముందు మనసు బాగుండేది. సవతి తల్లి ఇలా కసురుకునేది కాదు. ఆ సంక్రాంతి పండగతో తన రోజువారీ సంపాదనకు మద్యనిషేధం పుణ్యమా అని తెర పడింది.

లోపలి నుంచి మళ్లీ చుక్కమ్మ పెద్దగా – "ఏరా! ఏమైంది మీకు? రారేం?" అని అరిచింది.

బుజ్జిగాడు భయంతో కదిలాడు. చిన్నమ్మ కూడా దేకుతూ వచ్చింది.

చుక్కమ్మ కోపంతో– "ఏం? ఎన్నిసార్లు పిలవాలి?" అని గర్జించింది.

సత్తుపళ్లెంలో ఉన్న రెండు ముద్దలు గబగబా తిని ఇవతలికి వచ్చింది చిన్నమ్మ.

దేకుతూ వెళ్లి చాపమీద కళ్లు మూసుకుని ముడుచుకుని పడుకుంది.

వెంకటయ్య పగలు రిక్షా వేసేందుకు వెళ్లిపోయాడు ఉదయమే. ఇహనో, ఇప్పుడో వచ్చి కాస్త ఎంగిలిపడి మళ్లీ రిక్షా తీసుకుని ఊరిమీద పోతాడు. ఇక ఏకంగా రాత్రికి రిక్షా యజమానికి అప్పజెప్పి రావడమే. చుక్కమ్మ ఆ చుట్టుపక్కల నలుగురైదుగురు ధనికుల ఇళ్లల్లో చాకిరీ చేసి వేణ్నీళ్లకు చన్నీళ్లుగా కొంత సంపాదిస్తూ ఉంటుంది. బుజ్జిగాడు వీధి చివర మునిసిపల్ స్కూల్లో రెండో క్లాసు చదువుతున్నాడు. వాణ్ణి మొగుడూ పెళ్లా లిద్దరూ అపురూపంగా, అతి గారాబంగా

చూసుకుంటారు. చిన్నమ్మ వెంకటయ్యకు మొదటి భార్య సంతానం. చిన్నప్పుడే కాళ్లు రెండూ పోయి అవిటిదై ఉండిపోయింది. కళకళలాడే చామనఛాయ ముఖం, చక్కని కనుముక్కు తీరు. కాని అవిటిదై అందరికీ భారమైపోయింది. రెండేళ్లక్రితం వరకు చిన్నమ్మ ఇంట్లోనే అటూ ఇటూ దేకుతూ ఏమీ తోచక, ఎవరూ మాట్లాడేవారులేక, సవతి తల్లి మాటలు భరించలేక బాధపడుతూ ఉండేది. కాని ఒకప్పుడు అప్పట్లో ఆ పిల్ల అదృష్టంకొద్దీ ఆ వీధిలో ఉండే ఒక మాస్టారు ఒక ఉపాయం చెప్పాడు.

కాస్త దూరంలో మెయిన్ రోడ్డు. రోడ్డు మీద ఒక వైన్ షాపు కమ్ బార్. ద్రవాన్ని విడిగా రెండు మూడు రెట్లు భారీ ఖరీదు చెల్లించి ఖరీదైన బార్లలో తాపీగా కూర్చుని సేవించే భాగ్యం లేని మామూలు మనుషులు ఆ షాపుకు విస్తారంగానే వస్తూ ఉండేవారు. లోపల గోడవారగా గుండెల ఎత్తున బల్లలు, మధ్య మధ్య స్టూల్స్. నిక్షేపంగా మామూలు రేట్లకే మందుకొట్టే సదుపాయం. ఆ మాస్టారి సలహామేరకు ఆ షాపుముందు మెట్లమీద చేరింది చిన్నమ్మ. ఎదురుగా ఎత్తుపీట మీద జర్మన్ సిల్వర్ బొచ్చెలో ఉడికించిన బఠాణీలు, వాటిని తినేందుకు వీలుగా స్పూన్‌లుగా పనికొచ్చే ఎండుటాకులు పెట్టుకుని బిచాణా పరిచింది. లోపల సర్వర్ కుర్రవాళ్లకు చిన్నమ్మ అంటే జాలి – అవిటిపిల్ల అని వాళ్లు లోపల మందుకొట్టే మందుబాబులకు నంజుడుకు ఈ బఠాణీలు తీసుకుపోయి అందించేవారు. ఇదంతా చుక్కమ్మ అనుమతితోనే జరిగింది.

చిన్నమ్మ ఆ రోజుల్లో సాయంకాలం అయ్యేసరికి మొహం కడుక్కుని జుట్టు దువ్వుకుని తయారయ్యేది. మధ్యాహ్నమే సిద్ధంచేసి ఉంచిన బఠాణీల బొచ్చెతో బుజ్జిగాడు వెంటరాగా కర్ర ఊతంతో రోడ్డు దాటి వైన్‌షాపు ముందు మెట్లమీద ఒకచోట స్థిరపడేది.

క్రమంగా పగలు అంతరించి చీకటి పడేసరికి ఒక్కొక్కొరుగా, ఇద్దరిద్దరుగా, ముగ్గురు ముగ్గురుగా రకరకాల జనం మెట్లెక్కి లోపలికి వెళ్ళేవారు. పగటి బాధలు మరిచిపోయేందుకేమో దాహంగొన్నవారిలా ఎగబడేవారు. లోపల గోడవారగా బల్లలు- నిలబడి అర్జంట్‌గా మద్య సేవనం చేసే తొందర మనుషులకు – ఆ బాపతువారికి అన్నీ అర్జంటే- ఎక్కువసేపు ఉండలేరు. నిలకడ ఉండదు. సర్వర్ సీసా తెచ్చి ఇవ్వగానే మూత తీసేస్తూ, "నీళ్లు నీళ్లు" అని అరుస్తారు. నీళ్లు రాగానే గబగబా ద్రవాన్ని గ్లాసులోకి వంపుకుని నీళ్లు కలుపుకుని, అంత అర్జంటుగానూ గొంతులో పోసుకుని, మళ్లీ రెండోసారి అంత తొందరగానూ నీళ్లు, ద్రవం కలుపుకుని గటగట మింగి ఏ సిగరెట్లో కాల్చుకుంటూ వెళ్లిపోయేవారు ఒక బాపతు. వీళ్ల వల్ల షాపువాడికి తప్ప చిన్నమ్మకు ఏమీ లాభం లేదు. అలాకాక, జంటలుగా వచ్చి కాసిని కబుర్లతో స్టూల్స్‌మీద కూర్చుని నింపాదిగా మధుపానం చేస్తూ అంత నింపాదిగానూ ధూమపానం చేస్తూ మధ్య మధ్య నంజుడుకు బఠాణీలు తెప్పించుకుని, మందు చాలక, మళ్లీ తెప్పించుకుని, బఠాణీలు చాలక మళ్ళీ తెప్పించుకుని కబుర్లు తెమలక నింపాదిగా 'అనుభవించే'వారు కొందరు. వీళ్ల వల్ల షాపువాడికీ, బఠాణీల

చిన్నమ్మకూ కూడా లాభమే. ఇలా రాత్రి పొద్దుపోయే వరకూ, పదకొండు గంటలవరకూ, సాగేది వ్యాపారం. అప్పుడప్పుడు చిన్నమ్మ ఆశ్చర్యపోయేది. చిన్న సీసా యాభై, అరవై రూపాయలు పెట్టి ఎలా తాగగలుగుతున్నారు వీళ్లు? అంత డబ్బు వీళ్ల కెక్కడిది? అసలెందుకు తాగడం? వీళ్లు ఏం చేసి ఇంత డబ్బు సంపాయిస్తున్నారు? ఉపన్యాసాల్లో ఎన్నికలప్పుడు 'మనది పేద దేశమనీ, పేదరికాన్ని ప్రభుత్వమే పెంచి పోషించిందనీ' అంటూంటా రెందుకు?

ఖరీదైన కార్లలో తిరిగేవారికి, భారీగా డబ్బు తగలేసి వెర్రి సినిమాలు చూసే వెర్రి వెంగళప్పలకూ, పెద్ద పెద్ద భవంతుల్లో ఉండేవారికి అలా అనే అధికారం ఉందా? తాను ఇన్ని గంటలు కూర్చుని బఠాణీలు అమ్మితే తనకు మిగిలేది ఎంత? పదో, ఎనిమిదో. అయితే ఆ మాత్రపుదానికే చుక్కమ్మ మురిసిపోతూ, "అవిటిదైనా సంపాయించి పెడుతోంది పిల్ల" అని పక్కవారితో అంటూ ఉండేది.

అయిందా?

అదుగో, ఆ జనవరి పదహారు. పండగ తర్వాత తన దశ మారిపోయింది. శని పట్టినట్టయింది. 'అంతా బంద్' అన్నారు. షాపులకు తాళాలు పడ్డాయి. మందుబాబులకు మందు తేలిగ్గా దొరక్క బాధ. తనకేమో సంపాదన పోయిందనీ, సవతి తల్లి ధోరణి మారిపోయిందనీ బాధ.

ఆనాడు ఎప్పుడో బఠాణీల ఉపాయం చూపించిన మాస్టారు ఇవ్వాళ మళ్లీ రోడ్డు మీద వెళ్తూ చిన్నమ్మను పలకరించాడు– "ఎలా ఉన్నావు?" అని అడిగాడు.

చిన్నమ్మకు కళ్లనీళ్ల పర్యంతమైంది.

సవతి తల్లి లోపల ఎక్కడో ఉన్నందువల్ల నెమ్మదిగానే అయినా సంగతంతా వివరించింది. తనకు ఇలా బతకాలని లేదన్నది. చచ్చిపోతే మేలన్నది.

ఆయన నవ్వాడు. "చూద్దాం! అంతలోనే చచ్చిపోతే ఎట్లా?" అంటూ వెళ్లిపోయాడు.

ఆ మరునాడు ఉదయమే విచిత్రం జరిగింది.

బుజ్జిగాడు బుట్టెడు పూలతో వచ్చాడు.

"మాస్టారు పిలిస్తే వెళ్లాను. ఇవి ఇప్పించారు. మాలగా కట్టి, సాయంకాలం వెళ్లి వంతెన పక్కన కూర్చోమన్నారు" అని చెప్పాడు.

చిన్నమ్మ పూలు ముందు పోసుకుని కూర్చుని మాల కట్టడం మొదలుపెట్టింది. సన్నటి చేతివేళ్లు అమిత నిపుణంగా కదిలాయి. అందాల పూలమాల మూరెడెత్తున తయారైంది. దానిమీద నీళ్లు చల్లి ఉంచింది.

చుక్కమ్మ అంతా చూస్తూనే ఉండి, మధ్యలో బుజ్జిగాణ్ణి అడిగి విషయం తెలుసుకుని లోలోపల సంతోషించింది కాని పైకి ఏమీ అనలేదు.

సాయంకాలం ఆఫీసులు మూసే వేళ... జనం కొనుగోళ్లకు వచ్చేవేళ వెళ్లి వంతెన పేవ్‌మెంట్ మీద కూర్చుంది చిన్నమ్మ. ఎదురుగా పూలబుట్ట పెట్టుకుంది.

అటూ ఇటూ చాలామంది రకరకాల పళ్లూ, కూరలూ అమ్ముతున్నారు. అప్పుడు లిక్కర్‌షాపు ముందు ఒంటరి ఒంటరిగా, ఇద్దరిద్దరుగా మనుషులు వచ్చినట్టు కాక, మరింత రద్దీ ఇక్కడ. ముఖ్యంగా ఆడ - మగ జంటలు, పిల్లా మేకతో... రకరకాలవాహనాల మీదా, నడుస్తూనూ వచ్చారు. అవిటి పిల్లను గమనించి ప్రత్యేకించి ఆగి మరీ పూలు కొన్నారు. దేవాలయాలకు వెళ్లేవారు బేరమాడకుండా కొనుక్కుపోయారు. మొదటి సినిమా వదిలే వేళకు సరుకు ఖతమైపోయింది.

చిన్నమ్మ ఇంటికి చేరింది.

మాస్టారు వచ్చాడు. "పూలు పది రూపాయలు. ఇవ్వు" అన్నాడు.

చిన్నమ్మ డబ్బు లెక్కపెట్టింది. ఇరవై రూపాయలు పైన కొంచెం చిల్లరఉంది.

"పది రూపాయలు నీ సంపాదన" అన్నాడాయన పది రూపాయలు తాను తీసుకుని.

"రోజూ బుజ్జిగాణ్ణి పంపించు, పూలు ఇప్పిస్తాను" అన్నాడాయన వెళ్లిపోతూ.

చిన్నమ్మ డబ్బు అంతా పిన్నమ్మ చేతిలో పోసింది.

పిన్నమ్మ డబ్బు చూసుకుని నవ్వింది.

బుజ్జిగాడు నవ్వాడు.

చిన్నమ్మ కూడా నవ్వింది.

# కొంప మాత్రం మిగిలింది

"ఏదో భగవంతుడి దయవల్ల కొంప మాత్రం మిగిలింది" మాచమ్మ – మహాలక్ష్మమ్మ. అసలు పేరు మహాలక్ష్మి.

గడప మీద కూర్చుని గత అయిదారు నిముషాలుగా ఇటీవలే కాలం చేసిన తన ఒక్కగా నొక్క కొడుకును గురించి చెప్పవలసినవన్నీ చెప్పి చివరకు అన్న మాట లివి.

చత్వారపు కళ్లజోడు తీసి, ధోవతి కొంగుతో ముఖం తుడుచుకుంది ముందు. ఆ తర్వాత అద్దాలు తుడుచుకుంది. మళ్లీ జోడు ముఖానికి తగిలించుకుంది.

కుర్చీలో కూర్చుని అంతవరకూ ఆమె చెప్పిన విషయాలు విని నిట్టూర్చాను.

"నిండా నలభై ఏళ్లు లేవు!" అన్నాను.

"కాదులే, ఈ నెలతో నలభై రెండు వెళ్లి మూడు వస్తుంది" అన్న దామె.

"అది మాత్రం ఏం వయస్సని? అరవై డెబ్బై దాటి రాళ్లలాగా తిరుగుతున్న వాళ్ళందరు లేరూ!"

"అదేమన్నమాట! అందరూ ఇలాగే ఉంటున్నారా? వయస్సులో ఉన్నప్పుడు 'పెళ్లి చేసుకోరా నాయనా' అని శతపోరితే విన్నాడా? 'నాటకాలు నాటకాలు' అని చిందులు తొక్కాడు తప్ప ఇల్లూ, పెళ్లాం, పిల్లలూ అన్న యావ ఉంటేనా?" అంటూ మళ్లీ కళ్లు తుడుచుకుంది ఆమె.

నేను లేచి గొడుగు అందుకుని, "వెళ్లొస్తాను" అన్నాను.

"మంచిది, నాయనా! వెళ్లిరా! అప్పుడప్పుడూ వస్తూ ఉండు!"

నేను కదిలాను. ఎందుకో 'దిగులు కలిగింది.

వీధి మలుపు తిరుగుతూండగా చప్పట్లు వినిపించాయి. వెనుదిరిగి చూద్దును కదా! ఒక ఇంటి గేటు ముందు లుంగీ కట్టుకుని, కేవలం పై పంచెతో నిలబడి ఉండి నన్నే పిలుస్తున్నారెవరో, "నిన్నే... నిన్నే!" అన్నారు కూడా పెద్దగా.

అటు నడిచాను.

రామకృష్ణ. మాచమ్మ కొడుకు సత్యానికీ, నాకూ స్నేహితుడు.

"నిన్నే! రారా!" అన్నాడతను మళ్లీ.

వెళ్లగానే ఎదురొచ్చి చేతులు పట్టుకుని, "ఎన్నాళ్ల కెన్నాళ్లకు" అన్నాడు. లోపలికి దాదాపు లాక్కుపోయాడు.

వరండాలో కూర్చోబెట్టి, గుమ్మంలో నిలబడి, "ఏమేవ్! ఎవరొచ్చారో చూడు!" అంటూ భార్యను పిలిచాడు.

ఆమె వస్తూనే చేతులు జోడించి, "అప్పుడెప్పుడో సభలో చూశాను". అన్నది.

"కూర్చోండి, కాఫీ తెస్తాను" అంటూ లోపలికి వెళ్లింది.

రామకృష్ణ నన్ను కుర్చీలో కూలవేసి తాను మరో కుర్చీలో సెటిలై, "ఊఁ, చెప్పు! ఎక్కడుంటున్నావు? ఏమిటి సంగతి?" అని అడిగాడు.

నేను అన్నీ చెబితే విని, "మొత్తానికి ఉద్యోగం పుణ్యమా అని దేశమంతా తిరుగుతున్నావన్నమాట! గుడ్!" అన్నాడు. ఆమాటా, ఈమాటా పూర్తి అయ్యాక, కాఫీ సేవనం పూర్తి అయ్యాక, "ఇప్పు డెక్కడి నుంచి వస్తున్నావు?" అని అడిగాడు.

"మన సత్యం పోయాడని తెలిసి - అదీ పేపర్లో చదివాను. ఎలాగూ ఈ ఊరు వచ్చాంకదా ఒకసారి ఆ ముసలామెను చూసిపోదామని వచ్చాను."

"చూశావా?"

"ఆఁ, చాలా దారుణంగా ఉంది పరిస్థితి. ముసలమ్మ ఊరికే ఏడుస్తుంది. ఏదో ఆ ఇల్లు మాత్రం మిగిల్చాడు సత్యం. వచ్చే బాడుగరాళ్లతో బతుకుతున్నది. అదీ లేకపోతే ఆమె బతుకు రోడ్లపాలై ఉండేది, పాపం!"

రామకృష్ణ నిట్టూర్చాడు. "సత్యం ఎలా పోయాడో చెప్పిందా నీకు?" అని అడిగాడు.

"ఆఁ నాటకం వెయ్యడానికి వెళ్లాట్ట. వారం రోజులపాటు ప్రోగ్రాములు. మామూలు వేషమే. మూడో కృష్ణుడు. తెల్లవారుజామున నటిస్తూనటిస్తూ స్టేజీ మీద కుప్పకూలిపోయాట్ట. పాడుతూ పాడుతూనే పడిపోయాట్ట."

"ఇదంతా పేపర్లో వచ్చిందేగా?"

"మరి....?!"

రామకృష్ణ గంభీరంగా- "నేనూ ఉన్నాను ఆనాడు వాడివెంట. నువ్వు చెప్పిందీ, ఆ ముసలమ్మ అనుకుంటున్నదీ, పేపర్లో వచ్చిందీ ఒకటే. కాని అసలు విషయం వేరు." అన్నాడు.

నేను నివ్వెరపోయాను.

"అంటే?"

"అంటేనా! అసలు జరిగింది వేరు" అని మొదలుపెట్టా డతడు.

అసలు జరిగిందేమిటంటే-

సత్యం చాలా ఏళ్లుగా మితంగా తాగుడుకు అలవాటుపడ్డాడు. పెళ్లీ, పిల్లలూ వంటి బాదర బందీలు లేవు, బాధ్యతలు లేవు. ఎదుట యజమాని లేని ఉద్యోగం. చేతినిండా డబ్బు. మంచి రూపంతో, మంచి గాత్రంతో పౌరాణిక పాత్రధారణలో - అందులోనూ ముఖ్యంగా కృష్ణ వేషధారణలో- చక్కని పేరు ప్రతిష్ఠ లుండేవి. రోజూ ఎక్కడో గదిలో తొక్కుడు హార్మోనియం ముందు సహ నటులతో కలసి సాయంవేళ రాగాలు తీసి తీసి తిరిగి వస్తూ, చాలా మితంగా గొంతు తడుపుకుని వచ్చేవాడు.

తల్లి - "ఏమిటీ వాసన?" అని అడిగితే, "అది స్కూటర్ పెట్రోల్ వాసనలే" అని ఆ అమాయకురాలు నమ్మబలికేవాడు. పగటివేళ మామూలుగా తన ఉద్యోగ

బాధ్యతలు – డాక్టర్ల చుట్టూ తిరగడం, మందుల గురించిన లెక్కరర్లివ్వడం వంటివి చూసుకునేవాడు. ఇటీవల వరుసగా అయిదారు ప్రోగ్రాములు – ఉద్యోగ విజయాలు పెద్ద టీమ్‌తో పడ్డాయి. ఇతని పాట అంటే జనానికి మక్కువ ఎక్కువ కావడంతో అర్ధరాత్రి దాటాక మూడో కృష్ణుడుగా గిరాకీ ఉండేది. అతి దీర్ఘ రాగాలకు శ్రోతలు పరవశులై కరతాళ ధ్వనులతో, వన్స్‌మోర్‌లతో స్పందించేవారు. అతడు మరింత రెచ్చిపోయి పాడేవాడు. ఆనాడు పదిన్నరకు నాటకం మొదలైంది. సత్యంతోపాటు ఒక వ్యక్తి హాలు వెనక చివర గదిలో కూర్చుని ఉన్నాడు. తాను అతని వీరాభిమానినని చెప్పుకున్నాడు. కాసేపయ్యాక సత్యం నిట్టూర్చి – “ఏమిటో... బాగులేదు. ఈ మధ్య అంతా డల్‌గా ఉంది. కాస్త గొంతు తడుపుకునే సావకాశం లేకుండా పోయింది” అన్నాడు.

ఆ వ్యక్తి నవ్వాడు. సత్యం మళ్లీ “నిషేధం నాటికి ముందుగా నాలుగైదు బాటిల్స్ మా మదర్‌కు తెలియకుండా ‘మందులులే’ అని చెప్పి స్టాక్ చేసుకున్నాను. కాని ఎంత పొదుపు పాటించినా పదిహేను రోజులు కూడా రాలేదు. అప్పటినుంచి పరగడుపే, మునుపు కాస్త గొంతు తడుపుకుని స్టేజి ఎక్కితే ఎంత బాగుండేది! అలుపూ సొలుపూ ఉండేది కాదు. అలాంటిది ఉన్నట్టుండి ఒక్కసారి బంద్ అయ్యేసరికి హుషారే పోయింది. గొంతు మునుపటిలా పలకడంలేదు. పైగా తొందరగా అలుపొచ్చేస్తున్నది” అన్నాడు.

“ఈ నిషేధం దారి నిషేధానిదే. మందుదారి మందుదే! అయినా వాళ్ల పిచ్చి గాని, ఈకాలంలో, పసిపిల్లలకు కూడా అన్నీ తెలిసిన ఈ కాలంలో ఇలాంటి నిషేధాలు ఏం సాధించగలవు సార్? లక్షలాది రకరకాల వాహనాలు, వందలాది రైళ్లు దేశమంతా తిరుగుతూండగా, చుట్టుపక్కల దేశమంతా బ్రాందీ, విస్కీలు పుష్కలంగా దొరుకుతూండగా ఎన్ని ఆంక్షలు పెడితే మాత్రం ఏం లాభం? మన రాజకీయుల, అధికారుల తంతు తెలుసు కదా? చిన్న పదవిలో ఉన్నవాడు సైతం ‘సంతకాని కింత’ అని బాహాటంగా పుచ్చుకునే సమాజం మనది. ఇచ్చేందుకు సిగ్గుపడకపోగా, ‘ఇవ్వకపోతే పను లెలా జరుగుతాయి’ అని ఇచ్చేవారు సమర్థించుకునే దేశం మనది. పైగా ఏ కెమిస్ట్రీ స్టూడెంట్‌గాడైనా తయారుచేయగలడు విస్కీ బ్రాందీలను. ఇక పల్లెపట్టు లన్నీ బహిరంగ లేబొరేటరీలే. చెట్టు చెట్టు చాటున సారా. ఒకప్పుడు ఎక్కువమందికి దాని తయారీ గురించి తెలియని రోజుల్లో, తాగడం గొప్ప పాపమని అందరూ భావించిన రోజుల్లోనే విఫలమైతే ఎత్తేసిన పనికిరాని నిషేధం ఇది. ఇప్పుడు కాస్త చదువుకున్న ప్రతి గన్నాయిగాడికీ దాని తయారీ తెలుసు. పైగా, దారుణ మేమిటంటే కల్లు పరవాలేదుట, పనికొస్తుందట. ఇక కల్తీ సరుకు ముమ్మర మవుతుంది చూడండి. చూస్తు ఉండండి!”

ఆ వ్యక్తి ఇలా మాట్లాడుతూ ఉండేవాడే ఇంకా – సత్యం అంతటితో అతన్ని ఆపి, “అది సరే, ముందు మన కెక్కడైనా కొంచెం మందు దొరుకుతుందేమో చెప్పండి” అంటూ ముగ్గులోకి వచ్చాడు.

"దానిదేముంది, లేవండి!" అన్నాడతను.

ఇద్దరూ లేచి ఇవతలికి వచ్చారు. లోపల నాటకం నడుస్తున్నది.

అతడు మళ్లీ కొనసాగించాడు- "ఒక తేదీ నిర్ణయించారు. ఆ తేదీ దాటాక ఆ రాత్రితో అమ్మకాలు ఆపేసి షాపులకు తాళాలు వేసి, సీళ్లు వేసి లోపల ఉన్న సరుకంతటినీ గవర్నమెంటోడి కప్పజెప్పి తూర్పు తిరిగి దణ్ణం పెట్టాలట. అట్టా ఎవరైనా అప్పజెపుతారా? ఈ జనమంతా అంత త్యాగశీలురై ఉండాలా? మీరు మాత్రం కట్టవలసిన పన్నులు కూడా ఎగ్గొట్టి సమాజాన్ని దోచుకుని పదవులు పొంది కులకవచ్చు. జనం మాత్రం త్యాగ గుణం కలవారై ఉండాలి. యుద్ధమొచ్చినా, తుఫానొచ్చినా – ఆ మాటకొస్తే ఏమీ రాకపోయినా జనం మాత్రం త్యాగాలు చెయ్యాలి, చేస్తూ ఉండాలి."

సత్యం వింటూ నడిచాడు.

అతడు మళ్లీ – "ఒక వైన్‌షాపు యజమాని నాకు తెలిసినవాడే. అంత త్యాగం అతనివల్ల కాలేదు. ఆనాటికి ఏదో నామకః కొన్ని సీసాలు షాపులో అట్టేపెట్టి, మిగిలిన స్టాకు అక్కడక్కడా దాచిపెట్టేశాడు. అది నెమ్మది నెమ్మదిగా, ఇదిగో ఇలాంటి అర్జెంట్ కేసుల్లో నాలుగైదు రెట్లు రేటు పెంచి సొమ్ము చేసుకుంటున్నాడు" అన్నాడు.

పుచ్చపువ్వులా వెన్నెల... సత్యం మనసులో కొత్త హుషారు.

ఆ వ్యక్తి ఒకచోట సత్యాన్ని నిలిపి ఉంచి ఒక చిన్న సందులోకి వెళ్ళి ఒకటి రెండు నిముషాలలో ఖాళీ చేతులతో తిరిగి వచ్చాడు.

"సారీ సార్! స్టాక్ అయిపోయిందట" అన్నాడు.

"అరె! ఎలా ఇప్పుడు?" అన్నాడు సత్యం ఏదో కొంప మునిగిపోయినట్టు, జరగరానిది జరిగినట్టూ గొప్ప ఆశాభంగంతో.

"మీ కెందుకు, నే నున్నాను, సార్! రండి, ఇంతలోనే అయిపోయిందా? కనీసం వారానికి ఒక లారీలో సగం లోడ్ వస్తూ ఉంటుంది ఇక్కడికి. ఇదంతా మంత్రిగారి ఇలాఖా. ఇక్కడ ఎవరూ అడుగు పెట్టరు. ఇటు మద్రాసు నుంచో, అటు మహారాష్ట్ర నుంచో, కర్ణాటక నుంచో, కాకపోతే ఒరిస్సా, అస్సాం నుంచో, అదీ కాకపోతే హర్యానా, రాజస్థాన్ నుంచో పుష్కలంగా సరుకు వస్తూనే ఉంటుంది. ఎక్కడెక్కడికి రోడ్డు సౌకర్యం, రైలు సౌకర్యం ఉందో, అక్కడక్కడ నుంచి దిగుమతి అవుతూనే ఉంటుంది. కాకపోతే కొంచెం శ్రమ, ఖర్చు తప్పవు. అంతే మరి! శ్రమ పడకపోతే ఏది మాత్రం ఎలా వస్తుంది చెప్పండి.?"

అతడు ఈసారి మరో వైపు దారితీశాడు.

రెండు నిముషాలు నడక. ఈసారి అతను చేతిలో సంచీతో వచ్చాడు.

సత్యం హడావుడిగా "ఎంత?" అన్నాడు.

"నాలుగొందలు. ఫుల్."

"మరొకటి దొరకదా?"

"చూద్దాం!" అంటూ అతడు ఎనిమిది వందలూ తీసుకెళ్లి ఈసారి నిండు సంచితో వచ్చాడు.

అక్కడ నాటకం కొనసాగుతున్నది. జనం హాలునిండా నిండి పద్య నాటకాన్ని చక్కగా ఆనందిస్తున్నారు.

సత్యం ఇన్నాళ్లుగా దాహం గొన్నవాడిలా మౌనంగానూ, వేగంగానూ లాగించేశాడు. సీసా మూడువంతులు అయిపోయింది. ఆ వ్యక్తి కొద్దిగా మాత్రం పోసుకున్నాడంతే.

సత్యం అతనితో, "నాటకానికి ఉండాలా?" అన్నాడు.

అతడు కదిలి వెళ్లిపోయాడు. సమాధానం ఏమీ రాలేదు. సత్యం వాచీ చూసుకున్నాడు.

అవతల చప్పట్ల హోరు ఎక్కువగా ఉంది. మంచి ప్రేక్షకులు.

'అలాంటి ప్రేక్షకులు దొరికితే నటుడికి మరింకేం కావాలి?' అనిపించింది.

మేకప్ ముగించుకుని కిరీటధారణకు ముందు సీసా వంచి గొంతులో పోసుకున్నాడు. లోపలి నుంచి ఎక్కడెక్కడి నరాల్లోనో నిద్రాణమై ఉన్న శక్తి తన్నుకుని గొంతులోకి వచ్చినట్టనిపించింది.

ఆ తర్వాత చివరి కృష్ణుడుగా రంగప్రవేశం చేశాడు. జనం రెచ్చిపోయి ఈలలు కేకలతో, కరతాళ ధ్వనులతో అతన్ని ఆహ్వానించారు. తర్వాత నిశ్శబ్దం నెలకొన్నది.

సత్యం ఒక అరగంట సేపు స్వైరవిహారం చేశాడు.

గొంతులో అద్భుతమైన ధ్వనులు పలికించాడు.

ప్రతి పద్యానికీ ప్రేక్షకుల స్పందన మితిమీరిపోయింది.

అప్పుడు....

ఒక పద్యం ముగించి రాగం తీస్తూ తీస్తూనే నెమ్మది నెమ్మదిగా రంగస్థలం మీదనే ఒరిగిపోయాడు. గొంతు మూగపోయింది. కల్తీ సరుకు కాటువేసింది.

పేపర్లలో మాత్రం 'ప్రముఖ రంగస్థల నటుని నిర్యాణం', 'రంగస్థలం మీదనే ప్రాణం విడిచిన మహానటుడు'వంటి హెడ్డింగులతో వార్తలు వచ్చాయి.

రామకృష్ణ విషయం ముగించి, "నేను ఆనాడు నాటకం పూర్తిగా చూడదలుచుకుని మొదటినుంచీ జనంలోనే కూర్చుండిపోయాను. లేవనైనా లేదు. ఇంత కథ నాకు తెలియకుండానే జరిగిపోయింది. అతని బాడీ తీసుకువస్తూ దోవలో అడవి మధ్యలో కారు ఆపించి, దూరంగా నడిచివెళ్లి అతని సంచిలో ఉన్న రెండో విషం బాటిల్‌ను రాళ్ల మీద విసిరి పారేశాను" అన్నాడు.

కొన్ని నిముషాలు అలాగే నిశ్శబ్దంగా కూర్చుండిపోయాను.

తర్వాత లేచాను, "వస్తాను బ్రదర్!" అన్నాను.

"అప్పుడప్పుడూ వస్తూ ఉండు!" అన్నాడతను.

# ముస్తఫా

వాడివాళ మళ్లీ కనిపించాడు.

పది పదిహేను రోజుల తర్వాత – ముస్తాఫా.

వీథి గుమ్మంలో నిలబడి తల లోపలికి పెట్టి చూస్తూ వరండాలో నేను కనిపించేసరికి పళ్లన్నీ బయటపెట్టి నవ్వుతున్నాడు.

"నువ్వా? లోపలికి రా, వెధవా!" అన్నాను.

వాడు చేతిలో బరువైన కూరగాయల సంచీతో నడిచి వచ్చి, సంచీ వరండాలో ఉంచి ఆ పక్కనే కూలబడ్డాడు. నవ్వుతూనే ఉన్నాడు. జుట్టు నున్నగా దువ్వుకుని ఉన్నాడు. కొంచెం వొదులుదే అయినా శుభ్రమైన చొక్కా తొడుక్కుని ఉన్నాడు. పేవ్‌మెంట్ మీద చౌక ధరకు దొరికే సెకండ్ హ్యాండ్ ప్యాంటు కాబోలు తొడుక్కుని ఉన్నాడు.

ఇంతకుమునుపు నాకు కనిపించిన ముస్తఫా వాలకం వేరు. అప్పుడూ ఇలాగే వీథి గుమ్మంలో నిలబడి లోపలికి చూస్తూ వాడు నా దృష్టిని ఆకర్షించాడు. అప్పుడు జుట్టు దుబ్బుగా పెరిగి తలంతా మట్టికొట్టుకుని పాముల బుట్టలా ఉంది. చొక్కా పీలికలైపోయి ఛండాలంగా ఉంది. చాలాసేపటి నుంచి ఏడవటం వల్ల కాబోలు మొహం అంతా కన్నీళ్లు చారికలు కట్టి ఉన్నాయి. కళ్లు ఉబ్బి ఉన్నాయి. అప్పుడు నేను సైగ చేస్తే లోపలికి వచ్చి కూర్చుని భోరున ఏడ్చాడు.

"ఏరా? ఏం జరిగింది?" అని ఎన్నోసార్లు అడగ్గా, ఏడుపు దిగమింగి చెప్పాడు.

"నాన్న కొట్టాడు. చచ్చేట్టు కొట్టి, ఇంట్లో నుంచి వెళ్లిపొమ్మన్నాడు."

"ఎందుకు?" అని అడిగాను నేను.

"డబ్బు తేవడంలేదని."

నిజమే. వీడీ మధ్య డబ్బు సంపాదించడం లేదు. సంక్రాంతి పండుగతో వీడి ఉద్యోగం ఊడింది. సంపాదన ముగిసిపోయింది. అంతకుముందు నిరంతరం రద్దీగా ఉండే ఒక బ్రాందీషాపులో 'ఛీఫ్ బాయ్'గా పనిచేసేవాడు. వీడి కింద మరో ఛోక్రా ఉండేవాడు. గొడ్డుచాకిరీ. అయితే నేమి రోజుకు నాలుగు రూపాయల చొప్పున జీతం వారానికోసారి చేతుల్లో పడేది. నాగా పెడితే జీతం కట్. సాధారణంగా వాడి సంపాదనను ముందుముందుగానే వాడి రోగిష్టిమారి తండ్రి ఖుద్దూస్ వచ్చి నొల్లుకుపోయేవాడు. దాన్ని గురించి ముస్తఫా బాధపడేవాడు కూడా కాదు. వాడి కది ముఖ్యమే కాదు. షాపులో మందుకొట్టిన మహానుభావులు వీడి సర్వీసుకు మెచ్చి

పడేసే రూపాయి, అర్థా వీడికి ముఖ్యం. రోజుకు ఎట్టి పరిస్థితులలోనూ పది రూపాయలు కళ్లజూసేవాడు. అందులో రూపాయో, అర్ధో మాత్రం ఉంచుకుని, మిగతాది అతి జాగ్రత్తగా తల్లి మెహతాబ్ చేతికిచ్చేవాడు. ఆ పేద తల్లి దాంతో మిగిలిన ఇద్దరు పసిపిల్లలకు ఇంత తిండి పెట్టేది.

ఎవరో చెప్పినట్టు - అన్నట్టు ఇంత ఘనమైన విషయం చెప్పడాని కెవరో మహానుభావు లెందుకు? ఎవరైనా చెప్పవచ్చు - కాలం ఎప్పుడూ ఒకే రీతిగా గడవదు కదా!

ఉన్నట్టుండి తెలుగు కష్టజీవుల, తెలుగు బడుగుజీవుల జీవితవనంలోకి తెలుగు మంద మలయానిలంలా, తెలుగు ఆడపడుచుల కన్నీటి కడగండ్లను కరిగించే మంత్రదండంలా, తెలుగు సమాజంలోని సమస్త రుగ్మతలకు దివ్యౌషధంలా, సర్వరోగ నివారిణిలా సంపూర్ణ మద్యనిషేధం మళ్లీ వచ్చింది. వస్తూ వస్తూనే ముస్తఫా నోట్లో మట్టికొట్టింది. ముస్తఫా వీథిన పడ్డాడు. అంతకాలం చాకిరీ చేసినా యజమాని ఇచ్చిం దేమీ లేదు. ఇంటికి వెళ్తే చాలు కోపిష్టి, రోగిష్టి తండ్రిచేత దెబ్బలు తప్ప తిండి తినే యోగం లేదు. అదుగో, సరిగ్గా అప్పుడు వచ్చాడు వాడు మా ఇంటికి. అప్పుడు నేను ఒక పరిచయస్తుడితో మాట్లాడుతూ, ఇప్పటివలెనే వరండాలో కూర్చుని ఉన్నాను. వీడి సొద అంతా విని ఆ మిత్రుడు "వీణ్ణి నా కొదిలెయ్యండి. వీడి సంగతి నేను చూసుకుంటాను" అన్నాడు.

'అలాగే... పాపం, ఏదో దారి చూపెట్టండి వాడికి' అని ఉంటాను నేను.

ఆ తర్వాత ఇప్పుడిలా ప్రత్యక్షమైవాడు ముస్తఫా మళ్లీ.

"ఏరా? బాగున్నావా?" అని అడిగాను నేను.

వాడు నవ్వుతూ తల ఊపాడు.

"ఏం చేస్తున్నా విప్పుడు?"

"ఆ అయ్యగారు... మీ ఫ్రెండ్ పని ఇప్పించారండీ!" అన్నాడు.

"ఏం పని?"

వాడు వెంటనే బదులు పలకలేదు కాని, నెమ్మదిగా నా కుర్చీ పక్కకు జరిగి జరిగి వచ్చాడు.

"పెద్ద పనేమీ ఉండదండీ! బాగా తిరగాలి. అంతే!"

"జీతం ఎంత?"

వాడు మళ్లీ తొందరగా సమాధానం చెప్పలేదు కాని, కాస్త ఆగి, "బాగానే ఉంటుందండీ!" అన్నాడు.

"బాగానే అంటే...?"

"అంటే..." అని నసుగుతూ, "ఇంత అని ఉండదండీ! కాని ట్రిప్పుకు యాభై తగ్గదండీ. ఒక్కొక్కప్పుడు రోజుకు రెండు ట్రిప్పులు కూడా పడాతాయండి."

'ఏమిటో పిచ్చి గోల' అనిపించింది నాకు. మరేమీ అడగకుండా ఊరుకున్నాను.

కాని, బహుశా  గలేక కాబోలు, వాడే నెమ్మది నెమ్మదిగా నాకు అంతా అర్థమయ్యేటట్టు అప్పుడ  డు చేతి సైగలతో నటన చేస్తూ అంతా వివరించాడు.

నేను నివ్వెరపోయాను. వీడి సంగతి చూసుకుంటా నన్న మిత్రుడు చివరకు వీడికీ జీవనోపాధి చూపించాడన్నమాట. వింటున్నకొద్దీ నాకు భయం వేసింది కాని వాడి వాలకం, ఉత్సాహం చూసి ఏమీ మాట్లాడలేక మిన్నకుండిపోయాను.

వాడు అలా కాసేపు కూర్చుని, నేను మౌనంగా ఉండటంతో ఏమనుకున్నాడో ఏమో, లేచి "వస్తాను సార్!" అంటూ ఆ బరువైన కూరగాయల సంచి అందుకుని భుజాన తగిలించుకుని గేటు దాటి వెళ్లిపోయాడు.

అసలు జరిగిం దేమిటంటే–

మా మిత్రుడు వీణ్ణి మంచి ఊబిలోనే దింపాడు. ఆదాయానికి ఆదాయమూ, కావలసినంత థ్రిల్లూ, సరదా – అన్నీ ఉన్నాయందులో. వీడికి కబురొస్తుంది. అంటే ఎవరో వచ్చి, "రమ్మంటున్నారు" అని చెప్పి వెళ్లిపోతాడు. వీడు వెళ్లాలి. అక్కడ ఎవరో ఒకరు వీణ్ణి స్కూటర్ మీద ఎక్కించుకుని ఎక్కడికో తీసుకువెళ్లి దింపుతారు. అక్కడ ఎవరో అపరిచితులు వీడికి సంచిలో సీసాలు సర్ది, పైన కూరగాయలు నింపి, బట్టలు నింపి అందజేస్తారు. ఎక్కడెక్కడికి వెళ్లవలసిందీ సవివరంగా చెబుతారు. అన్నీ గుర్తు పెట్టుకుని ఆ అయిదారు చోట్లకూ తిరిగి జాగ్రత్తగా సీసాలు అందజేయాలి. వారికీ, కస్టమర్లకు మధ్య టెలిఫోన్ సంబంధాలుంటాయి. ఇచ్చిపుచ్చుకోడాలు విడిగా జరుగుతాయి. ఎక్కడా ఏ పొరపాటూ జరగదు. సీసాకు పది చొప్పున ముస్తఫాకు ముట్టజెపుతారు. అది కాక, సీసా అందుకున్న ఆసామి అమితానందంతో ఉక్కిరిబిక్కిరై పసివెధవ మీద జాలితో తానూ వాడి కొక పది పారేస్తాడు కదా! అయితే అంతటా గట్టి కట్టడులు మాత్రం ఉన్నాయి. ఎవరైనా నిలదీసి అడిగినా వీడు నోరు జారకూడదు. జారడానికి వీలు లేదు కూడా. ఎందుకంటే వీడికి అవతలి వారి అనుపానులూ, వివరాలూ ఏమీ తెలియవట. కాని వాళ్ల డేగ చూపులు మాత్రం ప్రతిక్షణం వాణ్ణి వెన్నాడుతూనే ఉంటాయి. వాడి ప్రతి కదలికా వారికి తెలుస్తూనే ఉంటుంది.

నా మనసంతా అదోలాగా అయిపోయింది. మధ్యలో నే నేదో పాపం చేసినట్టు అనిపించసాగింది. నిజానికి ఆనాడు ఆ స్నేహితుడు 'వీణ్ణి నా కొదిలెయ్యండి, నేను చూసుకుంటాను' అన్నప్పుడు వాడి బాధలు తీరిపోతాయని అనుకున్నాను కాని, ఇలాంటి వ్యవహారంలో దింపుతాడని అనుకోలేదు. నాలుగు రాళ్లొచ్చే పని చూపిస్తే, పసి వెధవ, పాపం కుదుటపడతాడని అనుకున్నానంతే.

ఇప్పుడిక లాభంలేదు. వాడితో 'మంచి చెడ్డలు' మాట్లాడి ప్రయోజనం లేదు. తేనెలో పడ్డ ఈగలా వాడు ఒక విధమైన నోట్ల మైకంలో పడిపోయిన వైనం తెలుస్తూనే ఉంది.

సాయంకాలం–

ఆరుగంటలు దాటిందేమో, ఎండ వేడిమికి కాగి మాడిపోయిన భూమి నెమ్మదిగా చల్లబడుతున్నది. అంతవరకు భీష్మించుకుని 'కదల'నని కూర్చున్న గాలి మందంగా కదలడం మొదలైంది. హాయిగా స్నానం చేసి పెరట్లో చెట్టుకింద కుర్చీలో కూర్చుని ఉన్నాను.

ఇంతలో "మీకు ఫోను" అంటూ పక్కింటి వారి అబ్బాయి వచ్చాడు. నేను వెళ్లి ఫోను అందుకుని, "హలో! ఎవరది?" అన్నాను.

"నేను మాస్టారూ, నమస్కారం!" అని పరిచితమైన కంఠం.

గుర్తుపట్టాను. పోలీసు ఆఫీసరు శంకరం – మా పాత విద్యార్థి.

"నాతో ఏమి పని పడింది నాయనా?" అన్నాను నవ్వుతూ.

"ఏమీ లేదు. చల్లని వేళ మీ పేరు విన్నాను. ఒక కప్పు కాఫీ తాగిద్దామని..." అన్నాడతను నవ్వుతూ. "దగ్గరే కదా! రండి, ప్లీజ్!" అన్నాడు.

"సరే వస్తున్నాను" అన్నాను.

అయిదు నిమిషాలు నడక. నడుస్తున్నంతసేపూ ఒకటే ఉత్కంఠ. పాత విద్యార్థి అయినా, ఎంత వినయపరుడూ, గురుభక్తి పరాయణుడూ అయినా పోలీసు పోలీసే కదా! అందువల్ల అనవసరమైన ఆత్రుత. మెట్లెక్కుతూ ఉండగా, "రండి సార్! అయ్యగారు మీ కోసం ఎదురుచూస్తున్నారు" అన్నాడొక పోలీసు.

స్ప్రింగ్ డోర్ తెరుచుకుని లోపలికి వెళ్లగానే ముందుగా నా కళ్లకు గోడ పక్కనే ముడుచుకుని కూర్చున్న ముస్తఫా కనిపించాడు. నాకు క్షణంలో అంతా అర్థమైంది.

శంకరం– "రండి రండి మాస్టారూ! బాగున్నారా? కూర్చోండి" అంటూ పలకరించి, "కాఫీ" అనబోతుండగా, వద్దని వారించాను.

ముస్తఫా ముఖంలోకి అప్పుడు కళ వచ్చింది. కళ్లు పెద్దవి చేసుకుని నావంకనే చూస్తున్నాడు జాలిగా.

శంకరం అటు చూపించి, "అదుగో, వేలడంత లేదు, వెధవ! పొద్దుట్నుంచీ ప్రాణాలు కొరుక్కు తింటున్నాడు. నాలుగు గట్టిగా తగలనిద్దామనుకుంటే మనసొప్పలేదు" అంటూ కాగితాలలోకి చూస్తూ, "పేరు ముస్తఫా. తండ్రి ఖుద్దుస్ - రోగిష్టిమారివాడు. తల్లి మెహతాబ్. ఇద్దరు చెల్లెళ్లు – చిన్న పిల్లలు. ఇవాళ మా కళ్లల్లో పడ్డాడు" అని ఆగాడు.

"వీడింతకుముందు ఒక బ్రాందీ షాపులో పనిచేసేవాడు. షాపు మూతపడిపోగానే ఎవరో పట్టుకున్నారు వీణ్ణి. బాటిల్స్ హోమ్ డెలివరీ సర్వీసన్నమాట. తనకేమీ తెలియదంటున్నాడు. జేబుల్లో వెతికితే నలభై రూపాయలు కనిపించాయి. డబ్బు వ్యవహారాలు తనకు తెలియవంటాడు. సంచిలో కూరలు తప్ప ఇవాళేమీ లేవు. బహుశా ఇవాళ్టికి పని పూర్తిచేసుకుని ఉంటాడు. ఎన్ని సీసాలు ఎక్కడెక్కడ ఇచ్చావురా అంటే తెలియదని ముందు బుకాయించాడు. తర్వాత

ఏడుస్తున్నాడు. ఇందాకనే ఓర్పు నశించి కేవలం రెండుమాత్రం తగలనిచ్చాను. అప్పటికీ లాభం లేకపోయింది. అప్పుడు మరొకటి తగిలించబోతుంటే మీ పేరు బయటికి వచ్చింది.

'మాస్టారికి బాటిల్ ఇచ్చావా?' అని గద్దించి మరోటి తగలనిచ్చాను. అప్పుడు మీరు వాణ్ణి ఎరుగుదురని చెప్పాడు. ఈ నస కేసు ఎంతసేపని భరించగలను? అందుకే మీకు శ్రమ ఇచ్చాను."

నా మనసంతా వికలమైంది. ముస్తఫా వంక చూశాను. ఇప్పుడు వాడు మళ్లీ ఏడుస్తున్నాడు.

శంకరం వాణ్ణి కసురుకుంటూ, "నోర్మూయ్! బాడ్ఖవ్! ఏడిస్తే వీపు చిట్లగొడతాను!" అని అరిచాడు.

బయట పొద్దుగూకుతున్నది. ఆవరణలో నిద్ర గన్నేరు నిద్రపోతున్నది.

నేను నెమ్మదిగా మాట్లాడాను.

"షాపు మూతబడి ఆ వచ్చే కాసిని పైసలూ రాక, తండ్రి కొట్టి వెళ్లగొడితే ఆనాడెప్పుడో వచ్చాడు నా దగ్గరికి. మంచి వెధవే. తన సోదంతా వెళ్లబోసుకున్నాడు. అయితే అప్పుడు నాతో ఉన్న ఒక స్నేహితుడు వీడి కథ విని దయతలచినవాడిలా 'నా కొదిలేయండి, నేను చూసుకుంటాను' అన్నాడు. ఏదో పని ఇప్పించి ఉద్ధరిస్తాడనుకున్నానంతే! ఇలాటి రొచ్చులోకి దింపుతాడని అనుకోలేదు."

శంకరం చేతి వేళ్లు విరుచుకుంటూ, "సరే" అని ముస్తఫా వైపు తిరిగి, "లే వెధవా! వెళ్లు! వెళ్లిపో! మళ్లీ కనిపించావా నా చేతిలో చచ్చావే!" అని అరిచాడు.

ముస్తఫా గడగడలాడుతూ లేచి నిలబడగానే, మళ్లీ గొంతు తగ్గించి–"వెధవా! మంచిగా బతకరా! ఏదో ఒక కష్టం చేసుకుని బతుకు! కష్టపడి బతకడంలో ఉందిరా ఆనందం, సుఖం! కష్టపడి సంపాదించిన అన్నమే అమృతంరా!" అని ఇంకా ఇలాంటి మాటలు చాలా చెప్పాడు. వాడి డబ్బు వాడికిచ్చాడు.

ముస్తఫా మహాబుద్ధిమంతుడిలా తల వంచుకుని, ఇంకా వెక్కుతూనే అన్నీ విన్నాడు. ఆ తర్వాత అతి వినయంగా అతనికీ, ఆ తర్వాత నాకూ నమస్కరించి మోచేతులతో కళ్లు తుడుచుకుంటూ వెళ్లి తన కూరగాయల సంచి భుజాన తగిలించుకుని బయటకు వెళ్లిపోయాడు.

అంతలో కాఫీ వచ్చింది. "ఈవేళప్పుడు కాఫీ ఎందుకయ్యా?" అంటూనే కప్పు అందుకున్నాను.

మన దేశం తన చిన్నప్పటికీ, ఇప్పటికీ ఎంతగా పాడైపోయిందో చాలా ఆవేదనతో చెప్పుకుపోతున్నాడు శంకరం.

మన దేశం నా చిన్నప్పటికీ, ఇప్పటికీ మరెంతగా పాడైపోయిందో మరింత ఆవేదనతో, ఆవేశంతో నేనూ ఉపన్యసించాను.

తర్వాత లేచి, "వస్తా న్నాయనా!" అని ఇవతలికి వచ్చాను.

"అప్పుడప్పుడూ వస్తూంటదండి!" అన్నాడు శంకరం.

రోడ్డు చివరివరకూ మందంగా వెలుగు చీకట్లు పరుచుకుని ఉన్నాయి. వీథి దీపాలు కరెంటు కోతవల్ల నిద్రపోతున్నాయి.

నేను నడుస్తున్నాను. వీధి చివర చీకట్లో నుంచి లేచి వచ్చాడు ముస్తాఫా. నవ్వుతూనే ఉన్నట్టున్నాడు.

"మజ్జానం నుంచీ కూచోబెట్టారు సార్! తిట్లు తినలేక సచ్చాను. రెండు దెబ్బలూ పడ్డాయనుకోండి. కాని పాపం గట్టిగా కొట్టలేదులెండి" అన్నాడు.

నే నేమీ మాట్లాడలేదు.

వాడు నా వెనకనే వస్తూ, "పోలీసు అయ్యగారు కష్టపడి బతకమని చెప్పారుగా సార్? కష్టపడి బతికేవాడే మడిసి అన్నారు కదా సార్! నే నెంత కష్టపడుతున్నానో చెప్పండి సార్! రోజుకు ఎంత దూరం నడుస్తానో తెలుసా, సార్! ఊరి ఆ కొసన ఒకటి, ఈ కొసన ఒకటి వన్‌టౌన్లో ఎక్కడో మూల ఇంకోటి. నిన్ననైతే ఒక్క కేసు కోసం ఏకంగా ఆరు మైళ్లు నడిచాను సార్! ఎండగాలిలో... నాది కష్టం కాదా సార్! మీరే చెప్పండి సార్!" అంటున్నాడు.

నేను నడకలో వేగం హెచ్చించాను.

వాడు ఆగి, వెనక నుంచి, "వస్తాను సార్! దయ ఉంచండి! ఇంటికాడ మా అమ్మ ఎదురుచూస్తా ఉంటది!" అనడం వినిపించింది.

నేను వెలుతురు లేని రోడ్డు మీద నడుస్తున్నాను.

# భ్రమ

"నాన్నా! నీలవేణీ అంటీ నిన్ను రమ్మంటున్నది!" అన్నాడు మావాడు రొప్పుతూ లోపలికి వస్తూ.

"ఎక్కడ? ఎక్కడుంది ఆంటీ?" అని అడిగాను నేను చదువుతున్న పేపరు పక్కన పడేసి.

"బయట... స్కూటర్ మీదనే ఉంది. దిగనైనాలేదు. లోపలికి రమ్మంటే రానంటున్నది!"

నేను గాబరాగా లేచి వాకిట్లోకి వచ్చాను.

స్కూటీ ఇంజను అప్పుడు ఆపింది నీలవేణి. మహా కోపంగా ఉన్నట్టు కనిపించింది.

"ఏమిటి? లోపలికెందుకు రావు?" అని అడిగాను.

"ఇప్పుడు టైమ్ లేదు. అర్జంటుగా వెళ్తున్నాను. ఒక్కమాట చెప్పిపోదామని ఆగాను. మీ ఫ్రెండు... అదే మీ మహా రచయితగాడు. వాణ్ణి గురించి!"

"ఏమిటది? ఏమైంది?" అన్నాను నేను ఆదుర్దాగా.

"ఏముందీ? మామూలే... పిచ్చిచూపులు చూస్తున్నాడు. అసలు నన్ను చూసిన మొదటిలోనే అదేమిటోగా ప్రవర్తించాడు. వినబడకుండా ఏదో వాగాడు కూడా. వాడు డెప్యూటీ మేనేజర్, నేను క్లర్కును అయితే కావచ్చు. కానీ వెర్రిచూపులు చూస్తే వెర్రివేషాలు వేస్తే మాత్రం ఊరుకోను. తెలుసుగా నా సంగతి. మరోసారి ఏదైనా జరిగిందో మొహం పచ్చడి పచ్చడి అయిపోతుందని తెలుసుకోమను. నువ్వు వాడికి గొప్ప ఫానువు కదా? అందుకని నీకు ముందుగా చెబుతున్నాను. కాస్త కాఫీ ఇచ్చి ఒళ్లు దగ్గర పెట్టుకుని బతకమని చెప్పు. తర్వాత్తర్వాత విచారించీ లాభం ఉండదని కూడా చెప్పు. నేను వెళ్తాను. మళ్లీ రేపు కలుస్తాను. వదినకు చెప్పు. రేపు వస్తానని..."

ఇంత మాట్లాడి బండి స్టార్టు చేసి అంత వేగంగానూ, విసురుగానూ దూసుకుపోయింది.

"అమ్మబాబోయ్!" అనుకుంటూ మొహం తుడుచుకుంటూ ఇంట్లోకి వచ్చాను.

మా ఆవిడ గుమ్మం అవతల నడుమ్మీద చెయ్యి వేసుకుని నవ్వుతూ నిలబడి ఉంది.

"ఏమంటున్నది మీ ఫెమినిస్టు చెల్లెమ్మ? ఎవరినో దులిపిపారేస్తున్నట్టుందే! ఏమిటి కథ?" అని అడిగింది.

నేను కూర్చున్నాను. వెంటనే ఏమీ మాట్లాడలేదు.

నీలవేణి నెలరోజుల కిందటే ఇక్కడికి బదిలీ అయి వచ్చింది. నాకు వరసకు చెల్లెలవుతుంది. మా బాబాయిగారి కూతురు. ఒక్కగానొక్క గారాలపట్టి. ఏదో పెద్ద ప్రైవేట్ కంపెనీలో ఉద్యోగం. పుట్టింది ఇక్కడే అయినా పెరిగింది నార్త్‌లో - నాగపూర్‌లో. మా బాబాయి అక్కడ రైల్వేలో పెద్ద ఆఫీసరు. నీలవేణి కాక ఆయనకు మరో కొడుకు. వాడింకా ఏదో చదువుకుంటున్నాడు. ఈమెగారు పోస్టు గ్రాడ్యుయేషన్ పూర్తి చేసి ఉద్యోగంలో చేరింది. వీర ఫెమినిస్టు... కరాటే ఫైటర్. 'పెళ్లీపెటాకులు' వంటి మాటలు బొత్తిగా సరిపడవు. ఇంగ్లీషు పత్రికలలో అడపాదడపా ఫెమినిస్టు వ్యాసాలు కాక కొద్దిగా ఇంగ్లీషు కవిత్వం కూడా రాస్తూ ఉంటుంది. చిన్నప్పుడే టెన్త్ చదువుతున్నప్పుడే ఒకప్పుడెవడో వెంటపడి ఏదో వాగాడని షూ హీల్‌తో మెరుపు వేగంతో వాడి మొహం పచ్చడి చేసింది. ఏ విషయం మీద సంభాషణ మొదలుపెట్టినా క్షణాలలోనే ముందు భారత స్త్రీల (దు)స్థితిగతుల గురించీ, వారిలో అణువణువునా వ్యాపించి ఉన్న బానిస మనస్తత్వాన్ని గురించీ, స్త్రీకి స్త్రీయే శత్రువు అనే విషయం గురించీ, ఆపైన పురుషాధిపత్యం గురించీ, పురుషాహంకారం గురించీ, తరతరాలుగా భారత స్త్రీకి జరిగిన, జరుగుతున్న దారుణ అన్యాయాన్ని గురించీ గుక్కతిప్పుకోకుండా, ఎదుటివారిని గుక్కతిప్పుకోనివ్వకుండా గరంగరంగా అమితోద్రేకంతో గలగలా మాట్లాడేస్తుంది. చివరకు 'ఇంకానా? ఇకపై సాగదు!' వంటి స్లోగన్‌తో ముక్తాయింపు ఇస్తుంది. వింటూ ఉంటే నాకు మహా ముచ్చటగా ఉంటుంది.

మా ఆవిడకు నా మౌనం నచ్చలేదు.

"సంగతేమిటని అడిగితే బెల్లంకొట్టిన రాయిలా బదులు పలకరేం?" అన్నది పెద్దగా.

నేను ఇహంలోకి వచ్చి, "ఆс, చెల్లెమ్మే మాట్లాడింది!" అన్నాను.

"అదే, నే అడుగుతున్నది. "ఏం మాట్లాడిందీ?" అని... అయినా ఆ విసురు, ఆ వాలకం చూస్తే మామూలు మాట్లాడటంలాగా లేదు. ఎవరినో దులిపి ఆరేస్తున్నట్టున్నది మరి...!"

"అవును, రంగనాయకులుగారు లేడూ... వాళ్ల కంపెనీలో డిప్యూటీ మేనేజరు... రచయిత... ఆయన్ను గురించి!"

"ఆయన్ను గురించా? మనింటికొస్తూ ఉంటాడు అప్పుడప్పుడూ... చాలా పెద్దమనిషే... మర్యాదస్తుడూను... ఆయనమీద కారాలు మిరియాలు నూరడమెందుకు ఈమెగారు?"

"అదే చిత్రంగా ఉంది. నాకేమీ అర్థం కావడంలేదు. ఆయన తనను చూసి వెర్రి వేషాలు వేస్తున్నాడంటుంది!" "ఏమీ వివరించి చెప్పలేదనుకో, అయినా వెర్రివేషాలంటే అదోలాగచూడటమూ, అదోలాగ మాట్లాడటమూ, కావాలని

తాకడమూ, ఏ కాయితాలందుకునేటప్పుడో ఇచ్చేటప్పుడో వేళ్లు తగిలించడమూ ఇలాంటివి కావచ్చు. కాకపోతే పిచ్చిరాతలతో కూడిన ప్రేమలేఖలు రాయడం కావచ్చు. ఇంకేమైనా కావచ్చు...!"

"ఇప్పుడేమంటుందీవిడ?"

"నేను రంగనాయకులుగారికి వార్నింగ్ ఇవ్వాలిట. ముందు ముందు ఏమైనా జరిగితే బొత్తిగా బాగుండదని హెచ్చరించమన్నది!"

"మొహం... పచ్చడి... అంటూ ఏదో వినిపించిందే నాకు!" అని నవ్వింది మా ఆవిడ.

"నువ్వు నోరుమూసుకుందూ! అసలే ఇలాటి గొడవలో ఇరుక్కున్నానే అని నేను బెంగపడుతూ ఉంటే మధ్యలో నువ్వు హాస్యరసం పిండుతావేమిటి?"

మా ఆవిడ మళ్లీ గలగల నవ్వింది.

"హాస్యరసం పుష్కలంగా పండే సన్నివేశమే ఇది. చూడాలి మరి.. మీరెలా నెగ్గుకొస్తారో!"

నీలవేణితో ఇబ్బందే. ఆ తీవ్రత చూస్తుంటే భయం వేస్తున్నది నాకు. పోనీ రంగనాయకులుగారితో మాట్లాడదామంటే ఎలా మాట్లాడాలో తెలియడంలేదు. చాలా సున్నితమైన విషయం ఇది. అసలు మాట్లాడకుండా దాటవేద్దామంటేనూ కష్టమే. ఏ క్షణంలోనైనా ఏ ప్రమాదమైనా జరిగిపోవచ్చు. అందువల్ల ఆయనతో మాట్లాడటమే మంచిది. ఏదో విధంగా జాగ్రత్తగా ప్రసంగం తెచ్చి ఆయనకు పరిస్థితి తీవ్రతను తెలియజేయడమే మంచిది. నీలవేణి నాకు చెల్లెలని ఆయనకు ముందే తెలుసు. ఆమెను గురించి కొన్ని వివరాలు మాత్రం చెబితే విషయం ఆయన గ్రహించగలడు. చిన్నప్పటినుంచీ దాని భావాలు వేరనీ, తీవ్రస్వభావి అనీ, తొందరపాటు కొంచెం ఎక్కువ అనీ ఇలా మొదలుపెట్టి నాలుగు మాటలు మాట్లాడితే ఆయనకే తెలిసివస్తుంది. తర్వాత కొంచెం కాషస్‌గా ఉంటాడు. లోపల ఏవైనా అనారోగ్యకరమైన ఆలోచనలు ఉన్నా, తొందరపడకుండా జాగ్రత్తగా ఉంటాడు. భార్యపోయి నాలుగేళ్లు కావస్తున్నా మళ్లీ పెళ్లి ఊసెత్తకుండా కేవలం ఉద్యోగంతో, రచనా వ్యాసంగంతో, సాహిత్య పఠనంతోనే కాలం గడుపుతూ వస్తున్నాడు. నలుగురిలో మంచివాడుగా పెద్ద మనిషిగా గుర్తింపుపొందిన మనిషి, ఆ మాత్రం అర్థం చేసుకుని తన జాగ్రత్తలో తాను ఉండకపోతాడా?

ఆనాడు సాయంకాలం నేను బయటికి వెళ్లేందుకు తయారై బయలుదేరబోతూ ఉండగా ఆశ్చర్యకరంగా ఆయనే మా ఇంటికి వచ్చాడు – "హలో! ఎలా ఉన్నారు!" అని పలకరిస్తూ.

మనిషి ఆజానుబాహువు. పచ్చని శరీరఛాయ. గుండ్రని ముఖం, పలుచని అద్దాలు... నిరంతరం మెరిసే చిరునవ్వు.

"మీరా! రండి, రండి!" అన్నాను కుర్చీ జరుపుతూ.

ఆయన కూర్చుని కళ్లజోడు తీసి రుమాలుతో ముఖం తుడుచుకుని మళ్లీ కళ్లజోడు పెట్టుకున్నాడు.

"ఇవాళ ఆఫీసుకు సెలవు పెట్టాను. చిన్న చిన్న పనులుండిపోయాయి. మీరు గుర్తొచ్చారు!" అన్నాడు.

నేను లోపల్లోపల కంగారు పడుతూనే ఉన్నాను. కళ్లముందు నీలవేణి ఆకృతి మెదులుతున్నది. పకడ్బందీగా కరాటే నేర్చిన పిల్ల. అయిదారు ఇటుకలను వరుసగా పేర్చి ఒక్క చేతివేటుతో బద్దలుచేయగల హస్తబలం ఆమెది. ఈయనేమో నాజూగ్గా ఉన్నాడు.

ఆయన కుర్చీలో ఎందుకో అసహనంగా కదులుతున్నాడు. ఏదో చెప్పాలనీ, లేక ఏదో అడగాలనీ ప్రయత్నిస్తున్నాడు.

నా కళ్లముందు అంతలో ఒక భయానక దృశ్యం.

ఆయన అందమైన ముఖం బద్దలు బద్దలై రక్తసిక్తమై ఎర్రటి మాంసపు ముద్దలాగున....

ఒక్కసారిగా ఉలిక్కిపడ్డాను.

ఆయన "ఏమండీ! మిమ్మల్నే...! ఏ లోకంలో ఉన్నారు?" అంటున్నాడు.

నేను ప్రస్తుతంలోకి వచ్చి, "మీకు టీ తెప్పిస్తాను!" అంటూ లేచాను.

"ఇప్పుడేమీ వద్దు, ఉండండి!" అంటున్నా వినిపించుకోకుండా పెద్ద పెద్ద అంగలతో లోపలికి వెళ్లాను. 'ఇవాళ డ్యూటీ లేకుండా ఇట్లా ఇంట్లో ఎందుకుంచావురా పాపిష్టి దేవుడా!' అనుకుంటున్నాను.

మా ఆవిడ అంతకుముందే ముందు గదిలోకి వచ్చి, తొంగి చూసి వెళ్లినట్టు ఉంది. టీ సిద్ధం చేసి కప్పుల్లో పోస్తూ నెమ్మదిగా "ఆ శాల్తీయేనా?" అని అడిగింది.

"అవును" అన్నాను.

"పాపం!" అన్నది అదో రకంగా నవ్వుతూ.

"ఏం రాసిపెట్టి ఉందో ఆయన మొహాన...!" అని కూడా అన్నది కప్పు అందిస్తూ.

నేను ముందు గదిలోకి వెళ్లి ఆయనకు టీ అందించాను.

ఆయన "ఇప్పుడిదంతా ఎందుకండీ?" అంటూనే అందుకున్నాడు.

ఆ తర్వాత ఇద్దరం నిశ్శబ్దంగా టీ సేవించాము.

కప్పు కుర్చీ పక్కన నేలమీద ఉంచి, ఆయన చేతి వేళ్లు విరుచుకున్నాడు. తర్వాత అరచేత్తో నుదురు తుడుచుకున్నాడు.

ఒక్కసారి దగ్గి, "నీలవేణి... అదే... మా ఆఫీసులో పనిచేసే అమ్మాయి, మీ సిస్టర్ కదూ!" అన్నాడు.

"అవును, మా పినతండ్రిగారి అమ్మాయి. నాగపూర్‌లో చదువుకుంది. చాలా స్పీడ్ మనిషి. కరాటే ఛాంపియన్... అయిదారు ఇటుకలను ఒక్క దెబ్బతో ముక్కలు

చేసేస్తుంది. అన్యాయం సహించదు. ఒకప్పుడు ఎవడో ఏదో అన్నాడని వాణ్ణి చావగొట్టింది!" అనేశాను గబగబా.

"చాల మంచిపిల్ల!" అన్నాడాయన. ఆ తర్వాత మళ్లీ చేతి వేళ్లు విరుచుకుని, "ఒక చిన్న రిక్వెస్టు!" అన్నాడు.

"చెప్పండి!" అన్నాను అనుమానిస్తూనే.

"ఏం లేదు, రేపు ఆదివారం కదా! మధ్యాహ్నంపూట ఒక్కసారి మా ఇంటికి రావాలి మీరు!"

"దానికేం? అట్లానే వస్తాను!" అన్నాను.

"మీరొక్కరే కాదు, మీ చెల్లెమ్మను కూడా తీసుకురావాలి!"

నేను ఖంగుతిన్నాను.

నీళ్లు నములుతూ, "ఏమో... నీల ఏమంటుందో, ఏమో!" అంటున్నాను.

"చెప్పి చూడండి, ఎంతయినా బాస్‌ను కదా! కాదనదులెండి. మా ఇంట్లో పనిమనిషి, వంటమనిషి తప్ప ఎవరూ ఉండరు. నేను ఆఫీసూ, ఇల్లు తప్ప మరేమీ ఎరగను. పుస్తకాలే స్నేహితులు. మా ఆవిడ పోయినప్పటినుంచి ఒంటరి బతుకయిపోయింది. నీలవేణిని చూశా..." అంటూ అకస్మాత్తుగా ఆగిపోయాడు. కళ్లు చెమర్చాయి.

తర్వాత లేచి, "వెళ్లొస్తాను. మీ కోసం ఎదురు చూస్తూ ఉంటాను. తప్పక రండి!" అంటూ గబగబ నడుచుకుంటూ వరండా దాటి మెట్లు దిగి వెళ్లిపోయాడు.

"సరే, తప్పేదేముంది?" అనుకుంటూ లేచి వెళ్లి షర్టు తొడుక్కుని, లుంగీతోనే వీధి చివర ఉన్న టెలిఫోన్ బూతుకు వెళ్లి నీలవేణి ఆఫీసుకు ఫోన్ చేశాను. రిసెప్షనిస్టుతో "నీలవేణిగారితో మాట్లాడాలి. వాళ్ల అన్నయ్యనని చెప్పండి!" అన్నాను.

"హలో!" అన్నది నీలవేణి.

"అమ్మాయీ! నేను..."

"చెప్పు, అన్నయ్యా! ఏమిటి సంగతి? ఇవాళ మీ రచయిత ఫ్రెండుగారు సెలవుమీద ఉన్నాడు!" అన్నది.

"అదే చెబుతున్నాను. ఆయన మా ఇంటికి వచ్చాడు."

"వొచ్చి?"

"వొచ్చి... కాసేపు కూర్చున్నాడు."

"కూర్చుని....?"

"నేనిచ్చిన టీ తాగాడు."

"తాగి?"

"రేపు ఆదివారం కదా! మధ్యాహ్నం వాళ్ల ఇంటికి ఆహ్వానించాడు."

"అంతేనా? అయితే వెళ్లు!"

"అంతేనా కాదు. నే ఒక్కణ్ణే కాదుట. నువ్వు కూడా రావాలిట!"

"ఆఁ! అలాగా? ఇంకేమన్నాడు?"

నేను కొంచెం సంకోచిస్తూ, "ఇంకా ఏమన్నాడంటే... నువ్వు చాలా మంచిపిల్లవని అన్నాడు!"

"అలా అన్నాడా?" అన్నది ఆశ్చర్యంగా.

ఒక్కక్షణం ఆగి, "సరే, వెళ్దాం!" అని ఫోన్ పెట్టేసింది.

మరునాడు మధ్యాహ్నం సిద్ధమై కూర్చుని ఉండగా వచ్చింది హడావుడిగా "పోదాం, పద!" అంటూ.

ఆమె వెనక స్కూటీ మీద కూర్చున్నాను. మహా స్పీడుగా బండి నడిపింది. ఏదో మాట్లాడుతూనే ఉంది. కానీ గాలి విసురుకు కాస్త కాస్త తప్ప ఏమీ వినిపించలేదు నాకు.

ఆ ఇల్లు చిన్నదే అయినా చాలా ముచ్చటగా, అందంగా ఉంటుంది. ముందు ఖాళీస్థలం. పూలమొక్కలు... లోపల ముందు గదిలో చుట్టూ అద్దాల బీరువాలలో పుస్తకాలే పుస్తకాలు... గది అంతటా సాహిత్య వాసన...

పనిమనిషి కాబోలు యాభై ఏళ్లు పైబడిన ఒకావిడ మమ్మల్ని కూర్చోబెట్టింది. "అయ్యగారు వస్తారిప్పుడే...!" అని లోపలికి వెళ్లింది.

నీలవేణి మాత్రం కూర్చోకుండా చుట్టూ తిరుగుతూ పుస్తకాలు చూస్తున్నది.

నేను సోఫాలో కూలబడి ఎదురుగా టీపాయ్‌మీద ఉన్న ఒకే ఒక్క ఫోటో ఆల్బం చేతిలోకి తీసుకుని, "ఇదొక్కటీ ఎందుకుంది ఇక్కడ?" అనుకుంటూనే తెరిచాను. క్రమంగా నా కళ్లు పెద్దవైనాయి. పేజీలు తిప్పుతున్నకొద్దీ ఆశ్చర్యంతో కొయ్యబారిపోయాను.

"ఆ చిన్న అరలో ఉన్నవన్నీ ఆయనగారి రచనల్లాగున్నాయే!" అంటూ నీలవేణి వచ్చి కూర్చుంది.

నేను ఆల్బం అందించి, "చూడు!" అన్నాను.

ఫొటోలు చూడటం ఆరంభించి ఆమె నివ్వెరపోయింది. అన్నీ నీలవేణి ఫొటోలే... ఏ భంగిమలో చూసినా నీలవేణి.... లేశమైనా తేడా లేకుండా అంతటా నీలవేణి...

లోపలి నుంచి ట్రేలో డ్రింకులు తెచ్చి టీపాయ్‌మీద ఉంచి, "తీసుకోండి!" అన్నదావిడ.

అంతలో రంగనాయకులుగారు బయటినుంచి లోపలికి వచ్చాడు.

"అరె, వచ్చేశారా? నేను ఫోన్ చేసి వద్దామని వెళ్లాను!" అన్నాడు.

నేను "ఈ ఫోటోలు..." అంటున్నాను.

"మీరు చూస్తారనే ఉంచానక్కడ!" అన్నాడు. ఆయన కళ్లు చెమర్చాయి.

"మా అమ్మాయి... పేరు పూజ!" అన్నాడు క్లుప్తంగా. ఆ తర్వాత, "ఇప్పుడే వస్తాను. ఆ డ్రింకు తీసుకోండి!" అంటూ లోపలికి వెళ్లాడు.

నీలవేణి వంక చూశాను. ఆమె నిట్టూర్చింది. "పాపం, ఎప్పుడు పోయిందో!" అన్నది మెల్లగా.

నేను మొదలుపెట్టాను. "నిన్ను చూస్తే చచ్చిపోయిన కుమార్తె గుర్తొచ్చి ఉంటుంది. అందుకే అలా చూశాడు. అలా మాట్లాడాడు నువ్వేమో ఆయన్ను అపార్థం చేసుకుని మొహమూ... పచ్చడీ... అంటూ చిర్రుబుర్రులాడావు."

ఆయన దుస్తులు మార్చుకుని వచ్చి మా ముందు కూర్చున్నాడు.

నేను కాస్త ఇబ్బంది పడుతూనే – "చూశారూ! ఈ ఫోటోల్లో ఉన్న మీ అమ్మాయి అచ్చం మా నీలవేణిలాగా ఉంది ఎలా చూసినా! అందువల్ల నీలవేణిని చూడగానే మీ అమ్మాయే గుర్తుకు వచ్చి ఉంటుంది మీకు!" అంటున్నాను.

ఆయన కళ్లార్పకుండా మా వంకనే చూస్తున్నాడు.

"ఇంతకీ ఎన్నాళ్లయింది మీ అమ్మాయి చనిపోయి?" అని అడిగాను.

"అదేమిటి? మా అమ్మాయి పోవడమేమిటి? కెనడాలో నిక్షేపంగా మొగుడితోపాటు మెడిసిన్ ప్రాక్టీస్ చేస్తున్నది... ఫోనులో మాట్లాడి వస్తున్నానిప్పుడే... అచ్చం నీలాంటి అమ్మాయే మా ఆఫీసులో పనిచేస్తున్నదని చెప్పి వస్తున్నాను!" అన్నాడాయన గొంతు పెంచి...

# ద్రణేవుడు

సమాచార విస్ఫోటనం అనీ, పోటీ అనీ అనేక నామధేయాలతో ఆధునిక యుగం విషయ పరిజ్ఞానం ప్రధానలక్షణంగా శోభిల్లుతున్నది. ఎవడికి ఎక్కువ వివరాలు తెలుసునో వాడు జ్ఞానికింద లెక్క. రకరకాల టెస్టులు, క్విజ్‌లు, కెబిసిలు ఇవన్నీ యువతరం సమాచార సేకరణ సామర్థ్యాన్ని గురించే. నాలుగు పేపర్లు తిరగేసినవాడు సాయంకాలం నలుగురి ముందు నాలుగు విషయాలు ఉగ్గడిస్తే వాణ్ణి జ్ఞాని అనేస్తారు. మనసును అత్యవసర పరిజ్ఞానంతో కాక, అత్యవసర విషయ పరిజ్ఞానంతో కూడా నింపడం, అట్లా కొందరి కంటే కొన్ని ఎక్కువ విషయాలు తెలిసి జ్ఞాపకముంచుకున్న వాణ్ణి బిరుదులతో గౌరవించడం జరుగుతున్నది. వాడెవడో అంత బతుకూ బతికి ఇంగువంటే ఏమిటో తెలుసుకోకుండా, తెలుసుకునే అవకాశం లేకుండానే దాటిపోయాడట.

ఇక ఈ మనిషి మరో విచిత్రం.

రైల్లో తారసపడ్డాడు.

"నిన్నేనయ్యా అడుగుతున్నది?" అన్నాడాయన రెండోసారి పెద్దగా.

అంతకుముందు వేరొక రైలు దడదడ మని శబ్దం చేస్తూ వెళ్తుంటే ఈయన అన్నదేమీ నాకు వినిపించలేదు.

ఇప్పుడు "ఏమిటి?" అని అడిగాను.

ఆయనకు అరవై ఏళ్లు దాటే వుంటాయి. జుట్టు బాగా తెల్లబడి చెంపలు పెరిగి వున్నాయి.

"చూడు! నువ్వు చాలా చదివి వుంటావు కదా. ద్రణేవుడు అనే పేరు, పాత్ర ఎక్కడైనా తగిలిందా? పురాణాల్లో కాని కథల్లో కాని... ఎక్కడైనా..."

నేను లేదంటూ తల అడ్డంగా వూపాను.

"అలాగా?" అన్నాడాయన నిరాశగా.

తర్వాత తన ఎదురుగా కిటికీ పక్కన కూర్చుని ఏదో చదువుకుంటున్న నడివయసు వ్యక్తిని కూడా ఇదే ప్రశ్న అడిగి అతడు లేదనగానే హతాశుడై నిట్టూర్చి నిశ్శబ్దంగా కూర్చుండిపోయాడు.

రైలెక్కినప్పటినుంచి చూస్తున్నాను... ఈ మనిషి వాలకం చిత్రంగా వుంది. ఒక పొడుగాటి లావాటి పుస్తకం వొళ్లో పెట్టుకుని వుండి వుండి అందులో ఏదో రాస్తున్నాడు. రైలు ఆగిన ప్రతి స్టేషను పేరు ఇంగ్లీషు తెలుగు రెండు భాషల్లోనూ వరసగా రాసిపెట్టుకుంటున్నాడు.

కాసేపాగి మళ్లీ "అంతా బాగానే వుంది. ఈ ద్రణేవుడెవరో ఎక్కడివాడో వివరాలే మాత్రం తెలిసి చావడం లేదు. ఎందరినో అడిగాను. ఎవ్వరూ చెప్ప లేకపోతున్నారు. ఆ వివరం ఎప్పటికైనా తెలుస్తుందో లేదో...." అన్నాడు.

"ఎప్పుడో ఒకప్పుడు తెలియకపోదులెండి. ఎవరో ఒకరు చెప్పకపోరు" అన్నాను ఏమీ తోచనివాడిలా.

"పదేళ్ళ నుంచి తెలియని విషయం ఎప్పుడు తెలుస్తుందో... అసలు తెలియనే తెలియదో" అంటూ నిట్టూర్చాడు.

నేను చాలా సేపటినుంచి మధనపడుతున్నాను. 'ఈ మనిషి ఎవరా?' అని మనసు లోపలి పొరలలో ఎక్కడో ఒక మూల ఈ వ్యక్తి వివరాలు భద్రంగానే వున్నాయి. అయితే స్పష్టంగా ఉపరితలానికి రావడంలేదు.

"ఇలా రైల్వే స్టేషన్ల పేర్లూ ఇంకా ఏవేవో విషయాలు రాస్తున్నారు కదా ఈ పుస్తకంలో... ఎందుకీ వివరాలన్నీ?" అని అడిగాను.

ఆయన కళ్ళలో మెరుపు. "ఎందుకేవిటి? ఇదంతా నాలెడ్జి... ఇన్ఫర్మేషన్... ముందు తరాలవారికి అందించాల్సిన బాధ్యత మనదే కదా. మన తాత ముత్తాతలు 'తమకెందుకులెమ్మ'ని ఊరుకుని వుంటే మనకివ్వాళ ఇంత ఇన్ఫర్మేషన్ దొరికేదా? ఇన్ని విషయాలు తెలిసేవా? సమాచారం, విషయ పరిజ్ఞానం వుంటేనే మనిషి మనిషవుతాడు. లేకపోతే మా ఫ్రెండులాగా అతి చిన్న విషయంకూడా తెలియకుండా చచ్చిపోతాడు. పదేళ్లకిందట మావాడొకడు ఇంగువ అంటే ఏమిటో తెలియకుండానే చచ్చిపోయాడు. అప్పటినుంచి నేను ఇట్లా విసుగనేది లేకుండా విషయ సేకరణ చేస్తున్నాను. అదీ యిదీ అని ఏమీ లేదు. చూసినదీ విన్నదీ అంతా రికార్డు చేసిపెట్టడమే"

ఇప్పుడు నా మనసులో మెరుపు మెరిసినట్టయింది. చాలా ఏళ్ల క్రిందట సంగతి... మా యింటి పక్కన నడివయసు దాటిన ఒక వ్యక్తి గుండెజబ్బుతో బాధపడి రెండు మూడు రోజులు అపస్మారక స్థితిలో వుండి చివరకు పోయాడు. అప్పుడీయన అక్కడికి వచ్చాడు. మనిషి పోగానే హతాశుడై వెను వెంటనే తిరిగి వెళ్లిపోయాడు. ఇప్పుడు సరిగ్గా చూస్తుంటే పోలికలు బైటపడటం మొదలై ఆ వ్యక్తి ఇతడే అని నిర్ధారించుకున్నాను. ఇప్పుడు ఇన్నేళ్ళ తర్వాత రైల్లో తారసపడ్డాడు చేతిలో పొడవాటి పుస్తకంతో.

ఆయన మళ్లీ నా వైపు తిరిగి "ఈ ద్రణేవుడనేవాడు ఎవడో నాకు తెలియదు. ఎప్పటివాడో ఎక్కడివాడో తెలియదు. ఎందరినో అడిగాను. ఎవరూ చెప్పలేకపోయారు" అన్నాడు దిగులుగా.

"అసలా పేరుగలవాడు ఎవరూ లేరేమో" అన్నాను నేను.

"కాదు... వుండే వుంటాడు. మనకు తెలియనంత - మాత్రంలో లేడని నిర్ణయిస్తే ఎలా? తెలుసుకోవాలి. దానికి వేరే మంత్రం ఏమీ లేదు. కనబడిన వారినల్లా అడుగుతూ పోవడమే"

ఈ ధోరణి ఇంకా కొనసాగేదేమో గాని దిగవలసిన స్టేషను సమీపించడం వల్ల నేను హడావిడిగా లేచి పైనున్న సంచి అందుకుని దిగేందుకు ఉద్యుక్తుణ్ణయినాను. అంతలో ఆయన కూడా లేచి పెన్ను ముడిచి జేబులో వుంచుకుని పుస్తకం మూసి, చంకలో పెట్టుకుని రైలు దిగేందుకు సన్నద్ధుడయ్యాడు. ఆశ్చర్యమేమంటే ఆయన స్టేషను బయట కూడా నా వెంటనే నడిచాడు. దగ్గర యిల్లు కావడం వల్ల నేను నడక సాగిస్తే తనూ నా వెంటనే, కాకపోతే పక్కనే నడిచాడు. నడుస్తున్నంతసేపూ మాట్లాడుతూనే వున్నాడు.

తర్వాత మా వీధిలోనే ముందుగా ఒక యింటిముందు ఆగి "ఇదే మా యిల్లు. మా అబ్బాయి యిల్లు. నేను ఇప్పుడే హొస్తున్నానిక్కడికి. మా వూరు వదిలి వొచ్చేస్తున్నాను. ఇక్కడే వుంటానిక. నా సామాన్లు - అంటే ఎక్కువ భాగం నా పుస్తకాలు- నిన్ననే వచ్చాయి ఇక్కడికి" అన్నాడు.

"వివేకానంద మీ అబ్బాయా? మేమిద్దరం ఒకే ఆఫీసులో పనిచేస్తున్నాము. మా యిల్లు వీధి చివర" అన్నాను నేనూ.

"మంచిది. అప్పుడప్పుడు వొస్తూవుండు" అంటూ ఆయన గేటు తీసుకుని లోపలికి వెళ్ళిపోయాడు.

ఆఫీసులో మరునాడు వివేకానంద పలుకరించాడు. మాటల సందర్భంలో నా రైలు ప్రయాణం అతని తండ్రి పరిచయం ప్రసక్తి తెచ్చాను. కొన్ని క్షణాలు ఆగి "మా ఊళ్ళోనే వుండేవారు ఇంతకుముందు. అక్కడే వుంటానని మొండికేసి ఇన్నాళ్లు గడిపాడు. అక్కడే మట్టి అయిపోతానని గోల చేసేవాడు. ఇన్నాళ్ళూ సరే అన్నాము. కాని ఇప్పుడిక అక్కడి పొలంతో పాటు ఇల్లూ. వాకిలీ అన్నీ అమ్మేయవలసి వచ్చింది. ఇప్పుడైనా అయిష్టంగానే కదిలి వచ్చాడు" అని చెప్పాడు.

ఆనాడు వివేకానంద ఇంటిమీదుగా వస్తుండగా వరండాలో నిలబడి వుండి ఆయన పిలిచారు. ఆ పిలుపులో ఎంతో ఆప్యాయత, ఆర్ద్రత. లోపలికి వెళ్ళాను. నన్ను తన వెంట లోపలి గదిలోకి తీసుకెళ్లాడు. గది అంతా మసక వెలుతురు. లోపల కిటికీ పక్కన ఓ చిన్న బల్ల, స్టూలు వున్నాయంతే. గోడ వారగా ఒక పక్క మంచం... ఇక మిగిలిన గది అంతా కిందా పైనా అంతటా కాగితాలు, పుస్తకాల కట్టలు. పెద్ద కవిలె కట్టల్లాంటి పుస్తకాలు. బొత్తులు బొత్తులుగా కట్టలు కట్టలుగా ఎక్కడబడితే అక్కడ కాగితాలు. అంతటా ఆ వాసన...

"ఇదంతా... నా శ్రమ ఫలితం" అన్నాడాయన.

"పాతికేళ్ళ నుంచి నేను నిరంతరం సేకరించిన అమూల్య సమాచార భాండాగారం. ఇక్కడ నీకేం కావలిస్తే అది దొరుకుతుంది. బిట్రగుంట స్టేషనుకు అటూ ఇటూ వున్న స్టేషన్లు ఏవి అని నీకు అనుమానం వచ్చిందనుకో... అదుగో, ఆ మూల వున్న కాగితాల కట్టలో వెదికితే దొరుకుతుంది. జీలకర్ర ఏ రకమైన పదార్థమో తెలుసుకోవాలనుకో... లేకపోతే కలరా వుండలు ఎలా తయారు చేస్తారో తెలుసుకోవాలనుకో ఇదుగో ఈపక్క ఎక్కడో ఒక పుస్తకంలో ఆ వివరం

దొరుకుతుంది. ఎవరికైనా తుత్తునాగం అంటే ఏమిటో తెలుసుకోవాలని అనిపిస్తే కూడా తెలుసుకోవచ్చు. కాకపోతే కాస్త శ్రమపడి వెదుక్కోవాలి. అంతే..." ఇలా సాగింది ఆయన ధోరణి. నేను బొమ్మలాగా కూర్చుండిపోయాను.

అంతలో వివేకానంద నా అదృష్టం కొద్దీ వచ్చాడు లోపలికి. వచ్చీరావడం తోనే "మా ఆవిడ చెప్పింది మీరు వచ్చారనీ, మా నాన్న మిమ్మల్ని లోపలికి తీసుకొచ్చాడనీనూ... లేవండి... పదండి ముందు గదిలోకి వెళ్దాం..." అంటూ "నాన్నా! ఏవిటీ పద్ధతి? ఇంటికొచ్చిన వాళ్లందర్నీ మీ చాదస్తంతో విసిగించి బాధపెడితే ఎలా?" అని విసుక్కుంటూ నన్ను ముందు గదిలోకి తీసుకువెళ్ళి రక్షించాడు.

"ఇదీ ఆయన వరస, ఏళ్ల తరబడి అనవసరమైన చెత్త పోగు చేశాడు. ఇప్పుడిక ఈ రబ్బిష్ అంతా ఎక్కించడానికి కంప్యూటర్ కావాలంటున్నాడు" అన్నాడు వివేకానంద.

కాఫీ తెస్తానని లోపలికి వెళ్ళాడు. ఆయన వదలలేదు. మళ్ళీ ముందు గదిలోకి వచ్చి నాతో "అన్నట్టు ఈ ద్రణేవుడితోనే వొచ్చిందయ్యా చిక్కంతా... వాడెవడో తేలడం లేదయ్యా. నువ్వు కూడా నీకు తెలిసిన వాళ్లని వాకబు చేసి చూడు" అన్నాడు.

నేను తల ఊపాను. కాని ఆ ప్రశ్న మహా భూతంవలె నా మనసులోకి దూరడం గమనించలేదు. మరునాడు ఆఫీసు క్యాంటీనులో కాఫీ తాగుతూ వుంటే మా స్టాఫ్‌లో పెద్ద – రామేశంగారు వొచ్చి నా ఎదురుగా కూర్చుని "ఏమయ్యా! బాగున్నావా" అని పలకరించాడు.

"బాగున్నా" అంటూనే వున్నట్టుండి "గురూజీ! ద్రణేవుడనే వాడెక్కడైనా తగిలాడా మీకు? పురాణాల్లో కాని, భారత భాగవతాల్లో కాని ఎక్కడైనా సరే" అని అడిగాడు.

"ఎవరూ?" అని రెట్టించాడాయన.

"ద్రణేవుడు"

"అలాంటి పేరు ఎక్కడా తగల్లేదే. అయినా మనకు తెలిసిందెంత? మనం చదివిందెంత? ఎక్కడైనా అటువంటి వాడున్నాడేమో కనుక్కుందాం" అన్నాడాయన.

ఆ సాయంకాలం ఇంటికి తిరిగొస్తూ చూశాను. మా ఇంటి ప్రహరీ పక్కన రాళ్లమీద కూర్చుని మా బావమరిదీ మరో నలుగురు భావి భారతపౌరులు కూర్చుని వుండి తమలో తాము ఏదో తర్జనభర్జనలు పడుతున్నారు. కొన్నిక్షణాలు ఆగి విన్నాను, అంతా ఆ క్రిందటి దినం విడుదలై అమోఘంగా అత్యంత విజయవంతంగా జైత్రయాత్ర సాగిస్తూ వసూళ్లలో స్టేట్ రికార్డులు కంట్రీ రికార్డులు బద్దలు కొడుతున్నవారి అభిమాన హీరో నటించిన 'అబ్బ వుండండి మీరు మరీనూ' అనే సినిమా గురించిన వివరాలు, కలెక్షన్లు వగైరాలు.

నేను ఊరుకోక "ఏమిట్రా అబ్బాయిలూ మీరు చదువులు మానేసి ఆటలూ మానేసి మాట్లాడుకునే విషయాలు ఇవేనా? ఇట్లాంటి పనికిమాలిన వ్యర్థ విషయాలు తప్ప మీకేమీ లేవా మాట్లాడుకునేందుకు?" అన్నాను చొరవగా.

వాళ్ళు ఎటు వాళ్ళు అటు చెదిరిపోయినట్టు పోయి నేను లోపలికి వెళ్ళగానే మరో మూల మీటింగు పెట్టారు.

నేను లోపలికి వచ్చి కూర్చుని ఆలోచనలో పడ్డాను. నేను మాత్రం ఈ కొద్ది రోజులుగా చేస్తున్నదేమిటి? వివేకానంద తండ్రి రైల్లో పరిచయమైనప్పటి నుంచి నేనేమి చేస్తున్నాను? ఆయన ఆ ద్రణేవుడనే వాణ్ణొకణ్ణి నా నెత్తిన కూర్చోబెడితే నేను వెర్రివాడిలాగా నాకు కనిపించిన వాళ్లందర్నీ అడుగుతూ చేస్తున్నదేమిటి? ఆయన చెప్పిన విషయ సేకరణ, సమాచార సేకరణ అనేది ఒక పెద్ద వెర్రి. ఆయన ఆ పనికిమాలిన విషయాన్ని నా బుర్రలో కెక్కించి నా మనసు పాడుచేసి నన్నింతకాలంగా వ్యర్థుణ్ణి చేశాడు. ఇకనైనా జాగ్రత్తపడాలి అనుకున్నాను.

కాని ఒక పనికిమాలిన వెర్రి విషయం మనసులో పడకూడదే గాని అది మనలను తేలిగ్గా వొదులుతుందా?

సాయంత్రం కుమారస్వామి కనిపించి "మొన్న ఎప్పుడో ద్రణేవుడనే వాణ్ణి గురించి వాకబు చేశావుకదా" అన్నాడు.

"అవును. ఏమైనా తెలిసిందా" అని అడిగాను ఆత్రంగా.

అతడు అనవసరంగా నవ్వుతూ "లేదు. తెలియలేదు. నేనూ ఒకరిద్దర్ని అడిగి చూశాను కూడా. అందరూ తెలియదనే అన్నారు" అని ఇంకా అనవసరంగా నవ్వుతూనే వెళ్ళిపోయాడు.

నేను తెలివితక్కువ వాడిలా నుదురు రుద్దుకుంటూ నిలబడిపోయాను.

మరుసటి రోజు మధ్యాహ్నం మూడు గంటల వేళ ఆఫీసులో ఫోను మోగింది. ప్యూను "వివేకానందగారూ! మీకు ఫోను" అన్నాడు.

వివేకానంద లేచి వెళ్ళి ఫోనులో మాట్లాడుతూ వుండగా చూశాను. బాగా కంగారుపడుతున్నాడు. బహుశా ఏదో ఇబ్బంది కలిగించే విషయమే అయి వుండాలనుకున్నాను. అతడు ఫోను పెట్టేసి వస్తూ వుంటే "ఏమిటి?" అని అడిగాను. అతడు నుదురు తుడుచుకుంటూ "మా నాన్న పడిపోయాట్ట. వెళ్తున్నాను. రామేశంగారికి చెప్పు" అంటూ హడావిడాగా వెళ్లిపోయాడు.

ఆఫీసు పని ముగించుకుని ఆదరాబాదరా బయలుదేరి వివేకానంద ఇంటి ముందుకు వచ్చాను. వరండాలో కొంత అలజడి. కొందరు ఆడవాళ్లు కూర్చుని వున్నారు. వివేకానంద లోపల ఎక్కడో ఎవరితోనో మాట్లాడుతున్నాడు. ముసలాయన మనలో లేడు. కళ్లు అరమోడ్పులుగా వున్నాయి. నేను వెళ్లి ఆయన మంచం ప నిలబడ్డాను.

అంతలో ఆయ ‌ ి కళ్లు తెరిచాడు. నన్ను చూడగానే విచిత్రంగా నవ్వాడు. ఆ తర్వాత నన్ను దగ్గరికి ‌ ‌ రమ్మని కళ్లతో సైగ చేశాడు. నేను ముందుకు వంగి చెవి అప్పజె

ఆయన లోగొంతుకతో మాట్లాడాడు.

"ద్రణేవుడు... వాణ్ణి గురించి సంవత్సరాల తరబడి గొడవ పెట్టానా? ఏమో మరి... వాడొకడున్నాదని నాకనిపించడం లేదయ్యా. బహుశా వుండి వుండదు. అంతా నా భ్రమ అనిపిస్తున్నదిప్పుడు. అవును... అంతే"

ఆయన అలా మాట్లాడుతూ వుండగానే కంఠస్వరం క్రమంగా మందగించింది. ఆయన కళ్లు మూతలుపడ్డాయి.

# చెప్పుల జత

"సార్ ! కల్కటాలో ఇలాటిగాలి దొరకదనుకుంటాను."

నేను పక్కకు తిరిగి చూడకుండానే జవాబు చెప్పాను. "తల్లకిందులుగా తపస్సు చేసినా దొరకదు."

స్థలం... కృష్ణాతీరం...

సమయం... సాయంకాలం అయిదున్నర గంటలు...

ఎదురుగా పెద్ద జలరాశి... దూరంగా బ్రిడ్జిమీద రైలు పోతున్నది. ఆకాశంలో సరేసరి... రంగురంగుల మబ్బులు ..

ఆయన అప్పుడు నా పక్కనే వొచ్చి కూర్చున్నాడు. అప్పుడు చూశాను పరిశీలనగా... ఆయన పక్కనే ఆరేడేళ్ళ పిల్లకూడా వొచ్చి కూర్చున్నది.

రెండు రోజులనుంచి ఇదే వరస. ఈయన ఈయనతోపాటు ఈ పసి పిల్ల నన్ను వదలడం లేదు.

కృష్ణానది కట్టక్రింద సత్రంలో నాల్గయిదు రోజులనుంచీ కర్మాంతరాలు జరుగుతున్నాయి సత్రం పెద్దది... అయినా, అంతటా బంధుజన కోలాహలం విపరీతంగా ఉంది. చనిపోయిన వ్యక్తి మాకు జ్ఞాతి. దూరపు బంధువు. యాభై ఏళ్ళవాడు. చివరి క్షణం వరకూ నాలుగు చేతులా సంపాయిస్తూనే వున్నాట్ట. ఇళ్లూ వాకిళ్లూ స్థలాలు వగైరాలే కాక షేర్లూ చట్టుబండలు అంటూ రకరకాలుగా సంపాయించి ఉన్నట్టుండి పోయాడు. భోజనం చేసి కూర్చున్నాట్ట. కూర్చుని పెళ్ళాంతో ఏదో చెప్పబోయాట్ట. చెప్పనేలేదు. చిలకెగిరి పోయింది. ఆయన అంటే నాకాట్టె సదభిప్రాయం లేదు. కాని, ఇలాటి సందర్భంలో హాజరు వేయించుకోకపోతే పాపం అని గోలచేసి మా ఆవిడ ఇంత దూరం లాక్కుని వచ్చింది. పోయినవాడు సంపన్నుడు కూడా కావడంచేత ఎక్కడెక్కడి బీరకాయ పీచు సంబంధాల వారూ ఎక్కడెక్కడి నుంచో దిగారు. అందులో కొందరితో నాకు అసలు ముఖ పరిచయం కూడాలేదు. మా ఆవిడ మాత్రం దిగీ దిగగానే అందరినీ పలుకరించి హడావిడిగా వాళ్లతో కలిసిపోయింది. అంత పెద్ద సత్రమూ పిల్లలతో పెట్టెలు బెడ్డింగులతో నిండిపోయింది. పెద్ద హాల్లో, వరండాల్లో, గదులలో ఎక్కడ పడితే అక్కడ సామాన్లు సర్దుకుని ఎవరి పాటికి వారు కాలక్షేపం చేస్తున్నారు. ఎక్కడెక్కడి వారో ఎప్పటెప్పటి వారో కలుసుకోవడం కనుక అంతా గోలగోలగా ఉంది. మా ఆవిడ నిలిచినచోట నిలవకుండా వంటగది దగ్గరనుంచి స్నానాల గదుల వరకు తానే అయి పర్యవేక్షిస్తూ అందరికీ తోడుపడుతున్నది. ఎప్పుడో స్నాన సమయంలోనూ, కాఫీ వేళకు తప్ప

నన్ను గురించి పట్ట కోవడమేలేదు. అందరి మధ్య పరాయివాడిలా కాలం గడుపుతున్నాను. రామె ఉన్నాడు. కాని, అతనికి నాతో మాట్లాడేందుకు తీరిక ఎక్కడ? బజారుపనులు, కొనుగోళ్ళు, కర్మలు చేసేవారి వెంట వెళ్ళడం వంటి పనులలో అతను తలమున్కలుగా ఉన్నాడు.

ఈయన మాత్రం ఇందరిలో నన్నే ఎన్నుకున్నట్టు వచ్చిన రోజునే నాదగ్గరికి వచ్చి నా వివరాలన్నీ తెలుసుకుని అప్యాయంగా మాట్లాడుతున్నాడు. వెంట వెంటనే ఉంటున్నాడు. భోజనాలవేళ బంతిలో నా పక్కనే కూర్చుంటున్నాడు. ఆయన వెంటనే ఆ పిల్ల.

ఇప్పుడు నది మెట్లమీద నా పక్కనే కూర్చున్న ఆ వ్యక్తిని పరిశీలనగా చూశాను. ఆయన ఎదురుగా విస్తరించుకుని ఉన్న మహాజలరాశిని చూస్తున్నాడు ఆ పిల్ల ఎప్పటివలెనే బిక్కు బిక్కుమంటూ కూర్చునివుంది.

ఆయన కాళ్ళకున్న చెప్పులే సగం అరిగిపోయి దారిద్ర్యాన్ని చాటి చెబుతున్నాయి. యాభైపైబడిన వయస్సు, తెల్లబడిన పలుచని జుట్టు శుష్కించిన దవడలు, కొద్దిగా పెరిగిన తెల్లని గడ్డం, మందమైన అద్దాల కళ్ళజోడు. ఎదురుగా అస్తమిస్తున్న ఎర్రని సూర్యబింబం ఆ అద్దాలలో మెరుస్తున్నది.

నేను నాలుక చివరిదాకా వచ్చిన ప్రశ్నను అణిచిపెట్టాను. 'మీరు చనిపోయిన ఆయనకు ఏమవుతారు?' అని అడగబోయాను. కాని, అడగలేదు, ఆయన తిరిగి అదే ప్రశ్న వేస్తే వివరించలేక బాధపడాలి. ఆ బాంధవ్యం ఎక్కడ గుర్తు నాకు?

ఆయన ఉన్నట్టుండి ఎందుకో నిట్టూర్చాడు, పక్కనున్న పసిపిల్ల జుట్టుపైకి తోసుకుంటూ "నాన్నా! పోదాం" అంటున్నది.

"పోదాం పోదాం" అన్నాడాయన.

రేపు పదమూడోరోజు. ఆనాడు భోజనాలతర్వాత ఎక్కడెక్కడి బంధువులూ వెళ్ళిపోతారు. వెళ్ళితీరాలి. తమ తమ ఊళ్ళకు, తమ ఇళ్లకు నేరుగా వెళ్లిపోవాలి. వెళ్లేటప్పుడు 'వెళ్తున్నామ'ని చెప్పకుండా వెళ్ళిపోవాలి.

ఆయన పిల్ల అల్లరి భరించలేక లేచి 'మీరు కాస్సేపు కూర్చుంటారా ఇక్కడ?' అని అడిగాడు.

ఆయన పిల్లరెక్కపట్టుకుని నెమ్మదిగా మెట్లెక్కి కట్టదిగి సత్రంలోకి వెళ్ళిపోయాడు.

ఈ మూడు రోజులలోనూ నేను గమనించిన తమాషా ఏమిటంటే ఇంతమంది సత్రం నిండా బంధుజనం కోలాహలంగా ఉన్నారా, ఎవ్వరూ ఈయనతోటి ముభావంగా తప్ప మామూలుగా మాటాడిన పాపాన పోలేదు. అదేమిటో, ఆయన ఎవరినైనా పలకరించబోయినా 'ఊం-ఆ' అని తప్ప కలివిడిగా సమాధానం చెప్పినవారే లేరు. నాకేమీ అంతుబట్టలేదుకాని మొత్తానికి ఏదో రహస్యం ఉందని మాత్రం అనిపించింది. సత్రంలో ఒక గదిలో మూలగా కొద్దిపాటి బట్టలున్న

సంచి మాత్రం ఉంది. అవసరం వొచ్చినప్పుడు దానిముందు కూర్చుని సర్దుకుంటాడు. అక్కడే కూర్చుంటాడు. రాత్రివేళ పిల్లను పక్కన పడుకోబెట్టుకుని ఆ సంచినే తలగడగా చేసుకుని పడుకుంటాడు ఆయనను భోజనాల వేళగాని, కాఫీల వేళగాని ఎవరూ ప్రత్యేకించి పిలవడం నేను గమనించలేదు.

పొద్దుగూకుతున్నది. ఇక 'లేద్దామా' అనుకుంటున్నాను.

అంతలో రామేశం వచ్చాడు. నా కోసమే వెదుక్కుంటూ వచ్చాడు. నా పక్కనే కూర్చున్నాడు.

"ఊc! ఏమిటి సంగతులు?" అని అడిగాను.

అతడు నిట్టూర్చి పైపంచెతో ముఖం తుడుచుకుని అలిసిపోయినవాడిలా మాట్లాడాడు.

"ఇప్పుడే బజారునుంచి వొచ్చాను. మీతో తీరిగ్గా మాట్లాడటమే కుదరలేదు. ఇవ్వాళ ధర్మోదకాల కార్యక్రమం అయిపోయింది. ఇహ రేపు ఎవరిదోవ వాళ్ళది.. మీరు అమ్మణ్ణితో కలిసి వీలుచూసుకుని మా ఊరికి రారాదూ?"

"ఎందుకు రాకూడదూ? నిక్షేపంగా రావచ్చు. సెలవు దొరకాలి, డబ్బు సమకూరాలి– అంతే" అన్నాను నేను నవ్వుతూ.

"రాదల్చుకోవాలిగాని మీకు సెలవు, డబ్బు సమస్యలా?" అన్నాడతడు. నేను కొద్దిక్షణాలాగి సంశయిస్తూనే "రామేశం! ఇప్పుడే క్రిందికి దిగి వెళ్తూ నీకు ఎదురు పడి ఉంటాడే ఆయన ఎవరు?" అని అడిగాను.

రామేశం ఒకరకంగా ముఖం పెట్టి అంతలో నవ్వుతూ "ఎవరూ? వెంకట్రావా? ఆయన ఊసెందుకు వొచ్చిందిప్పుడు?" అన్నాడు.

తర్వాత నెమ్మదిగా "అదొక వింత పాత్ర" అన్నాడు.

"ఏమిటి సంగతి?" అని అడిగాను నేను.

"ఆయన మనందరికీ కావలసినవాడే. నెల్లూరు జిల్లా మారుమూల ఎక్కడో పల్లెపట్టున ఏదో ఉద్యోగం వెలగబెడుతున్నాడు" అన్నాడు ముందు.

'ఉద్యోగం వెలగబెడుతున్నాడు' అనడంలో వ్యంగ్యం అంతా కురిపించాడు. బహుశా ఏదో చిన్న ఉద్యోగం కాబోలు..

నేను "ఊc" అన్నాను, ఇంకా చెప్పమన్నట్టు.

"ఏముందీ? ఇట్లా పెళ్ళిళ్ళకూ చావులకూ తప్పకుండా వొస్తూ వుంటాడు. ఈసారి పెళ్ళాన్ని తీసుకు రాలేదు. పిల్లను మాత్రమే వెంటబెట్టుకొచ్చాడు. మొత్తం ముగ్గురు ఆడపిల్ల లనుకుంటాను. పెద్ద పిల్ల పెళ్ళి చేశాడా మధ్య ఎప్పుడో, ఏదో తూతూ మంత్రంగా. ఆ పిల్ల కాపురం కూడా అంతంత మాత్రంగానే ఉందని విన్నాను. అల్లుడు పరమ లోఫరట. ఇక ఇద్దరాడ పిల్లలు. ఈ పిల్ల అందరికంటె చిన్నదయి వుంటుంది!"

ఇవన్నీ మామూలు విషయాలే అంతమాత్రంలో అతను వింత పాత్ర ఎందుకైనాడు? అని ఆలోచిస్తున్నాను.

రామేశం నా మనసు గ్రహించినట్టు మొదలుపెట్టాడు:

"వొట్టిదొంగ... నలుగురు చేరినచోటికి పెళ్ళిళ్ళకు చావులకూ వస్తాడా, ఏదో ఒకటి కాజేసుకు పోతుంటాడు. ఆయన వొచ్చాడంటే ఎవరి జేబులోనో డబ్బు మాయమైపోతుంది. లేదా ఏ వెండి గిన్నో గొలుసో మాయమవుతాయి. ఇది అందరికీ తెలుసు. అందుకే ఆయన వొచ్చాడంటే ఎక్కడి వారక్కడ జాగ్రత్త పడతారు."

నాకు విచిత్రమనిపించింది.

"ఇలాటి మనుషులుంటారా?" అన్నాను.

"ఉంటారా అని అడుగుతారేమిటి? ఉన్నారు" అన్నాడు రామేశం గట్టిగానే.

ఆ రాత్రి పొద్దుపోయాక మా ఆవిడ వచ్చి నా పక్కనే నడుం వాల్చింది.

ఈ నాలుగు రోజుల హడావిడిలో నీరసపడ్డట్టు కనిపించింది.

ఆవిడతో నెమ్మదిగా, లోగొంతుకతో, ఈ విషయమే కదిపాను.

ఆమె కూడా గుసగుసలుగా రామేశం చెప్పినదాన్నే ఖరారు చేసింది. పైగా బోలెడు ఉదాహరణలు కూడా చెప్పింది.

మరునాడు అంతా హడావిడి... భోజనాలు ముగించి ఎవరి త్రోవన వారు వెళ్ళిపోవాలి. అందువల్ల కొద్దిమంది తప్ప మిగిలిన వాళ్ళందరూ తమ తమ సామాన్లు సర్దుకునే హడావిడిలో ఉన్నారు. నేనప్పుడు గమనించాను. నా చెప్పులు మాయమైపోయాయి. కొత్త చెప్పులు... రెండు వందలుపోసి కొని నెల రోజులైనా కాలేదు.

ఈ మాట నానోటి వెంట జారిందో లేదో అతి చిత్రంగా అమిత వేగంగా పాకిపోయింది. అయితే ఎవరూ పెద్దగా ఏ మాటా అనలేదు. కాని గుసగుసలుపోయారు. మొత్తానికి కొద్ది నిముషాల్లోనే విషయం అందరికీ నెమ్మదినెమ్మదిగా తెలిసిపోయింది.

రామేశం "ఏమిటి? నేను విన్నది నిజమేనా?" అంటూ వొచ్చాడు.

నేను తల ఊపి "ఇందాకే గుమ్మం ముందు వొదిలిపెట్టాను. స్నానానికి వెళ్ళొచ్చి చూస్తే జతలేదు" అన్నాను.

"ఉండండుండండి..... తమాషాచేస్తాను" అంటూ రామేశం వెళ్ళిపోయాడు.

వెంకట్రావుగారు స్నానం చేసి బట్టలు మార్చుకుని వచ్చాడు. సంచి ముందు కూర్చుని బిక్క మొహంతో నిలబడి ఉన్న కూతురితో నెమ్మదిగా "వెళ్దాం తల్లీ... వెళ్దాం... భోజనాలయ్యాక బయల్దేరిపోదాం... బస్సెక్కి పోదాం... ఓపికపట్టు...." అంటున్నాడు.

సంచి సర్ది జిప్‌లాగి చిన్న తాళం తగిలించాడు. తర్వాత దాన్ని లాగి చూశాడు. ఆ తర్వాత ఆ పక్కనే కూర్చున్నాడు. కళ్ళజోడు తీసి పంచె చివరతో తుడుచుకుని మొహానికి తగిలించుకున్నాడు.

అంతలో రామేశం అన్నగారు హడావిడిగా వచ్చాడు. వచ్చీ రావడంతోనే వెంకట్రావు నుద్దేశించి "మీరు కాస్త తోడురావాలి నాకు. దగ్గరే బజార్లో చిన్నపని.... ఒక వస్తువు కొని ఇస్తాను. తీసుకుని రిక్షా ఎక్కి వచ్చేయండి... పావుగంట పని.. నేను వేరే పనిమీద స్టేషనుకు అర్జెంటుగా వెళ్ళాలి" అంటూ తొందరపెట్టాడు.

తన అవసరం వచ్చినందుకు, తనను గుర్తించినందుకు ఆనందిస్తున్నవాడిలా వెంకట్రావుగారు లేచారు

"ఇప్పుడే వస్తా – ఇలా కూర్చో" అంటే వినకుండా ఆ పిల్ల ఏడవటం మొదలుపెట్టింది.

"పిల్లను కూడా తీసుకురండి... ఆటో సిద్ధంగా ఉంది" అంటూ రామేశం అన్నగారు ఇద్దర్నీ వెంట తీసుకుపోయాడు.

బయట ఆటో కదిలి వెళ్ళిన ధ్వని వినబడింది.

మరుక్షణంలో రామేశం, అతని వెంబడి కొందరు ఆడవాళ్ళు, మగవాళ్ళు బిలబిల మంటూ గదిలోకి వచ్చారు.

రామేశం ఆ సంచిని ఇవతలికి లాగి అందరి ముందు దాన్ని తెరిచేందుకు సంసిద్ధుడైనాడు. నా మనసు వికలమయింది. అయినా ఊరుకుండిపోయాను.

'తాళం కూడా వేశాడు పెద్దమనిషి' అన్నారెవరో ఎగతాళిగా.

'ఈ తాళం ఎంత? దీని బతుకెంత? క్షణంలో వొచ్చేస్తుంది' అంటూ రామేశం నిజంగానే మరో తాళం చెవితో దాన్ని తీశాడు. జిప్ లాగాడు.

అందరూ ఉత్కంఠతో చుట్టూ చేరి చూస్తున్నారు. మా ఆవిడ ముందు వరుసలో ఉండి కళ్ళు విప్పార్చి చూస్తున్నది.

సంచిలో పైన పంచెలు తువ్వాళ్ళు వంటివి ఉన్నాయి. క్రింద పెద్ద పెద్ద పేపరులో కొన్ని లడ్డూలు గారెలవంటి తినుబండారాలున్నాయి.

ఆ క్రింద... కళ్ళు తిరిగినట్టయింది. పేపరులో చుట్టబడి నిజంగానే చెప్పులజత, నాదే, ఉంది!

రామేశం విజయ గర్వంతో అందరి వంకా చూశాడు. తర్వాత చెప్పుల జత మా ఆవిడకు అందించాడు. తినుబండారాలు కూడా తీసేయబోయాడు కాని, ఎవరో పెద్దాయన "పోన్లేపాపం, వాటిని ఉంచెయ్. పేదవాడు – పిల్లలకు పెట్టుకుంటాడు." అనగానే ఆ ప్రయత్నం విరమించుకున్నాడు. మళ్ళీ క్షణాల్లో యధావిధిగా ఏ అనుమానమూ రాకుండా సంచి సర్దేసి తాళంవేసి, యధాస్థానంలో పదిలంగా ఉంచి రామేశం లేచాడు. మా ఆవిడ చెప్పుల జతను పేపరు సహితంగా మా పెద్ద సూట్‌కేసు అడుగున దాచి తాళం వేసి మరీ కదిలింది. తర్వాత ఎవరిపాటికి వారు ఇవతలికి వచ్చి ఏమీ ఎరగనట్టే, ఏమీ జరగనట్టే ఎవరి పనులలో వారు మునిగిపోయారు. తర్వాత వెంకట్రావుగారు వచ్చాడు. తాపీగా సంచి పక్కనే కూర్చున్నాడు. మారాం చేస్తున్న పసిపిల్లతో "ఉండమ్మా! అల్లరి చెయ్యకు.

భోజనాలయ్యాక బస్సెక్కి ఊరెళ్లిపోదాం. .!" అంటున్నాడు. పన్నెండు గంటలవేళ అందర్నీ భోజనాలకు లెమ్మన్నారు. బంతిలో మామూలుగానే వెంకట్రావు నాపక్కనే వచ్చి కూర్చున్నాడు అదీ యిదీ మాట్లాడుతూ భోజనం చేశాడు. పిల్ల మొరాయిస్తూ టే, "తినమ్మా! బస్సెక్కిన తర్వాత మధ్యలో 'ఆకలి ఆకలి' అంటావు." అని బతిమాలి మరీ తినిపించాడు.

ఇక ఆనాటికి అక్కడ నిద్ర చెయ్యరాదు కాబట్టి ముఖ్యులెవరో కొద్దిమంది అందరూ పిల్లా పాపలతో సామాన్లతో ప్రయాణ సన్నాహాల్లో పడ్డారు. సత్రం బయట రిక్షాలు, ఆటోలు, కిరాయి మాట్లాడటాలు, అంతా గందరగోళం.

నేను వరండాలో కూర్చుని ఉండగా వెంకట్రావు చేతి సంచితో వచ్చి "మీ ప్రయాణం ఎప్పుడు?" అని అడిగాడు.

"సాయంకాలం బండికి, రిజర్వేషన్లు కూడా మొన్ననే చేయించారు" అన్నాను నేను.

ఆయన అదోకరకంగా "వస్తాను. మళ్ళీ ఎప్పుడో! మీతో బాగా కాలక్షేపం అయింది" అన్నాడు.

తర్వాత పిల్లను నడిపించుకుని చేతి సంచి మోసుకుని నడిచిపోయాడు.

ఆయన వీధి మలుపు తిరిగి కనుమరుగయ్యేంతవరకు చూస్తూనే ఉన్నాను.

ఎందుకో మనసంతా అలజడితో నిండిపోయింది.

మా ఆవిడ వచ్చింది.

'వెళ్ళిపోయాడు పెద్ద మనిషి, ఇవిగో మీ చెప్పులు', అంటూ చెప్పుల జతను అపురూపంగా పట్టుకుని వచ్చి నా కాళ్ళ దగ్గర పడేసింది. నేను కొన్ని క్షణాలు కళ్ళు మూసుకుని నిలబడిపోయాను. కళ్ళముందు అదే దీనాకృతి, నెమ్మదిగా నడిచిపోతూ.

# పగిలిన గాలిబుడగ

పని చూసుకుందామని ఫైలు ముందుకు లాక్కున్నాడు మురారి. కళ్ళు ఫైల్లోకి చూస్తున్నాయి కాని అతని బుర్రలోకి ఏమీ ఎక్కడం లేదు. మెదడంతా మొద్దు బారిపోయి ఒక రకమైన గ్లాని ఆవహించింది.

ఫైలు అవతలికితోసి చిరాగ్గా చేతి వ్రేళ్ళు విరుచుకుని ఒక చేత్తో జుట్టు పైకితోసుకుని కుర్చీలో సాగిలపడ్డాడు. ఒక్క క్షణం కళ్ళు మూసుకున్నాడు. మాసిన చేతి రుమాలుతో ముఖం తుడుచుకున్నాడు.

లంచ్ టైములో క్యాంటీనులో జరిగిన వ్యవహారం తలుచుకుంటే ఒళ్ళు జలదరిస్తున్నది. మెదడుకు కరెంట్ షాక్ తగిలినట్లవుతున్నది.

శంకర్రావు తన తోటి గుమాస్తా – మితభాషి అనవసరమైన విషయాల్లో జోక్యం పెట్టుకునే తరహాకాదు. తన పనేమిటో తానేమిటో తప్ప చవకబారు ప్రసంగాలు చేయడం ఇతరుల గురించి మాట్లాడటం అతనికి అలవాటులేదు. నలుగురిలో పై కారణాలచేతనే పెద్దమనిషిగా చెలామణి అవుతున్నాడు.

మురారి క్యాంటీన్‌లో ఒక మూల కూర్చుని టీ తాగుతూ వుండగా పనికట్టుకుని దూరంనుంచీ వచ్చి మురారి పక్కనే కూర్చుని పలకరించాడు శంకర్రావు "ఎలా వున్నారు సార్" అంటూ.

మురారి కొంచెం ఆశ్చర్యపోయి అంతలోనే నవ్వుతూ "బాగానే వున్నామండి" అన్నాడు.

శంకర్రావు టీ తాగుతూ మొదలుపెట్టాడు. "ఏం జీవితాలో ఏమిటో! బొత్తిగా సుఖం లేకుండా పోయింది. పొద్దునలేచింది మొదలు ఒకటే పరుగైపోయింది. లేవడం గబగబ పనులు ముగించుకోవడం, బస్సుకోసం పరుగులెత్తడం, పొద్దుగూకి ఇంటికి చేరడం, తినడం, నిద్రకుపడటం.... ఇలా తయారైంది బతుకు. జీతం రాళ్ళు రాగానే ఇంటిదగ్గర డబ్బు పడెయ్యడం తప్ప ఏమీ పట్టించుకోడం కుదరదు. నా సంగతే తీసుకోండి. మా పిల్లలు ఏం చదువుతున్నారో ఎలా చదువుతున్నారో అసలు చదువుతున్నారో లేదోకూడా పట్టించుకోడానికి వీలు కావడంలేదు. ఇక్కడేమో పదింటి నుంచీ అరింటివరకూ గాడిదచాకిరీ."

మురారి కళ్ళు పెద్దవి చేసుకుని ఆమాటలు వింటూ కూర్చుండిపోయాడు. శంకర్రావు ఉన్నట్టుండి పనికట్టుకుని వచ్చి పక్కనే కూర్చుని ఈ తరహా సోది ఎందుకు మొదలుపెట్టాడో అర్థం కాలేదు.

బీడీ ముట్టించుకుని "అంతేసర్... బొత్తిగా అర్థంలేని బతుకైపోయింది" అన్నాడు ఏమీ అనకపోతే బాగుండదని.

"అన్నట్టు మీరుండడం ఎక్కడ? అదే ఇటీవల ఇల్లు మారినట్టున్నారుగా?" అని అడిగాడు శంకర్రావు.

"అవును కృష్ణలంకలో వుంటున్నాం... ఇల్లు చిన్నదైనా అద్దె తక్కువనీ..."

శంకర్రావు ఉన్నట్టుండి "మీ అమ్మగారు బాగున్నారా?" అని అడిగాడు.

మురారి కొంచెం ఆశ్చర్యపోయి అంతలో " బాగానే వుంది" అన్నాను.

శంకర్రావు బల్లమీది గాజుగ్లాసును చేత్తో గుండ్రంగా తిప్పుతూ లోగొంతుకతో అన్నట్టు మీతో ఒక విషయం చెప్పాలనివచ్చాను..." అంటూ ఆగి గొంతు సర్దుకుని మీరు ఏమీ అనుకోవద్దు... అసలు మీ దృష్టి కీవిషయం తీసుకురావాలని అనుకోలేదు. కాని ఊరుకోలేక పోతున్నాను. ఎందుకంటే.. ఎందుకంటే... ఇతరులెవరికి తెలియకముందే మీకు తెలిస్తే జాగ్రత్త పడతారని అనిపించింది. అందుకనే చెప్పాలనుకున్నాను" అన్నాడు.

మురారి నివ్వెరపోయి "చెప్పండి సర్... ఏమిటి సంగతి?" అని అడిగాడు అదుర్దాగా.

'చెబుతాను... కాని మీరు ఉద్రేకపడవద్దు... బాధపడవద్దు. నెమ్మదిగా నింపాదిగా వ్యవహరించండి....."

"అలాగే చెప్పండి...." అన్నాడు ముందుకు జరుగుతూ మురారి.

శంకర్రావు అసలు విషయం బైటపెట్టాడు చాలా నెమ్మదిగా, సౌమ్యంగా.

అది వినీవినగానే మురారికి వొంటి నిండా తేళ్ళూ, జెర్రులూ పాకినట్టయింది. తలకొట్టేసినట్టయింది. కళ్ళు పెద్దవిచేసి నసుగుతున్నట్టు "నిజమా?" అనగలిగాడు.

"నిజం. నేను కళ్ళారా చూశాను. చాలాసార్లు చూశాను. బస్స్టాండ్ దగ్గర ఎక్కువసార్లు లీలామహల్ క్యూల దగ్గర. మీరేమీ అప్సెట్ కావద్దు. బాధగానే వుంటుంది కాకపోతే నింపాదిగా ఆలోచించి ఏదో ఒకటి చెయ్యండి. ఉద్రేకం, కోపతాపాలు అసలు పనికిరావు. సౌమ్యంగా మాట్లాడటం, జాగ్రత్తగా కనిపెట్టి వుండటం మంచిది. గట్టిగా పోట్లాట పెట్టుకుని హర్ట్ చెయ్యకూడదు." అన్నాడు శంకర్రావు నచ్చచెబుతూ.

మురారి లేచి "థ్యాంక్సండి..." అంటూ ఇంకేమీ మాట్లాడలేక లేచి వచ్చేశాడు.

అప్పటి నుంచీ మనసంతా కుతకుత ఉడికిపోతున్నది. అసలీ తక్కువ మధ్యతరగతి బతుకులే నికృష్టమైనవి. అటు వున్నట్టూ కాదు. ఇటు లేనట్టూ కాదు. ఉన్నంతలో జాగ్రత్తగా ముడుచుకుని జీవితం గడపాలి. చిన్నచిన్న చికాకులు ఏమీ చెయ్యవు. అవి అలవాటైపోతాయి. కాని యిలాటిదెక్కడన్నా ఉంటుందా? ఇది తన చెవిని వెయ్యడానికే ఆ పెద్దమనిషి అంత బాధపడిపోయాడు. ఎంత అప్రతిష్ఠ! ఎలా

జరుగుతున్నదిది అసలు? ఇంట్లో ఇందరుండి ఏం చేస్తున్నారు? ఎవరు మాత్రం ఏం చెయ్యగలరు?

శంకరి పొద్దున లేచినప్పటినుంచి వంచిన నడుం ఎత్తకుండా చాకిరీ చేస్తుంటుంది. తెల్లవారుజామునే లేచి తొమ్మిదింటి కల్లా వంటా వార్పూ ముగించి తిండ్లు పెట్టి ఎటుపోవలసిన వారినటు పంపి అలసిపోయి కాస్సేపు కూర్చోగానే మళ్ళీ మధ్యాహ్నం భోజనాలు, తర్వాత రాత్రికి చాకిరీ. ఇదీ తన భార్య దినచర్య. అలసట ఎరుగని ప్రాణి ఆమె. ఇక పెద్దవాడు కాలేజీ విద్యార్థి. వాడి తిరుగుళ్ళూ షికార్లూ వాడివి. ఇల్లుపట్టకుండా తిరుగుతూ వుంటాడు. పైగా కాలేజీలో వాడొక చిన్నసైజు నాయకుడు. తర్వాతి వాడు పదహారేళ్ళ హైస్కూలు విద్యార్థి. తరువాతది పదేళ్ళపిల్ల. వాళ్ళ చదువులూ, ఆటలూ వాళ్ళవి. మురారికి తల్లి కళ్ళల్లో నిలిచింది. అరవైదశకందాటి ఏడెనిమిదేళ్ళు వెళ్లివుంటాయి ఎప్పుడు పుట్టిందో ఏమో! వివరం తెలీదు. జీవితంలో ఏ సుఖం అనుభవించిందో ఏ కష్టాలు భరించిందో గుర్తులేదు. పెళ్ళయాక భర్తచేతిలో - అంటే తన తండ్రి చేతిలో అష్టకష్టాలూ పడింది. ఆయన వ్యసనపరుడు, జూదరి, వ్యభిచారి, నాటకాలపిచ్చిలో పడి పిత్రార్జితమంతా తగలేశాడు.

పుట్టీ పుట్టకా పోయినవారు పోగా తనొక్కడే మిగిలాడు. తనమీద ఆశలన్నీ పెట్టుకుని చిన్నప్పటినుంచీ గారాబంగా నేల తగల నీయకుండా పెంచింది. తండ్రి క్రమంగా మారి ఒక ప్లీడరు దగ్గర గుమస్తాగా చేరి నాలుగు రాళ్ళు సంపాయించేవాడు. రోజల్లా కష్టపడేవాడు. తనను ఎంతో ముద్దుగా మురిపెంగా చూసుకునేవాడు. 'నా బంగారు తండ్రి పెద్దవాడై కలెక్టరవుతాడు' అనేవాడు. ఇన్నీ అని తాను ఎస్సెల్సీ చదువుతుండగా హఠాత్తుగా చచ్చిపోయాడు. మృత్యువు చెప్పా పెట్టకుండా సద్దుచేయకుండా కోర్టు ఆవరణలోని చెట్టు క్రింద ఆయన్ని కబళించుకుపోయింది. తర్వాత ఆ తల్లి ఏ బాధలు భరించిదో తెలీదు. కష్టించి పనిచేసి కడుపు కట్టుకుని తనను కాలేజీలో చేర్పించింది. బి.ఏ. అయిందనిపించి తాను ఉద్యోగాల వేటలో పడ్డాడు.

రెండేళ్ళు ఆ వేటలోనే గడిచిపోయింది. తర్వాత తన అదృష్టం పండి ఇదిగో ఈ గొర్రెతోక ఉద్యోగం లభించింది. అప్పుడదే మహాప్రసాద మనిపించి ఇందులో చేరాడు. "ఈ మాత్రం కూడా లేనివాళ్ళెంతమంది లేరుగనుక!" అని సమర్థించుకున్నాడు. డాక్టరై పేరూ డబ్బూ సంపాయించాలని కలలుగన్న తాను ఇలా గుమస్తా అవతారంలో కుర్చీకి అంటుకుపోయాడు. తల్లి జుట్టు పండిపోయింది. పళ్ళు కొన్నే మిగిలాయి. శరీరం ముడతలు పడింది. కళ్ళు గాజుబిళ్ళలైనాయి. రోడ్డుపక్క ఎక్కడో పాత కళ్ళజోడు కొనుక్కొని పెట్టుకు తిరుగుతూ వుంటుంది.

ఇటీవలే ఉన్నట్టుండి ఒక రోజున నెమ్మదిగా "ఇవాళ ఒక కల వొచ్చిందిరా అబ్బాయ్!" అన్నది.

"ఏమిటాకల?" అని అడిగాడు తాను.

'ఏమీలేదు. వొట్టి ఆరు బయలు ఆకాశం... అంతా కాకులమయం... వందలూ వేలూ కాకులు కనిపించాయి."

"కనిపిస్తే ఏం?"

"ఏమో... నాకేం తెలుసు... కనిపించాయంటున్నా నంతే..."

కాని ఆమె మనసులో ఏదో సంశయలేశం వున్నట్టు తోచింది.

మురారి ఉలిక్కిపడి చూశాడు. "పోదాం పదండి. టైమయింది. కుర్చీలోనే కూర్చుని కలలు కంటున్నారు" అంటున్నాడు పక్క గుమాస్తా మారుతీరావు.

అతడు ఆవులించి లేచాడు. ఫైళ్ళు పక్కకు సర్దాడు. ఒక్కసారి జేబులు తడువుకున్నాడు. తర్వాత రుమాలుతో మొహం తుడుచుకున్నాడు.

"ఇవాళ అర్జంటు పనుంది...." అంటూ కాఫీకి, సినిమాకూ ఆహ్వానించిన ఇద్దరు నేస్తాలను వొదిలించుకుని గబగబ నడిచాడు. రోడ్లన్నీ జనంతో రద్దీగా కోలాహలంగా కిటకిటలాడుతున్నాయి. ఎన్నికలు దగ్గర పడటంతో నినాదాలూ అరుపులతో ఊరంతా అక్షరాలా సంతలాగుంది.

సిటీబస్సులో మురారి బస్టాండు దగ్గర దిగాడు. కొద్దిగా వొణుకుతున్న వ్రేళ్ళతో జుట్టు పైకి తోసుకున్నాడు. తర్వాత ఎదురుగా వున్న టీ స్టాలు ముందు నుంచుని కొంచెం టీ తాగాడు.

ఆ తర్వాత మెల్లిగా మెట్లక్కి బస్‌స్టాండ్ లోపలికి వెళ్ళాడు. చురుగ్గా చూస్తూ బస్టాండు అంతటా కలయదిరిగాడు. బస్సు పక్కన ఇద్దరుముగ్గురు అడుక్కునేవాళ్ళు కనిపించారు. ఒకడు 'కాళ్ళులేని బ్రతుకు బాబూ! ధర్మం చెయ్యండి బాబూ!' అని అరుస్తున్నాడు. మరొక ఆడమనిషి గుడ్డిది మరోచోట 'కబోదిదాన్ని బాబూ! మారాజులు ధర్మంచెయ్యండి పుణ్యముంటది' అంటూ అడుక్కుంటున్నది. ఒకడు మొహమంతా మచ్చలవాడు, చెయ్యిలేనివాడు పెద్ద గొంతుకతో 'కష్టపడలేని అవిటివాణ్ణిబాబూ' అంటూ అడుక్కుంటున్నాడు. మరోచోట ఒక పసిపిల్ల చేతిలో పలకాపుస్తకం పట్టుకుని అడుక్కుంటున్నది.

మురారి నిట్టూర్చి మెట్లుదిగి ఇవతలికి వచ్చాడు. ఎదురుగా లీలామహల్ వైపు నడిచాడు. ఒకపక్కగా నిలబడి చురుకు చూపులతో చుట్టూ పరికించాడు.

ఏదో కొత్త ఇంగ్లీషుసినిమా ఇంకా టిక్కెట్లు ఇవ్వటం ప్రారంభించలేదు. క్యూలు కొండవీటిచేంతాళ్ళలా పెరిగి ఉన్నాయి. రకరకాల చిన్నచిన్న బండ్ల వ్యాపారులు కేకలువేస్తూ రొదచేస్తున్నారు.

మురారి జాగ్రత్తగా పరీక్షగా చూస్తూ ముందుకుసాగాడు. ఒక క్యూ పక్కన దాదాపు అరడజను మంది చేతులు చాచి అడుక్కుంటున్నారు. అందులో ముగ్గురాడవాళ్ళున్నారు. ఒకతె పసిపిల్ల నెత్తుకుని 'పాలులేని పసిప్రాణం బాబూ! అయిదు పైసలెయ్యండి బాబూ!' అని పెద్ద గొంతుకతో అడుక్కుంటున్నది. మరొకతె మరుగుజ్జు... మరొకతె ఏడేళ్ళ పసిపిల్ల... దాని చంకలో నెలలగుడ్డు...

మురారి ఒకపక్కగా చాలాసేపు నిలబడ్డాడు. అతని చూపులు చుట్టూ నిశితంగా తిరుగుతూనే వున్నాయి. టిక్కెట్లివ్వడం ప్రారంభించినట్టున్నారు. క్యూ తరగడం మొదలైంది.

అంతలో లైట్లు వెలిగి కొద్దిసేపట్లోనే పట్టపగల్లా వెలిగిపోవడం జరిగింది. శీతాకాలం పొద్దేమో ఇట్టే చీకటిపడిపోయింది. ఫ్లోరోసెంట్ లైట్ల వెలుగు పాదరసంలా

మురారి గోడపక్కగా చాలాసేపు నిలబడ్డాడు.

జాగ్రత్తగా చూస్తూ నిలబడ్డాడు.

"ఇక్కడున్నారేమిటి? సినిమా కొచ్చారా?" అని పలకరించిన మిత్రుణ్ణి చూసి నవ్వి "అబ్బే! సినిమాక్కాదు ఊరికే నిలబడ్డాను" అన్నాడు. ఆ మిత్రుడు జరగనున్న ఎన్నికల గురించీ, పార్టీల గురించీ, రాజకీయాల గురించీ అనర్గళంగా మాట్లాడుతూ వుంటే 'ఆఁ అహా! అలాగా అవునవును' అంటూ నిలబడ్డాడు. ఐతే గద్దలాగా చూపులను మాత్రం ప్రసరింపజేస్తూనే వున్నాడు. చివరకు అంతా సద్దుమణిగింది. అడుక్కునే వాళ్లందరూ ఎటెటో వెళ్ళిపోయారు. కొత్తవాళ్ళు ఎవరూ రాలేదు.

మురారి కదిలాడు. అకస్మాత్తుగా అతని మనసు తేలికపడింది. 'అబ్బే అది నిజం అయివుండదు. శంకర్రావు ఎవర్ని చూసి ఎవరనుకున్నాడో ఛీఛీ దాన్ని తాను నమ్మడం, మనసు చెడగొట్టుకోడం, పిచ్చెక్కినవాడిలా ఇలా తిరగడం, అబ్బే. అంతా వెర్రిగా ఉంది...' అనుకున్నాడు.

"ఎంతయినా తన తల్లి... ఛీఛీ... అలా పరువుతక్కువగా, ఏం తక్కువైందని... తిండి లేకనా, తిప్పలు లేకనా... అబ్బే, ఖచ్చితంగా శంకర్రావు పొరబడ్డాడు అందులో సందేహం ఏ మాత్రమూ లేదు...."

మురారి గబగబ ఇంటివైపు నడిచాడు. బ్రిడ్జిదాటి రోడ్డుదాటి సందుగొందులు గడిచి చివరగా ఉన్న తమ ఇంటికేసి విసవిస నడిచాడు.

వీధి గుమ్మం దాటి ఆవరణలో అడుగుపెట్టినవాడు అలాగే కొయ్యబారిపోయాడు.

వరండా చివర ఒక పెట్రోమాక్సు లైటు వెలుగుతున్నది. తన భార్యా, పిల్లలూ, చుట్టుపక్కలవారు కొందరు పంచలో కూర్చుని వున్నారు, అందరూ నిశ్శబ్దంగా వున్నారు. అతన్ని చూస్తూనే కళ్ళనీళ్లతో ఎదురువచ్చింది భార్య. ఆమె వెనకనే పిల్లలు...

ఆవరణలో ఒక పక్క గోడవారగా చింకిచాప మీద పడివుంది తల్లి దేహం... తలవైపు చిన్న దీపం.

మురారి గొల్లుమన్నాడు. కూలబడ్డాడు.

ఎవరో వచ్చి "ఎవరెవరు రావాలి?" అని అడిగారు.

"ఎవరు రావాలి?... ఎవరొస్తారు...? వచ్చేవారెవరున్నారు? ఆఁ! ఒక మేనమామ ఉన్నాడు. ఆయన అడ్రసిస్తాను.... ఒక టెలిగ్రాం ఇస్తే చాలు"

ఆ రాత్రి బాగా పొద్దుపోయిన తర్వాత మురారి రెండోకొడుకు తమ పక్కగదిలో మంచం కింద ఉన్న మామ్మ ట్రంకుపెట్టె ఇవతలికి లాగాడు. అది బాగా ., దానికున్న చిన్నతాళం పగలకొట్టి మూత తీశాడు.

లోపల ఏవేవో పూజ పుస్తకాలు, వ్రత గ్రంధాలు, పాత జాబులు, ఒక పాత ఫోటో.... యాభై ఏళ్ళ నాటి గుంటూరు ఏ సి. కాలేజీ ఎఫ్. ఏ. విద్యార్థుల గ్రూప్ ఫోటో.... చిల్లులు పడిపోయి.... ఒక పక్కని మూడు మూటలున్నాయి.

అతడు ఉత్కంఠతో విప్పిచూశాడు. తర్వాత "నాన్నా" అని పిలిచాడు మెల్లిగా.

మురారి... భార్య... మిగిలిన పిల్లలూ లోపలికి వచ్చారు. మురారి కొయ్యబారిపోయాడు.

ఎదురుగా పెద్దకుప్పగా నాణేలు పోగుపడివున్నాయి. అన్నీ అయిదులూ పదులూ, రెండు... మూడుపైసల బిళ్ళలు... మురారికి దుఃఖం పొంగివచ్చింది.

# లిక్కర్ గాంధీ

అతడు ఎంత హడావిడిగా కోలాహలంగా వచ్చాడో అంత హడావిడిగానూ కోలాహలంగానూ వెళ్ళిపోయాడు. వెళ్ళిపోతూ 'వొస్తా... మళ్ళీ కబురు పంపిస్తాను. కరపత్రం పంపిస్తాను. నువ్వు మాత్రం తప్పకుండా రావాలి సుమా' అన్నాడు. ఒక కారులో అతడు, అతని వెంట ఆ కవయిత్రీ, వెంట మరి రెండు కార్లలో అతని అనుచర వందిమాగధ గణమూ వెళ్ళిపోయారు. తుఫాను కురిసి వెలిసినట్టుకాదు, సుడిగాలి వీచి ఆగినట్టు అనిపించింది.

అతను ఉన్నది అయిదు నిముషాలే... అంతలో వంద మాటలు మాట్లాడాడు. మొదట చిన్ననాటి సంగతి, ఎప్పటిదో దాదాపు యాభై ఏళ్లనాటిది గుర్తు చేశాడు. 'ఫస్టు ఫారంలో నేనూ, నువ్వూ క్లాసుమేట్స్... సహాధ్యాయులం... ఒకే బల్ల మీద కూర్చునే వాళ్లం' అని మొదలుపెట్టాడు. నన్ను గురించీ, నా రచనా వ్యాసంగం గురించీ అప్పుడప్పుడు తెలుసుకుంటూనే ఉన్నానని కూడా అన్నాడు. మేమిద్దరమూ కలుసుకోకపోయినా నన్ను గురించి విన్నప్పుడల్లా తాను చాలా సంతోషించాననీ అన్నాడు. ఆ హడావిడీ గందరగోళమూ సద్దుమణిగిన తర్వాత వరండాలో కుర్చీలో కూలబడి అన్నీ గుర్తు చేసుకున్నాను.

అవును. ఇతని పేరు గాంధీ... పూర్తి పేరు (ఇంటి పేరు కాక) మోహన్‌దాస్ కరమ్‌చంద్ గాంధీయే. తల్లి కడుపులో ఉండగా ఇతని తండ్రి అతడు చేస్తున్న చక్కని ఉద్యోగమూ, ఉన్న కొద్దిపాటి ఆస్తిపాస్తులూ వొదిలేసి స్వాతంత్ర్య సమరంలో తలమునకలుగా దూకేసి, జైళ్లపాలై ఎక్కడో దక్షిణాది మారుమూల జైల్లో చచ్చిపోయాడు. అతని కోరిక ప్రకారం మగబిడ్డ కలిగాడు కాబట్టి వీడు గాంధీ అయినాడు. ఆడబిడ్డగా పుట్టి ఉంటే 'స్వరాజ్యలక్ష్మి' అయి ఉండేది. ఇతని చిన్నతనం అంతా మాతామహుల ఇళ్లలో గడిచింది. చదువులో అంతంతమాత్రం... మిగిలిన విషయాల్లో మాత్రం మహా చురుకు. పాదరసం లాటి బుద్ధి. ఆ వయసులోని వాడి బుద్ధి అమోఘంగా వికసించింది. నాకు తర్వాతి కాలంలో కానీ వాడి ప్రత్యేకత అర్థం కాలేదు. వాడు ఆ వయస్సులోనే చాలా తరచుగా లాటరీలు నిర్వహించేవాడు. బజారులో ఆనాడు ఒక ఊట కలం, సాదా రకం అయితే అరణాలు. వాడు అరణాలు పెట్టి కలం కొని దాన్ని అందరికీ చూపించి తెల్లకాగితం ముక్కల మీద నెంబర్లు వేసి ఒక్కొక్క టిక్కెట్టు అణావంతున పది పన్నెండు మందికి అమ్మేవాడు. 'పెన్ను వొస్తుంది' అన్న ఆశతో ఆ పది పన్నెండు మందీ టిక్కెట్లు కొనేవారు. అనుకున్న నాటికి అనుకున్న చోట అనుకున్న ప్రకారం పరమ నిజాయితీగా

అందరిముందూ ఏ పసిపిల్లవాడి చేతనో లాటరీ తీయించి, ఒక అదృష్టవంతుడికి ఆ కలం ఇచ్చేవాడు. ఇలా కలాలే కాకుండా ఇతర అనేక వస్తువులు లాటరీ వేసేవాడు. మొత్తం మీద ఆనాడే వాడిది అమోఘమైన 'వాణిజ్య బుర్ర'. తర్వాతి కాలంలో మే మిద్దరమూ విడిపోయి, ఊళ్లు వేరై, సంబంధాలు లేకపోయినా ఇన్నేళ్ల తర్వాత తనకు తానుగా వచ్చి నాకు 'సభా గౌరవం' కలిగించే ప్రయత్నం చేశాడు. అదీ చిత్రం!

కొన్నేళ్లుగా 'లిక్కర్ గాంధీ' అనే ప్రశస్తమైన పేరు అందరితోపాటు నేనూ వింటూ వచ్చానే కాని అది వీడేనని ఇప్పుడే తెలిసింది. ఇప్పుడు అంతా విశదం... ఆ చిన్ననాటి లాటరీ బుద్ధి వీణ్ణి జీవితంలో ఎన్నో మెట్లు పైకి ఎక్కించింది. చదువుల తల్లి కటాక్షించకపోయినా కనకమహాలక్ష్మమ్మ గారు మాత్రం వాణ్ణి పూరాగా కటాక్షించింది. మొదట్లో ఏవో చిన్న చిన్న వ్యాపారాలు కొద్దికాలం పాటు చేసినట్టున్నాడు. అంతలో దేశంలో విజృంభించిన దొంగనోట్ల వ్యవహారంలో వేలు పెట్టి లబ్ధిపొందాడు. ఒక పర్యాయం కొంతమేరకు ఆ లక్ష్మీదేవి కటాక్షం ప్రసరిస్తే ఇక ఆవిడ దయాపూర్వ దృష్టికి అంతు ఉండదు. అలా అలా భూములూ, పుట్రలూ కొన్నాడు. రాజధానీ నగరంలో అప్పటికి అంతగా గిరాకీలేని చోటులుకొని ప్లాటులు వేశాడు. కంట్రాక్టులు చేశాడు. కాంట్రాక్టులు చేయించాడు. చీటీల కంపెనీలు పెట్టాడు. ఫైనాన్సింగ్ వంటివి నడిపాడు. పెద్దలతో అధికారవర్గం వారితో రాజకీయ ప్రముఖులతో పరిచయాలు పెంచుకుని లావాదేవీలు నడిపాడు. రక్షకభట ప్రముఖులతో ప్రత్యేక సాన్నిహిత్యం ఏర్పరుచుకున్నాడు. పైనున్న వారికి ఎవరెవరికి ఏమేమికావాలో అన్నీ సరఫరా చేశాడు. ఏ పిచ్చి ఉన్నవారికి ఆ వైద్యం చేశాడు. ఒకటి రెండు కుంభకోణాల్లో, గొడవల్లో చిక్కుకున్నాడు కాని పెద్ద ప్రమాదం ఏమీ జరగకుండా తప్పించుకున్నాడు. రాజకీయ పార్టీలన్నింటికీ పరమ సమదృష్టితో భూరి విరాళాలిచ్చి ఏ పార్టీ అధికారానికి వచ్చినా అట్టే ఇబ్బంది లేకుండానే సుఖంగా ఉంటూ వచ్చాడు. అప్పుడెప్పుడో ప్రొహిబిషన్ ఎత్తేస్తే తర్వాత దాదాపు పాతికేళ్లపాటు 'మద్యరంగం'లోకి దిగి చెలరేగిపోయాడు. ఆ వ్యాపారం పెద్ద ఎత్తున మూడు పూవులు ఆరు కాయలుగా అభివృద్ధి చెందింది.

ఇటీవల 'సారా నిషేధం' తర్వాత చాటుగా వ్యాపారం మరింత వృద్ధి చేశాడు. అది 'వంద ప్యాకెట్లు వేయి రూపాయలు'గా అభివృద్ధి చెందింది. అదే సమయంలో 'చీఫ్ లిక్కర్ పేరుతో బాహాటంగానూ తన వ్యాపారం కొనసాగించాడు.

నేడు 'సంపూర్ణ మద్య నిషేధం' తర్వాత చాటుగానే అయితేనేమి మద్యం మరింత ముమ్మరం చేశాడు.

ఇందాక బయట కారుదిగి వీధి గుమ్మంలో నుంచి వొస్తుంటే ముందు గుర్తు పట్టలేకపోయాను. పొట్టి అయితేనేమి బుర్ర మహా గట్టిది.

ఇప్పుడు –

"ఎవరా వొచ్చింది?" అంటూ వచ్చింది మా ఆవిడ.

'లిక్కర్ గాంధీ' అనేశాను తడుముకోకుండా.

"అంటే?"

"అంటేనా? ఒక వ్యాపారస్తుడులే!' అని సర్దుకున్నాను.

"ఏమిటట?"

"చూశావు కదా? ఆ నల్లని పొట్టివాడు గాంధీ. చిన్నప్పటి క్లాసుమేటు. అబ్బో! నలభై ఏళ్లనాటి సంగతిలే. అతని వెంట వచ్చిన చిన్నది ఒక రాజకీయ ప్రముఖుడి కూతురు. ఆమె కవిత్వం రాస్తుందిట. ఇప్పుడే కాదు చాలా చిన్నతనం నుంచి రాస్తున్నదిట. కవిత్వం ఆమె ఊపిరిట. ఆమె కవిత్వం పుస్తకంగా అచ్చు వేశారు. ఆ పాటలు కాసెట్స్ కూడా తయారయ్యాయట. అన్నీ రేపు ఆదివారంనాడు ఆవిష్కరిస్తారు. మంత్రులూ, పెద్ద పెద్ద ప్రముఖులూ, పోలీసాఫీసర్లు పేరు మోసిన ఇతరులూ, కొందరు మహా కవులు వస్తారుట!"

"మరి మీ రెందుకు?"

"ఉత్సవ విగ్రహాలుంటాయి చూడు- అలాటి పాత్ర మనది. వేదిక నలంకరించిన వారందరికీ దండలు వేయిస్తారు. వేరు వేరు వ్యక్తుల చేత... ముఖ్య అతిథి అయిన కుర్ర మంత్రిగారికి దండవేసే అదృష్టం మనకు కలగజేస్తున్నా రన్నమాట. సన్మాన పత్రం కూడా నేనే చదవాలిట. అలా అందరికీ విడివిడిగా దండలు వేయటానికీ, పుష్పగుచ్ఛాలు అందించడానికీ మనుషులను మాట్లాడు కున్నారట. ఈ బాపతు వారు కూడా కాస్త పేరు గడించినవారై ఉంటే బాగుంటుందనే సత్సంకల్పంతో ఆయన మన దగ్గరికి వేంచేశాడు. నలుగురి దృష్టిలో పడేందుకూ, పేపర్లో పేరు అచ్చయ్యేందుకూ మనకు చక్కని అవకాశం కల్పిస్తున్నాడు పాపం!"

నేను మాట్లాడుతూనే ఉన్నాను.

ఆవిడ "సదే సంబడం" అంటూ లేచి లోపలికి వెళ్లిపోయింది.

ఆ రోజు... ఆదివారం. ఊరంతా ఒక విధమైన సందడి. రైల్వే స్టేషన్ నుంచి ప్రారంభమై ఉరంతా బ్యానర్లు వగైరాలతో హడావిడిగా ఉంది.

సాయంకాలం ఆ హాలుకు అన్ని వైపులా ఫర్లాంగు దూరం నుంచి పోలీసుల పహరా. హాలు హాలంతా దూరానికి దీపాలదండలతో దగద్ధగాయమానంగా కుబేర భవనంలా వెలిగిపోతున్నది. సరిగ్గా పోలీసు అధికారి కారు వచ్చే నిముషానికి అడ్డం వెళ్లానేమో నన్నొక పోలీసువాడు గద్దించి 'అగు' అన్నాడు. ఆ తర్వాత అలా చాలాసేపు కార్లు వస్తూనే ఉన్నాయి. నేనలా నిలబడే ఉండిపోయాను. చాలాసేపు గడిచింది. పూలరథాల్లాటి కార్లు చాలా ఉన్నాయి. ఆవరణలో నిలిచాయి. అతి ఖరీదైన మనుషులు - రాజకీయులు, అధికారులు, స్తోత్ర పాఠకులు, వందిమాగదులు, కవిజనమూ తళతళలాడుతూ బిలబిలలాడుతూ లోపలికి వెళ్లారు. ఆవరణ అంతా చిరునవ్వులు, పలకరింపులు, కరచాలనాలు, కౌగిలింతలు, నవ్వులు, కేరింతలతో పగలబడిపోయింది.

కార్యక్రమం మొదలైన తర్వాత నెమ్మదిగా నడిచి చివరి గుమ్మంలో నిలబడ్డాను నేను. వేదిక స్వర్గధామంలాగున్నది. ఖరీదైన షోకీలా కుర్చీలలో రకరకాల వారు ఆసీనులై ఉన్నారు. ఒకటి తర్వాత ఒకటిగా సన్మాన పత్రాలు, స్తోత్రపాఠాలు, దండధారణలు జరిగిపోతున్నాయి. తర్వాత పేరుమోసిన మహాకవులిద్దరు ముగ్గురు తమలోతాము పోటీ పడుతూ ఆ చిన్నదాని కవిత్వంలోని అందచందాలను ఏకరవు పెట్టారు. 'నా ముందు వారు చెప్పినట్టుగా' అంటూ మొదలు పెట్టారు. 'నా మనసు ఆకాశం' అనడంలోని గొప్పదనం, 'నా మనసు ఎడారి' అనడంలోని ఔచిత్యం, 'నా కనురెప్పల సముద్రాలలో' అనడంలోని భావశబలత, వైవిధ్యం ఇలా చెలరేగిపోయి మాట్లాడారు. తర్వాత ఆ చిన్నదానికి 'ఘెల్లున' సన్మానం జరిగింది.

సన్మానం తర్వాత వేదిక ఖాళీ చేయించి అక్కడివారిని హాలు ముందు సీట్లలోకి బదలాయించారు. వేదిక నిండా రకరకాల జంత్రవాద్యాలు అమర్చుకుని గాయనీ గాయకులు మైకులు చేతబుచ్చుకుని ఊగుతూ తూగుతూ ఆ కవయిత్రి పాటలను శ్రోతల గుండెలు చెదిరే ధ్వనితో ఆలపించారు.

అంతవరకు దూరంగా నిలబడి ఉండి నే నిక ఆవులించి వెనుదిరిగి ఇవతలకి వచ్చి ఇంటికి చేరుకున్నాను.

మా ఆవిడ అదోక రకంగా నవ్వుతూ "భోజనానికి రండి" అన్నది. అంతే - మరునాడు ఉదయమే మళ్లీ అయిదారు కార్లు వచ్చి ఇంటిముందు ఆగాయి. గాంధీ లోపలికి వచ్చి ఆందోళనతో "ఎలా ఉంది వొంట్లో?" అని అడిగాడు.

నేను నివ్వెరపోయి చూశాను.

"విరోచనాలటగా... ఊరికే ఇంట్లోకీ లావెట్రీలోకీ క్రికెట్ పిచ్ మీదలాగా రన్స్ తీశావుట. మనిషిని కారిచ్చిపంపితే మీ ఆవిడ అలా అని చెప్పిందటలే. బాగా నీరసించి ఉంటావు. లేకపోతే అంత ఫంక్షనుకు రాకుండా ఉండగలవా? ఫంక్షను అదిరిపోయిందనుకో. చాలామంది తమ అనుభవంలో ఇలాటిది చూడలేదన్నారు. నువ్వూ వొచ్చి ఉంటే బాగుండేది. మంత్రిగారి దృష్టిలో పడి ఉండేవాడివి."

అతడు తర్వాత కొంచెం గొంతు తగ్గించి "ఈసారి రాబోయే ఎన్నికల్లో మనకు టిక్కెట్ రావడం ఖాయం. గెలవడమూ ఖాయమే. ఆ తర్వాత ఎటుదిరిగీ ఏ మంత్రి పదవో తప్పదు." అన్నాడు.

ఆ తర్వాత అతను పైకి చెప్పని అతని మనసులోని మాట మనకు తెలుసు. 'లేకపోతే... ఆ కుర్రకుంక కవిత్వం కోసం ఇంత ఖర్చు పెడతానా?' అని.

"సరే వెళ్లొస్తాను. ఆరోగ్యం జాగ్రత్తగా చూసుకో" అంటూ నన్ను నోరెత్తినివ్వకుండా గడగడ మాట్లాడేసి అంత వేగంగానూ వెళ్లిపోయాడు. కార్లు వేగంగా కదిలి వెళ్లిపోయాయి.

మా ఆవిడ గల గల నవ్వింది గుమ్మంలో నిలబడి ఉండి-

"ఏమి టిదంతా?" అన్నాను.

ఆమె నవ్వుతూనే "అవును... మీరు వెళ్లాక కారులో ఎవరో వొచ్చారు. మీ రక్కడికి వెళ్లారని తెలుసుగా నాకు. అందుకని అలా నేనే చెప్పాను. ఒకవేళ వెళ్లినా వేదిక ఎక్కరనీ, ఏదో ఒక మూల నిలబడి వొస్తారనీ నాకు బాగా తెలుసు" అన్నది.

నవ్వొచ్చింది. కుర్చీలో వెనక్కు వాలాను.

# గుండెలో పాము

'ఈ పట్టికలో లేని పదార్థముల రేట్లు కౌంటర్‌లో అడిగి తెలుసుకోవలెను.'

కళ్ళజోడు తీసి పైపంచెతో తుడుచుకుని ముఖానికి తగిలించుకుని చూశాడు చలపతి. 'అయితే పై లిస్టులో అరిసె అనే పదార్థం లేదు కదా, వెళ్ళి కౌంటర్‌లో అడగాలా' అనుకున్నాడు.

తర్వాత చాలాసేపటికి టైపు మెషీను ముందు కూలబడి పై వాక్యాన్ని రెండు మూడు సార్లు కొట్టాడు. విషయం అదే. అయితే, ఇంగ్లీషు అక్షరాలు. ఎగుడు దిగుడుగా అసహ్యంగా.

తాను ఆ వాక్యం ఎందుకు కొట్టినట్టు?

ఇప్పుడు ఏమీ తోచడం లేదు. ఎదురుగా పాతకాలపు టైపు మెషీను మొద్దులాగా నీరసంగా పడి ఉంది. పక్కనే తెల్ల కాగితాలు, అవి గాలికెగిరిపోకుండా పైన ఒక ఎర్రని రాయి, ఏమీ తోచక మతిచెడినవాడిలా పై మాటలు కొట్టాడన్నమాట.

శ్రీనివాసు వచ్చాడు. లోపల ఉన్న నాలుగైదు ఆఫీసులలో ఒక దానిలో గుమస్తా. వస్తూనే చలపతి పక్కనే కూలబడి బీడి ముట్టించి "మా బాస్‌గాడు టాయ్‌లెట్‌కని వెళ్ళాడు. నాకు పావుగంటసేపు ఫ్రీడం" అన్నాడు నవ్వుతూ.

అంతలోనే మళ్ళీ "చచ్చిపోతున్నాం వీడితో ఊపిరి సలుపుకోనివ్వడు. ఆఫీసుకు వొచ్చినప్పటి నుంచీ ఉరుకులు పరుగులూ" అని అంగలార్చాడు.

"ఊఁ" అన్నాడు చలపతి. మరేమీ మాట్లాడలేదు. ఎర్రనిరాళ్ళ కట్టడం. ఎప్పుడో బ్రిటిష్‌వారి కాలంనాటిది. దాన్లో రెండు మూడు రకాల ఆఫీసులు. ఒక కోర్టు వగైరా. చుట్టూ వరండా. ఎదురుగానూ, ఇరుపక్కలా పెద్ద పెద్ద చింతచెట్లు.

వేసవికాలపు గాలి విసురుగా వీస్తున్నది.

వరండాలో చివరగా కొత్త టైపు మెషీను పెట్టుకుని క్షణం తీరక లేకుండా పని చేసుకుంటూ ఉంటాడు సుందరం. ఎంత చేసినా అతని పని తెమలదు. నిమిషానికొక ప్లీడరు గుమస్తానో, మరొకడో కాయితాలు కట్టలుగా తెచ్చి అతని పక్కన పడేసి 'అర్జంటు... తొందరగా కొట్టు, అని చెప్పిపోతూ ఉంటారు.

అతడు చక్కగా చిరునవ్వు నవ్వుతూ 'అట్లాగే' అంటూ అందుకుని ఒక పక్కన పడేస్తాడు. అతని చేతివేళ్ళు పరమ చాకచక్యంగా టైపు మెషీను మీద కదులుతూ ఉంటాయి. కొత్త ఖరీదైన మెషీను. అందువల్ల దాని ధ్వని కూడా చాలా అందంగా వీనులవిందుగా ఉంటుంది.

సుందరం కూడా చలపతిలాగానే ఉదయం తొమ్మిదింటికల్లా రిక్షాలో టైపు మెషినుతో, చిన్న చాపతో దిగి తన మామూలు చోట స్థిరపడిపోతాడు. చాప పరుచుకుని మెషిను ముందు పెట్టుకుని కూర్చున్నాడంటే ఇక ఎప్పుడో తప్ప లేచే పని ఉండదు.

కుప్పలు కుప్పలుగా కాగితాలు వచ్చి పడిపోతుంటాయి. దేన్నీ కాదనడు. ఇక్కడ కూలబడిన వాడు లేవకుండా రోజంతా కట్టలు కట్టలు కాగితాలు టైపు చేస్తాడా, అది చాలక మిగిలిన వాటిని కట్టకట్టి ఇంటికి తీసుకుపోతాడు. ఇంట్లోనూ అదే పని. పెళ్ళీ పెటాకులు, పెళ్ళాం పిల్లలూ వంటి జంజాటం లేదు మరి.

చలపతికి ఒళ్ళు మండిపోతూ ఉంటుంది.

కాగితాలు ఇచ్చి నిలబడ్డ తన చేతిలోకి ప్లీడరు గుమస్తా పరమ నిర్లక్ష్యంగా రూపాయి బిళ్ళ విసిరివేశాడు.

'నేను ఒక్కణ్ణీ ఇంతపని చేయలేను. కాసిని కాగితాలు చలపతిగారికివ్వండి' అని చెప్పవచ్చుగా? చెప్పడు. బొత్తిగా స్వార్థపరుడు. దుర్మార్గుడు.

తానేమో ఇవతల పనిలేక గోళ్ళు గిల్లుకుంటూ కూర్చోవడం.

వాడేమో పని ఎక్కువై సతమతం అవుతుండటం. ఇదీ తంతు.

చలపతి తేరుకుని చూసేసరికి శ్రీనివాసు లేడు. పిచ్చుకలు రెండు అటూ ఇటూ ఎగురుతూ గోల చేస్తున్నాయి.

ఇవాళ ఇంట్లో ఉదయమే గోల.

సీతమ్మ 'బియ్యం రెండు మూడు రోజులకు సరిపడా ఉన్నాయంతే' అన్నది తాను బయలుదేరుతూ ఉండగా.

తండ్రి డెబ్బయ్ ఏళ్ళవాడు వాకిటి గదిలో మంచంలో పడుకుని ఉండి 'నా ముక్కుపొడుం' అన్నాడు.

బుజ్జమ్మ బండెడు బరువున్న పుస్తకాల సంచి భుజానికి తగిలించుకుని స్కూలుకు బయలుదేరుతున్నది. ఏదో అడగబోయింది. కాని, అంతలో ఏమనుకున్నదో ఏమో మానుకుని నిశ్శబ్దంగా నడిచి వెళ్ళిపోయింది. తాను ఉస్సురని నిట్టూర్చి రిక్షా ఎక్కాడు.

ఇవాళే కాదు ఇటీవల రోజూ ఇలాగే ఉంటున్నది. ప్రస్తుతం తనకు రోజులు బాగున్నట్టు లేదు. గ్రహస్థితి అనుకూలంగా ఉన్నట్టు లేదు.

ఆరు నెలల క్రిందటి పరిస్థితి వేరు. మొత్తం ఆవరణ అంతటికీ తానొక్కడే టైపిస్టు. అటు కోర్టుపని కానీ, ఇటు రిజిస్ట్రారు ఆఫీసు పని కానీ అంతా తన ఒక్కడికే వచ్చేది.

చేసినంత పని హాయిగా అలవోకగా చేసి మిగిలినది ఇంటికి పట్టుకువెళ్ళి తీరిగ్గా చేసేవాడు. పేజీ టైపు చేస్తే రూపాయి. కొన్నాళ్ళాగి రేటు పెంచుదామని కూడా అనుకునేవాడు అప్పుడప్పుడు. రోజుకు యాభై అరవై రూపాయలు

కళ్ళజూసేవాడు. నిరంతరం సంతుష్టిగా ఉండేవాడు. పనిలో ఉన్నా 'అరగంట' కొకసారి టైపు మెషిను ముందు నుంచి లేచేవాడు. అప్పుడప్పుడు అటు ఇటూ పచార్లు చేసేవాడు. అయిదారుసార్లు బైటికి వెళ్ళి జర్దా కిళ్ళీలు కట్టించుకుని నవులుతూ ఉండేవాడు.

ఎవరైనా 'తప్పులు కొడుతున్నావయ్యా' అంటే వారిమీద ఎగిరిపడేవాడు. పెద్దనోరు చేసి మాట్లాడేవాడు. తనకు పోటీలేదని గర్వంతో మాట్లాడేవాడు. అంతలో ఎవరికే బుద్ధి పుట్టిందో, ఏమో తెలియదు. పరిస్థితి ఒక్క రోజులో మారిపోయింది ఆనాడు....

తాను ఆ భవంతి వరండాలో చాప పరుచుకని టైపు మెషిను అమర్చుకుని కాస్సేపు అటూ ఇటూ పచార్లు చేసి, కిందటి రోజు నిలవుండిన రెండు కాగితాలు టైపు చేసి సిద్ధం చేశాడు. వాటిని తీసుకునేందుకు రావలసిన ప్లీడరు గుమస్తా ఎంతకీ రాలేదు.

తానే వెళ్ళి కాగితాలు ఇచ్చి నిలబడ్డాడు.

గుమస్తా పరమ నిర్లక్ష్యంగా రూపాయి బిళ్ళ చేతిలోకి విసిరివేశాడు.

తర్వాత ఇవతలకి వస్తే చెవులకు ప్రమాదకరమైన ఒక టైపు మెషిను సవ్వడి వినిపించింది. తన మొద్దు మెషిను చప్పుడు వంటిది కాదు అది. వినసొంపుగా ఉంది.

వెళ్ళి చూసేసరికి ఎర్రగా - పొడవుగా ఉన్న - ఈ సుందరం స్థిరపడిపోయి ఉన్నాడు. చూపు ఎటూ మరల్చకుండా చకచక టైపు చేసుకొంటూన్నాడు. పక్కనే కాగితాలు కట్టలుగా పడి ఉన్నాయి. ఏమీ తెలియకుండా ఏదో కుట్ర జరిగిపోయింది. నానోట్లో మట్టి పడడం ఆనాడే మొదలయింది. వీడు, సుందరం, మహా మర్యాదగా ఉంటాడు. పరమ, నెమ్మదిగా మాట్లాడతాడు. ఎప్పుడూ చిరునవ్వు నవ్వుతూ ఉంటాడు. తనకు పోటీగా వచ్చిపడి తన పని అంతా కాజేసి, తన సంపాదన అంతా కొట్టేసి నిక్షేపంగా స్థిరపడిపోయాడు.

తనకు పనిలేదు. వెళ్ళి వారినీ వీరినీ అడిగితే కూడా ప్రయోజనం లేకపోయింది. 'నీ డొక్కు మెషినూ నువ్వూ, నీ తప్పులూ, అక్కర్లేదు మాకు' అని విరసంగా సమాధానం కూడా వచ్చింది.

రోజుకు యాభై అరవై రూపాయలుండిన సంపాదన ఇప్పుడు అయిదు పది రూపాయలలోకి దిగింది.

అన్‌సీజన్‌లో అయితే అదీ లేదు. మహా అయితే రిక్షా బాడుగ గిట్టుబాటు అవుతున్నది. అంతే



చలపతి లేచాడు.

'అనవసరంగా కూర్చోడం ఎందుకు' అనిపించింది.

రెండు గంటలు దాటుతున్నది.

వెచ్చని గాలి విసురుగా వీస్తున్నది.

ఊరికి దూరంగా ఉన్న పాతకాలపు పెద్ద కట్టడం కావడంతో విసురు గాలికి అడ్డే ఉండదు. లోపల ఆఫీసు గదులలో, హాళ్ళలో మాత్రం పెద్ద పెద్ద గుడ్డ పంఖాలున్నాయి.

మరికొన్ని చోట్ల పెద్ద పెద్ద ఫ్యానులు, కిటికీలకు, గుమ్మాలకు వట్టివేళ్ళ తడికెలూ.

అంతా హాయిగానే ఉంటుంది.

బైట మాత్రం కొలిమి మీద నుంచి వస్తున్నట్టు వేడిగాలి.

చలపతి వరండాలోకి నడిచి వెళ్ళాడు. సుందరం చేతిలో పని ముగిసిందేమో తీరుబడిగా గోడకానుకుని కూర్చుని ఉన్నాడు.

చలపతిని చూసి పలకరింపుగా నవ్వాడు.

చలపతి మునివేళ్ళతో గడ్డం తడువుకున్నాడు.

"బొత్తిగా విశ్రాంతి లేకుండా పోయింది బతుక్కి" అన్నాడు.

సుందరం అదో రకంగా నవ్వి "మరే" అన్నాడు.

"ఏమిటలా ఉన్నారు?"

"మా అమ్మగారికి బొత్తిగా బాగులేదు" అని చెప్పాడు సుందరం మ్లానంగా నవ్వి.

"ప్చ్... పాపం... ఎంత ఉంటుందేమిటి వయసు?"

"అరవైకి కొంచెం అటూ ఇటూ."

"పెద్ద వయసే అన్నమాట" అన్నాడు చలపతి

లోలోపల "చస్తే వదిలిపోతుంది పీడ – కొన్నాళ్ళ పాటయినా" అనుకున్నాడు.

సుందరం కళ్ళు చెమ్మగిల్లాయి.

"నా చిన్నతనంలోనే మా నాన్నగారు పోతే నన్ను అష్టకష్టాలు పడి పెంచింది. తిన్నదో, పస్తులున్నదో తెలియదు. నన్ను ఈ మాత్రపువాణ్ణి చేసింది" అన్నాడు గద్గదికంగా.

వెర్రిగాలి వీస్తున్నది.

చలపతి లోలోపల ఉడికిపోతూ 'రాస్కెల్, నాకు పోటీ వొచ్చి నా నోట్లో మన్ను కొట్టావు. నా కూట్లో మన్ను కొట్టావు. నువ్వు మాత్రం సుఖపడతావా? నిన్ను సుఖపడనిస్తానా' అనుకున్నాడు మళ్ళీ.

ఆ తర్వాత లేచి ఇవతలకు వస్తూ 'రేపో మాపో ఆ కొండ అవతల ఊళ్ళో ఉన్న భూతవైద్యుడి దగ్గరికి వెళ్తాను. నీ కాళ్ళూ చేతులూ చచ్చుబడిపోయేట్టు చేతబడి చేయిస్తాను. కాచుకో, అని కూడా అనుకున్నాడు.

సాయంకాలం యథావిధిగా రిక్షాలో టైపు మెషినుతో సహా ఇంటికి చేరుకున్నాడు చలపతి. మెషిను దింపించి రిక్షావాడికి డబ్బులిచ్చి పంపించి తలుపుతట్టాడు.

సీతమ్మ తలుపు తీసి జేవురించిన ముఖంతో, "వొచ్చారా, లోపలికి రండి. ముసలాయనకు మధ్యాహ్నం గుండెపోటు వచ్చింది. ఆస్పత్రిలో చేర్చాము. నేనూ ఇప్పుడే వొస్తున్నానింటికి" అన్నది హడావిడిగా.

"ఏమిటేమిటి? ఏం జరిగింది" అంటూ కంగారుపడిపోయాడు చలపతి.

"ముందు లోపలికి రండి" అంటూ సీతమ్మ అంతా వివరంగా చెప్పింది.

మధ్యాహ్నం కొంచెం ఆలస్యంగా ముసలాయన నాలుగు మెతుకులు తిని మామూలుగా ముందుగదిలో తన మంచంలో నడుం వాల్చాడు.

పది నిమిషాలలో ఏమయిందో ఏమో పెద్దగా మూలుగుతూ బాధతో గిలగిలలాడిపోతూ తన్నుకోవడం మొదలుపెట్టాడు.

సీతమ్మ గాభరా పడిపోయి అవతలి వాటాలో అద్దెకున్న వాళ్ళను పిలిచింది. మొత్తానికి అందరూ చేరి హడావిడిగా ఆయనను ఆస్పత్రికి తరలించారు. డాక్టర్లు అంత హడావిడిగానూ పరీక్షలన్నీ చేసి అత్యవసరమైన ఇంజక్షన్లు చేసి, 'ఇంటెన్సివ్ కేర్'లో ఉంచారు. పరిస్థితి ఇప్పుడంత ప్రమాదకరంగా లేదు కాని, మరో ఇరవై నాలుగు గంటలు గడిస్తే తప్ప గండం గడిచినట్టు కాదని చెప్పారు.

"మరి నాకు కబురు పంపకపోయావా" అన్నాడు చలపతి.

"అనే అనుకున్నాను. కానీ, ఎవర్ని పంపను ఆ ఊరి చివరికి? ఎవరున్నారు?"

చలపతి నంగిగా "మరి డబ్బు?" అన్నాడు నసుగుతూ.

"నాకూ కాళ్ళూ చేతులూ ఆడలేదు. ఏమీ తోచలేదు. తాయారమ్మ పిన్నిగారికి నా గాజులు రెండూ ఇచ్చి ఆపదకు అడ్డుపడమని అడిగాను. ఆమె ఎక్కడికో వెళ్ళి పదినిమిషాల్లో డబ్బు తెచ్చి ఇచ్చింది."

"ఎంత?"

"ఎనిమిది వందలు తెచ్చిపెట్టింది. నెలకు నూటికి ఎనిమిది రూపాయలు వడ్డీ... అయితేనేం? సమయానికి తెచ్చింది. అదే పదివేలు."

మొగుడూ పెళ్ళాలిద్దరూ కాఫీ తాగారు. సీతమ్మ లెక్క చెప్పింది.

"ఇప్పటికి మందులకు, ఇంజక్షన్లకు, ఏవేవో పరీక్షలకు మొత్త ఏడువందలు అయిపోయి, వందరూపాయలు మిగిలాయి. ఇక రెండు రోజుల తర్వాత ఆస్పత్రి వదిలి వచ్చేటప్పుడు మిగిలినవి చెల్లించుకోవాలి."

ఇలా సాగింది సీతమ్మ ధోరణి.

చలపతి ఆలోచనలో పడ్డాడు. 'సరిగ్గా ఆ సమయానికి తాను ఏం చేస్తున్నాడు? సుందరం ముందు కూర్చుని ఉన్నాడు. సుందరం తల్లి అనారోగ్యం

గురించి చెబుతూ ఉంటే తాను వింటున్నాడు. వింటూ ఆమె చచ్చిపోవాలని కోరుకుంటున్నాడు. అదీ కాకపోతే కొండ అవతల ఊళ్ళో భూతవైద్యుడి దగ్గరికి పోయి సుందరం కాళ్ళూ చేతులూ పడిపోయి పక్షవాతం వచ్చే విధంగా చేతబడి చేయిస్తే పీడ వొదిలిపోతుంది' అనుకుంటున్నాడు. తర్వాత చలపతి భార్యాసమేతంగా ఆస్పత్రికి వెళ్ళాడు.

ముసలాయన కోలుకున్నట్టే ఉన్నాడు. అయితే, మత్తుగా కళ్ళు మూసుకుని ఉన్నాడు.

డాక్టరు 'ఏమీ పరవాలేదు' అన్న తర్వాత రోడ్డు మీదకి వచ్చాడు.

అప్పటికి గాలి చల్లబడింది. సూర్యుడు తన తేజస్సును, వేడిమిని కోల్పోయి అస్తమిస్తున్నాడు.

చలపతికి ఒక సిగిరెట్టు కాల్చాలనిపించింది.

బడ్డీకొట్టు దగ్గర ఆగి సిగిరెట్టు తీసుకుని అక్కడి తాటితో ముట్టించుకుని నిలబడ్డాడు.

సుందరం నడిచివస్తూ పలకరించాడు నవ్వుతూ.

"మీ ఇల్లెక్కడో తెలియకపోయె. వొద్దామనుకున్నాను. నాకు సంవత్సరం కిందట రావలసిన ఉద్యోగం వొచ్చింది. ఇవాళే ఇంటికి ఆర్డరు వొచ్చింది. వైజాగులో పోస్టింగు. రేపు రాత్రికే ప్రయాణం" అని చెప్పాడు.

చలపతి ఉద్విగ్నుడై "ఏం ఉద్యోగం" అనడిగాడు.

సుందరం అంతా వివరంగా చెప్పాడు. "పెద్ద స్కేలు. సుఖమైన ఉద్యోగం. ఫ్రీక్వార్టర్సు... ఫోను."

చలపతి "మీ అమ్మగారి ఆరోగ్యం బాగులేదన్నావు" అన్నాడు.

"వొట్టి జ్వరమే... మధ్యాహ్నమే తగ్గిపోయింది. ఊరికే కంగారుపడ్డాను."

ఇద్దరూ ముందుకు నడిచారు.

సుందరం అంతలో "నాకు ఇక టైపు మెషినుతో పనిలేదు. అది మీకు ఇచ్చేస్తాను. ఊరికే కాదులెండి... ఖరీదుకే. మీ మెషిను పాతదైపోయింది. దాన్తో ఇక బాధపడలేరు మీరు. నెమ్మది మీద మీ వీలును బట్టి నెలకింత అని డబ్బు పంపించండి" అన్నాడు.

చలపతి వివశుడైపోయాడు. ఆశ్చర్యంతో, ఆనందంతో తల మునకలవుతూ నిలబడిపోయాడు.

"ఏం? మాట్లాడరేం" అన్నాడు సుందరం మళ్ళీ.

చలపతి గొంతు పూడుకుపోతుండగా "అలాగే... అలాగే... మీ ఋణం..." అంటూ ఉండగా సుందరం వారించి "అలాంటి పెద్ద పెద్ద మాటలు వొద్దు" అన్నాడు.

చలపతి ఆ రాత్రి భోజనం ముగించాక సీతమ్మ కూడా కాస్త ఎంగిలిపడి,

మామగారికి తోడుగా ఉండటం కోసం ఆస్పత్రికి వెళ్ళింది.

బుజ్జమ్మ అప్పటిదాకా చదువుకుని అప్పుడే పడుకుంది.

చలపతి మంచంలో వెల్లకిలా పడుకున్నాడు.

కాస్సేపటిలో బుజ్జమ్మ హఠాత్తుగా లేచి "ఏమిటి నాన్నా ఏడుస్తున్నావెందుకు" అని అడిగింది.

"ఏం లేదు... నువ్వు పడుకో" అన్నాడు చలపతి.



# అన్నదాతా సుఖీభవ

నేను ముకుందరావు ధోరణికి నివ్వెరపోయాను.

స్థలం... ముకుందరావుకు చెందిన విశాలమైన తోట చివర మేడపైన విశాలమైన గది... అతి ఖరీదైన ఫర్నిచర్ అన్ని వైపులా... గోడవారగా కిటికీ పక్కన వేలు వేల ఖరీదు చేసే దారుశిల్ప కళాఖండంలాటి పెద్దమంచం... చుట్టూ అందాల దోమతెర... క్రింద అంతటా రంగురంగుల రమణీయమైన తివాచీ... మెత్తగా మృదువుగా... గోడలకు కళ్లు చెదరగొట్టే అద్భుతమైన రంగులలో దేశదేశాలనుంచి సేకరించితెచ్చిన అపూరూప చిత్రాలు... గుండ్రంగా ఉన్న బల్లచుట్టూ మేము ముగ్గురం...

రాత్రిబాగా పొద్దుపోయినట్టున్నది. చుట్టుపక్కల చెట్లలోనుంచి సన్నగా పక్షుల ధ్వనులు...

నేనూ ముకుందం కాక మూడో వ్యక్తి పురుషోత్తం. దూరంగా ఎక్కడో బొకారో సిటీలో పెద్ద ఉద్యోగంలో ఉన్నాడు ప్రస్తుతం. వాళ్లిద్దరూ చాలాకాలం తరువాత నేటికి కలుసుకున్నారు. ఆనాడు ముకుందరావు పుట్టినరోజు. నేను చాలా సామాన్యుణ్ని. ఒక స్థానిక కళాశాలలో అధ్యాపకవృత్తి సాగిస్తున్నవాణ్ని. ఇంతకాలానికి బాల్యమిత్రుల ఆహ్వానం అందుకుని వచ్చాను.

ముకుందరావు చాలాసేపటినుంచి ఏకధాటిగా మాట్లాడుతున్నాడు. "అన్నట్టు రేపు ఫ్లయిట్‌లో ఢిల్లీ వెళ్ళాలి. ఈ ప్రయాణాలంటే మహా చిరాకు నాకు. కాని తప్పదుమరి... ఏం చేస్తాం?" అన్నాడు. అతగాడు ఢిల్లీ వెళ్లడం అంటే నాబోటివాడు పక్కవీథికి వెళ్లడం వంటిది. దేశంలోనే కాక ఏ రెణ్నెల్లకో ఒకసారి ఎటో ఒకవైపు ఫారిన్ ట్రిప్ తప్పదుమరి. అతని వ్యాపారాలు, లావాదేవీలు అటువంటివి.

అతను పక్కా అరగంటనుంచి రెండే విషయాలు మాట్లాడుతున్నాడు. 'మనదేశం ఎంతగా చెడిపోయింది? స్వాతంత్ర్యం వచ్చాక మనం ఎంతగా పతనమైపోయాము? జాతిపిత, అని పేరు పొందిన గాంధీ, నవభారత నిర్మాత అని పేరు పొందిన నెహ్రూలు దేశాన్ని, జాతినీ ఎలా దిశారహితంగా నడిపారో? ఇతర దేశాలతో పోల్చుకుంటే మనం ఎక్కడ ఉన్నాము?' ఇది అతని మొదటి బాధ. ఆ తర్వాత రెండవ బాధ ఎన్నడో పోయిన తన తండ్రిని గురించి. వారికి పిత్రార్జితమైన ఆస్తిపాస్తులు చాలా ఉండేవి. ఇతని తండ్రి స్వాతంత్ర్యాత్పూర్వం మద్రాసులో లా చదివాడు. స్వాతంత్ర్యోద్యమంలో చురుకుగా పాల్గొని జైళ్లపాలైనాడు. ఆ తర్వాత దేహీ అన్నవారికి లేదనకుండా, కాదనకుండా సహాయాలు చేశాడు. చేతికెముక లేనివాడని

ప్రసిద్ధి చెందాడు. అపర కర్ణుడనిపించుకున్నాడు. చివరకు ఉన్నదంతా కరిగించి వేసి భార్యను, పసివాడైన ముకుందాన్నీ వదిలేసి తన దోవన తాను పోయాడు.

ముకుందానికి తండ్రి అంటే కోపం... కసికూడా. 'దేశం దేశం' అని వెర్రిగా సమస్తం పోగొట్టుకున్న వాళ్లంటే లవలేశమైనా జాలి లేదతనికి. అంతా పాడుచేసి తనను పట్టించుకోలేదని అతని వేదన. అయితే తానుకూడా తక్కువేమీ తినలేదు. తన తండ్రిపేరు రకకాలుగా ఎక్కడ పడితే అక్కడ ఉపయోగించుకుని, 'వారి అబ్బాయివా?' అనిపించుకుని తాను ఎన్ని లాభాలు గడించాడో, ఎన్ని పర్మిట్లు లైసెన్సులు పొందాడో, ఎన్ని పదవులు ఆస్తులు సంపాదించాడో మాత్రం అతదు ఎవరికీ చెప్పడు. అంతా అతని సొంత ప్రయోజకత్వమే అని ఎదుటివారు అనుకోవాలని అతని నిరంతర తాపత్రయం. 'చిన్నప్పటినుంచీ అష్టకష్టాలు అనుభవించి కేవలం స్వయంకృషితో ఈస్థితికి చేరుకున్నాను' అంటూ ఉంటాడెపుడూ.

అయిందా−?

ఇపుడు పురుషోత్తం నిశ్శబ్దాన్ని ఛేదించాడు. ఒక్కసారి ఆవులించి చిటికె వేసి, "బాగుందయ్యా నీ ధోరణి... నీలాగ చాలామంది ఉన్నారు ఈ దేశంలో.. నీ సంగతి ఎంతో నయం. నీకు చొరవ ఉంది చిన్నప్పటినుంచీ. తెలివికలవాడివి... జాగ్రత్తపరుడివికూడా. ఆచితూచి అడుగువేస్తూ ఉంటావు. మరి కొందరున్నారు. పుట్టడమే ఎక్కడినుంచో ఏదేదో చేతబట్టుకు వచ్చినట్టు మాట్లాడుతూ ఉంటారు. తండ్రులు తమకు చెందవలసిన పిత్రార్జితాలన్నీ, దేశంకోసమో, ప్రజలకోసమో, పేదసాదలకోసమో, సంఘసంస్కరణలకోసమో వ్యయించి కడుపున. పుట్టిన సంతానానికి ఏమీ మిగల్చకుండా పోవడం... ఈ పిల్లలేమో నీలాగ తెలివిగలవాళ్లు కాక ఏదో పిచ్చి చదువులు చదివి ముష్టి ఉద్యోగాల్లో చేరి ఇరుకు బతుకులు బ్రతకడం... ఎండకన్నెరుగక షోయిగా జీవించవలసిన వాళ్లు అతి సాదాసీదా ఉద్యోగాలు, అరవచాకిరీ చేస్తూ చాలీ చాలని జీతపు రాళ్లతో బ్రతుకులు ఈడుస్తూ ఉంటారు. వాళ్ల సంగతి మరీ దారుణం..." అన్నాడు.

నేను కలుగచేసుకున్నాను.

"మా నాన్నగారు అలాగే చేశారు. అయినా నాకేమి చింత లేదు" అన్నాను. ముకుందం ముందుకు వంగి "ఏముండేది మీకు?" అని అడిగాడు.

"చాలా ఉండేది. ఫాతిక ఎకరాల సుక్షేత్రమైన మాగాణి... అయిదెకరాల మెట్ట ఉండేది. విరగపండే మామిడితోట ఉండేది. నాకు ఊహ తెలిసే సరికి అన్నీ కరిగిపోయాయి."

"మరి నీకు ఆ బాధ లేదా?"

"ఏ బాధ?"

"అదే.... మీ నాన్న నీకేమీ లేకుండా చేసిపోయాడే అన్నబాధ!"

నేను తల అడ్డంగా ఊపాను. "ఏమాత్రం లేదు... పొలాలూ తోటలూ దొడ్లూ పోతే పోనియ్... ఆయన స్వయంగా సంపాదించి సమకూర్చిపెట్టిన అపురూపమైన సంపద నాకు దక్కింది. అది చాలు అనుకున్నాను నేను!

"ఏమిటది?" అన్నారిద్దరూ ఆత్రంగా.

"పుస్తకాలు... వందల కొద్దీ అపూరమైన అలభ్యమైన పుస్తకాలతో మా నాన్నగారి గ్రంథభాండాగారం నాకు సంక్రమించింది. దానిముందు ఈ పొలాలూ, తోటలూ, దొడ్లూ, లక్షలూ ఎందుకు పనికొస్తాయి?" అన్నాను.

ఇద్దరూ కొంచెం ఆశ్చర్యపోయారు.

కొద్దిక్షణాలు నిశ్శబ్దం...

పురుషోత్తం ముకుందం వైపు తిరిగి "అన్నట్టు మరిచిపోయానింతసేపూ... ఇటీవల ఒక చిన్న అనుభవం... చెప్పాలని అనుకుంటున్నాను. చెప్పనా? వింటారా?" అన్నాడు.

ముకుందం మళ్ళీ ఆవులించి తల ఊపి ఆమోదం తెలిపాడు. అనుభవం అనగానే కాస్త ఉత్కంఠ కలిగించేదిగా రంజుగానే ఉంటుందని అనుకున్నట్టున్నాడు. నేను సహజంగానే వినడానికి ఉద్యుక్తుణ్ణయినాను. పురుషోత్తం గొంతు సర్దుకుని మొదలు పెట్టాడు. కిటికీలో నుంచి వినబడుతున్న కీచురాళ్ల ధ్వని మినహా... బయట ఏవేవో పురుగులు చేస్తున్న సవ్వడి మినహా... చుట్టూ నిశ్శబ్దం. గాలి విసురుకు కిటికీలకు, గుమ్మాలకు ఉన్న పలుచని తెరలు కదులుతున్నాయి. చాలా రోజుల క్రిందట... పురుషోత్తం ఉత్తరభారతంలో తాను ఉద్యోగం చేస్తున్న బొకారో సిటీనుంచి ఒక చిన్న సూట్‌కేసుతో బోలెడు డబ్బుతో ప్రయాణిస్తూ వచ్చాడు. ఒక క్షేత్రంలో స్టేషనులో దిగగానే కాసిని కాఫీనీళ్లు గొంతులో పోసుకుని ఇవతలికి వచ్చి 'ఏదో ఒక హోటలుకు పోనిమ్మ'ని రిక్షా మాట్లాడుకున్నాడు. తెల్లవారుజాము... చీకట్లు వచ్చిపోతున్నాయి. నగరం ఇంకా నిద్రలేవలేదు. జనసంచారం పలుచగా ఉంది. కాని, కాస్సేపాగితే ఈ రోడ్లు కిటకిటలాడుతూ పొగతో, దుమ్ముతో ఘోరంగా దుర్భరంగా తయారవుతాయి. ఈ లోపలే ఏదో ఒక మంచి హోటలుకు వెళ్లి బస చేస్తే మంచిదనుకున్నాడు. వెళ్తూవెళ్తూ ఒకచోట రిక్షా ఆపి 'ఒక్కక్షణం' అంటూ దిగి రోడ్డు అవతలివైపు ఉన్న కిల్లీకొట్టు దగ్గర సిగరెట్ పెట్టె కొనుక్కుని జేబులో ఉన్న ఒకే ఒక పదిరూపాయల నోటు ఇచ్చి, ఇటు తిరిగే సరికి గుండెలు దడదడలాడాయి. అక్కడ తన రిక్షా లేదు. కిల్లీ దుకాణం వాడు ఆశ్చర్యంగా 'మీరు రిక్షాలో వచ్చారా సార్!' అని అడిగాడు. పురుషోత్తం కంగారుగా అటూయిటూ పరుగెత్తాడు. కాని ఏమీ లాభంలేకపోయింది. అతడు హతాశుడైనాడు. రిక్షాలో ఉన్న తన చిన్న సూట్‌కేసులో వేలకొద్దీ రూపాయలు, కొన్ని చెక్కులు, కొన్ని డ్రాఫ్టులు, రెండు జతల బట్టలు, టవలు, ఇతర సామగ్రి మొత్తం పోయినట్టే.

కాస్సేపు ఆ పక్కనే ఒక ఇంటిమెట్లమీద కూర్చుండిపోయాడు. 'సిగిరెట్టు పెట్టెకోసం దిగడం ఎంత ప్రమాదం తెచ్చిపెట్టింది' అనుకుంటూ తల

పట్టుకున్నాడు. జేబులో కొన్ని రూపాయి, అర్ధరూపాయి నాణేలు మాత్రం మిగిలి ఉన్నాయి. తన ఊరికి వందలాది మైళ్లదూరంలో కేవలం కట్టుబట్టలతో, అవీ మాసి మట్టికొట్టుకుని ఉన్నాయి – నిలబడి వున్నాడు. తనస్థితికి తానే దిగులు పడుతూ చాలాసేపు నిశ్చలంగా కూర్చుండిపోయాడు. ఈ లోపల వీధిలో జనసంచారం పెరిగింది.

అతడు తేరుకుని లేచాడు. 'పోస్టాఫీసు ఎక్కడ?' అని విచారించాడు. వెళ్లి అది తెరిచేవరకు వేచి ఉండి తర్వాత తన ఆఫీసుకు ఒక టెలిగ్రాం ఇచ్చాడు. పోస్టుమాస్టరుకు తన స్థితి వివరించాడు. పోస్టాఫీసు అడ్రసే ఇచ్చాడు. ఆ తరువాత ఇవతలికి వచ్చి వెర్రివాడిలా నడవటం ప్రారంభించాడు. తనస్థితి తనకే వింత అనిపించింది. తిరిగితిరిగి నదిని చూశాడు. పెద్ద వంతెన చూశాడు. కొండ మెట్లెక్కి పైన ఆలయం చేరుకున్నాడు. అప్పటికే అక్కడ కొన్ని వందలమంది భక్తులు నదీ స్నానాలు ముగించుకుని దైవదర్శనార్థం క్యూలలో నిలబడి ఉన్నారు. పురుషోత్తం వెళ్లి క్యూలో నిలబడ్డాడు. క్యూ నెమ్మదినెమ్మదిగా కదులుతున్నది. అతడపుడు ప్రశాంతంగా ఉన్నాడు. మనసులో అలజడి ఏమీ లేదు.

'దైవదర్శనం చేసుకుని కిందికి వెళితే సరి... పోస్టాఫీసుకు డబ్బు వస్తుంది. టిక్కెట్టు కొని మళ్లీ రైల్లో పడితే సరి... అడంగుకు చేరుకోవచ్చు.' అనుకుంటున్నాడు కాని ఇపుడిపుడే అసలు చింత మొదలవుతున్నది. కడుపులో ఏదో అదృశ్యబాధ మొదలవుతున్నది. కాస్సేపాగితే ఆ బాధ తట్టుకోవడం కష్టం. క్యూలో ముందుకు సాగుతూ ఉండగా ఒకచోట మలుపులో ఎవరో అతన్ని ఆపి అతని ముఖంలోకి చూసి చేతిలో ఒక కాగితం ముక్క ఉంచారు. అదేమిటో కూడా పట్టించుకోకుండా అతడు దాన్ని చేతిలోనే ఉంచుకుని ముందుకు నడిచాడు. దైవదర్శనం చేసుకుని ఇవతలికి వస్తూ ఆ కాగితం ముక్కను నలిపి ఉండచుట్టి అవతల పారేశాడు. అంతలో ఒక వ్యక్తి దాన్ని తీసుకుని వచ్చి "ఏం భోజనం వొద్దా?" అని అడిగాడు. ఆ తర్వాత వివరించాడు. కాస్సేపాగితే అక్కడ భోజనం పెడతారు. 'నిరతాన్నదాన పథకం' క్రింద అక్కడ ప్రతిదినం ఆర్తులకు, దీనులకు, భిక్షుకులకు చక్కని భోజనం పెడతారు. ఎవరెవరో వదాన్యులు, దాతలు ఇచ్చిన ధనం పైన వచ్చే ఆదాయంతో వారు కోరిన రోజులలో అన్నదానం జరుగుతుంది. వారిపేర్లు ఏరోజుకారోజు బయట పెద్ద బోర్డుపైన వ్రాస్తారుకూడా.

పురుషోత్తం ఆ కాగితం అందుకుని జాగ్రత్తగా మడతలు విప్పి జేబులో ఉంచుకున్నాడు. అక్కడే కూర్చుండిపోయాడు చాలాసేపు. ఆ తర్వాత అక్కడి పెద్ద భోజనశాలలో సందడి మొదలైంది. పన్నెండు గంటలవేళ లోపల రకరకాల భోజనార్థులు చేరారు. పురుషోత్తంకూడా వెళ్లి ఒక చోట కూర్చున్నాడు. చక్కని భోజనం పెట్టారు. పురుషోత్తం భోజనం చేసి 'అన్నదాతా సుఖీభవ' అనుకుంటూ ఇవతలికి వచ్చాడు.

పక్కనే ఉన్న బోర్డుమీద పెద్ద అక్షరాలతో ఆనాటి భోజన దాతల పేరు వ్రాసి ఉంది.

పురుషోత్తం ఆ పేరు చదివి చలించిపోయాడు. కళ్లనీళ్లు ఉబికి వచ్చాయి. తర్వాత పోస్టాఫీసుకు డబ్బు వచ్చింది. అతడు రైలెక్కి అడంగుకు చేరుకున్నాడు.

ఇంతా చెప్పి అతడు ఆగి "అవును.. నాకప్పుడు కళ్లనీళ్లు ఉబికి వచ్చాయి" అన్నాడు.

శ్రోతలిద్దరూ ఆశ్చర్యపోయారు.

ముకుందరావు సన్నగా నవ్వి "తిన్నావు సరే... ఆ తర్వాత కళ్లవెంట నీళ్లు రావడం ఏమిటి?" అని అడిగాడు.

"అక్కడ బోర్డుమీద ఉన్న పేరు చూడగానే నిజంగానే కన్నీళ్లొచ్చాయి. ఆ పేరు నీదే... చక్కగా ఇంటిపేరుతో సహా నీపేరే అది. నీ పుట్టిన రోజు సందర్భంగా... మీ నాన్నగారు దాత... అక్కడ ఎల్లకాలం అన్నదానం జరుగుతూనే ఉంటుంది. ఎందరో తృప్తిగా ఆకలి తీర్చుకుని 'అన్నదాతా సుఖీభవ' అని కనబడని నిన్ను ఆశీర్వదిస్తూ వెళుతూ ఉంటారు..." అని ముగించాడు పురుషోత్తం.

ముకుందరావు చిత్రంగా చూసి "అలాగా" అని మాత్రం అన్నాడు. అతని కళ్లలో చిత్రమైన వెలుగు కనిపించింది.



# మరో వీధి పాప

గోడ మీది చిన్న అద్దం ముక్కలో తన ముఖం చూసుకున్నది కామాక్షి. చేతి గోళ్లతో వెంట్రుకలు సర్దుకున్నది. అంతలోనే అనవసరంగా పళ్లు బైటపెట్టి తన ప్రతిబింబాన్ని తనే వెక్కిరించింది. తరువాత రంగువెలిసిన పాత చీరె కుచ్చెళ్లను దులుపుకుని ఇవతలికి వచ్చింది. ఆ చీరెను కామాక్షి ఎప్పుడో తప్ప కట్టుకోదు. వీధి మొదట్లో ఉన్న కల్యాణ మండపంలో ఏదైనా పెళ్లికి వెళ్లినప్పుడూ లేక ఆ వీధిలోని ఏ యింటిలోనైనా ఏదైనా శుభకార్యం జరిగినప్పుడు మాత్రమే దాన్ని విరిగిపోయిన పాత చెక్కపెట్టలో నుంచి ఇవతలకి తీసి ధరిస్తుంది. ఆ చీరెకో చరిత్ర ఉంది. రెండుమూడు సంవత్సరాల క్రిందట ఎప్పుడో ఒకసారి వీధి చివర నది కట్టక్రింద ఉన్న సత్రంలో ఎక్కడివారో వచ్చి తమ వారెవరికో కర్మాంతరాలు నిర్వహించి వెళ్లే సందర్భంలో వారిలో ఎవరో వెళ్లిపోయేటప్పుడు అన్నీ సర్దుకుని 'ఇక ఇది ఎంతమాత్రమూ పనికిరాదు' అని ఒక మూలకు విసిరిపారేసిన బాపతు అది. అప్పుడు కామాక్షి ఆచుట్టుపక్కలనే అటూ యిటూ తిరుగుతూ ఉండి వారు వెళ్లిపోగానే ఆ రంగు వెలిసిన పాత చీరెను అత్యంత ఆప్యాయంగా తెచ్చి దాచి ఉంచుకున్నదిన్నాళ్లు.

ఆ వీధి మొదట్లో ఒక కల్యాణ మండపమూ, వీధి చివర నదికి ఖచ్చితంగా ఒడ్డునే ఉన్నా కర్మాంతరాలకోసం లేక అపర కర్మల నిమిత్తం ఒక సత్రమూ ఉండటం వల్ల కామక్షికి లాభమే. అటు యిటు ఏదో ఒక వైపు దాదాపు నెలలో మూడు వారాలపాటు తిండికి లోపం ఉండదు. కళ్యాణమండపానికి వెళ్లి పెళ్లి సందడిలో చొరబడినా, ఇటు సత్రంలో భోజనాల వేళకు ఆడవారి పంక్తిలో ఒక మూలకూర్చున్నా దాని మొహం చూసి 'పరాయి మనిషి' అని 'తమలో ఒకతె కాద'నీ తెలిసినా ఎవరూ అట్టే పట్టించుకునే వారు కారు ఎప్పుడో తప్ప. ఒక్కొక్కప్పుడు మాత్రం కామాక్షి దురదృష్టం కొద్దీ కొందరు దుష్టులు 'ఎవరీ అమ్మాయి?' అని ఆరాతీసి తరిమివేయడమూ కద్దు. అటువంటి సందర్భాలలో కామాక్షి ఏ మాత్రమూ జంకు గొంకు లేకుండా లేచి వచ్చేస్తుంది. అంతేతప్ప అన్నం పెట్టమని బతిమాలడం, ప్రాధేయపడటం వంటివి చేయదు. దర్జాగా లేచి వచ్చి నది కట్టపక్కనే ఉన్న తన గోనెసంచుల వసారాలో అభోజనంగానే పడుకుని ఉండిపోయేది కాసిని నీళ్లతో కడుపునింపుకుని. నీళ్లకు కరువు లేదు కదామరి! కామాక్షి వీధి పాప. దాన్ని ఎవరూ ఆదరించరు. కనీసం పలుకరించరు. మరి మిద్దె ఇంటి నరసింగయ్యగారికైతే కామాక్షిని చూస్తే ఎందుకో వొళ్లుమంట. అసలు అది ఎదురుపడితేనే వెంటబడి మరీ తరుముతాడు. ఆ పిల్ల ఆ పేట మొత్తానికే కాక నగరం మొత్తానికీ, ఆ మాట కొస్తే

దేశం మొత్తానికి పట్టిన శని అని ఆయన దృఢమైన అభిప్రాయం. ఆయన ఆ పిల్ల పుట్టు పుర్వోత్తరాలు తెలిసిన నలుగురైదుగురిలో ఒకడు. ఆ రహస్యం తెలిసిన వారిలో ఒక ముసలమ్మ మరో పెద్దాయనా ఇటీవలే పోయారు. అవతలి వీధిలో కమలమ్మ మాత్రం కామాక్షిని కాస్త దయతో సానుభూతితో చూస్తుంటుంది. తమ ఇంటికి అప్పుడప్పుడు రానిస్తుంది. తన పిల్లలతో కూర్చుని సాయంవేళల టీవీ చూడనిస్తుంది. ఎప్పుడన్నా కామాక్షి అటు వెడితే ప్రేమగానే పలుకరించి ఇంట్లో ఉన్నదేదో తినబెడుతుంది కూడా. అయితే కామాక్షి ఈ మధ్య కొద్ది రోజులుగా అటు వెళ్లడం తగ్గించింది. అటు వెళ్లడానికి భయపడుతున్నది కూడా.

ఇటీవల ఒకనాటి మధ్యాహ్నం - అప్పటికి కామాక్షి తిండితిని రెండు రోజులయింది - ఆకలితో కమలమ్మగారి యింటికి వెళితే ఆమె "పిచ్చికుంకా! అట్లా కడుపు మాడ్చుకోగూడదు. తిండి దొరక్కపోతే మాయింటికి రా.. " అంటూ విస్తరిలో ఇంత అన్నం తినబెట్టి అంతలోనే అనుమానపు చూపులతో కామాక్షిని గుచ్చిగుచ్చిచూస్తూ ఏమైందే నీకు? అని అడిగింది అకస్మాత్తుగా. కామాక్షి భయంభయంగా కళ్లు పెద్దవి చేసి చూసిందే తప్ప బదులు పలకలేదు.

కమలమ్మకు అనుమానం వచ్చింది. "ఈ పిల్లకుంకేమీ కాలేదు కదా! చూడబోతే ఏదో జరిగినట్టే ఉంది" అనుకుంది కూడా.

కామాక్షి ముఖంలో ఆ పెద్ద పెద్ద తెల్లని కళ్లు తప్ప మిగిలినవన్నీ - ముక్కు చెవులు నోరు అన్నీ - ఎవరెవరివో ఎక్కడెక్కడివో తెచ్చి అతికించినట్టు ఉంటాయి. సృష్టికర్త చాలా ఆకృతులు తయారుచేసి చివరకు మిగిలిపోయిన ముక్కు నోరు చెవులూ ఊరికేపారేయడం ఎందుకులే అని అతికించి జీవంపోసినట్టు... చిత్రంగా ఉంటాయి. మాట సంగతి సరేసరి.. నంగి నంగిగా... దాదాపు పధ్నాలుగు పదిహేను సంవత్సరాల క్రిందట ఎప్పుడో ఒకనాడు నదీ తీరంలో ఎవడో బిచ్చగాడు వేసుకున్న గోనె సంచీల వసారాలోనుంచి పసిపిల్ల ఏడుపువినిపించి నదీ స్నానానికి వచ్చిన నలుగురైదుగురు తలలు తిప్పిచూశారే తప్ప ఎవరూ పట్టించుకున్న పాపాన పోలేదు. ఆ పసిగుడ్డు ఆయుష్షు గట్టిది కావడం వల్ల అది చావలేదు. కదిలింది. కాళ్లు చేతులు కొట్టుకుంది. పొర్లింది. దొర్లింది. దొరికింది తిన్నది. పాకింది. తర్వాత అడుగులు వేసింది. అక్కడా ఇక్కడా తిని పెరిగింది. ఒకప్పుడెప్పుడో పక్క వీధిలోని వీధిబడి గోడ పక్కన నిలబడి లోపలకి తొంగిచూసి అంతలోనే 'అమ్మో' అనుకున్నది. మళ్లీ అటు పోనే లేదు. దానికి కామాక్షి అనే పేరు వేరెవరో పెట్టలేదు. అదే పెట్టుకుంది. వీధిచివరి కళ్యాణమండపంలో ఒక పెళ్లి సందర్భంగా దాని అనాకారాన్ని చూసి ఎవరో ముచ్చటపడి 'నీపేరేమిటే?' అని అడిగితే అది ఉన్నట్టుండి 'కామాక్షి' అని చెప్పేసింది. అప్పటి నుంచీ అది ఆ పేరుతోనే ఆ నాలుగు వీధులలో ప్రసిద్ధికెక్కింది. ఆ పేట దాటితే ఏముందో ఆ పిల్లకు తెలియనే తెలియదు.

ఆ చిన్న గోనె సంచుల వసారా జోలికి ఎవరూ వెళ్లరు. కట్ట ఎక్కి పైకి వెళితే కళ్లముందు మహానది... అపార జలరాశి... ఒక వైపు రైలు వంతెన... మరోవైపు దూరంగా నది మీద రోడ్డు బ్రిడ్జి....

కామాక్షి తెలతెలవారుతూ ఉండగానే లేచి వెళ్లి నదిలో మునకలు వేసి వస్తుంది. ఆ నది కొన్నాళ్ళు శుష్కించి కృశించిపోయి ఉంటుంది. మరికొన్నాళ్లు భీకరఘోష పెడుతూ ఉరుకులు పరుగులతో భయంకరంగా ప్రవహిస్తుంది.

కామాక్షికి శత్రువు ఒకడున్నాడు. వాడొక పురోహితుడి కొడుకు. పరమ దండగ మారి బ్రతుకువాడిది. వొట్టి భటాచోరుగాడు. వాడొకసారి వెకిలిగా నవ్వుతూ నది గట్టుమీద కూర్చుని ఉన్న కామాక్షి చెయ్యి పట్టుకున్నాడు. అప్పుడా పిల్ల ఏమీ అనలేదు. దాంతో వాడు కొంచెం ముందుకు జరిగాడు. గుండెల మీద చెయ్యి వేయబోయాడు. కామాక్షికి అప్పుడు వొళ్లు జలదరించింది. పాము వంటిదేదో గుండెల మీద పడబోతున్నట్టనిపించి విసిరికొట్టి లేచి వెళ్లిపోయింది. వాడెప్పుడయినా ఎదురుపడితే మాత్రం కామాక్షికి కడుపులో దేవినట్టయి తన వికారపు ముఖాన్ని మరింత వికృతంగా చేసుకుని తప్పుకుని వెళ్లిపోయేది. వాడు ఏమనుకున్నాడో ఏమో దాని జోలికెన్నడు రాలేదు మళ్లీ.

ఇప్పుడు కామాక్షికి తనలో వస్తున్న మార్పేదో తెలియడం మొదలైంది. కమలమ్మ ప్రశ్నలువిన్నప్పటి నుంచీ దాని మనసులో దిగులు, భయం, ఆందోళన ముప్పిరిగొన్నాయి. రోజులు గడిచేకొద్దీ వొళ్లు బరువెక్కుతున్నట్టు అనిపించింది. ఏమీ తినబుద్ధి అయ్యేది కాదు. ఎప్పుడైనా కక్కుర్తిపడి కాస్త ఎంగిలి పడినా వెంటనే వాంతి వచ్చి అంతా వెళ్లిపోయేది.

ఇప్పుడు గంటల తరబడి నది ఒడ్డున ఒంటరిగా కూర్చుంటుంది. ఎదురుగా రంగులు కమ్మిన ఆకాశం వంక, ఎగిరే పక్షుల వంక, దూరంగా కొండల వంక చూస్తూ ఉండిపోయేది. క్రమంగా రోజులు గడిచేకొద్దీ తిరుగుడు తగ్గించింది. నలుగురి కళ్లలో పడకుండా తనలోతనే ముడుచుకుని తిరిగే నల్లత్రాచు వలె జనదృష్టిని తప్పించుకుని తిరిగేది.

ఏదో అనుమానం... ఒకనాడెప్పుడో... అర్ధరాత్రివేళ... జోరుగా వర్షం పడుతుండగా తాను గాఢ నిద్రలో ఉండగా పైన ఏదో బరువు... మెత్తని బరువు... తాను తోసివేయలేదు... చలికి వొణుకుతూ మూలిగింది... అంతే ఏం జరిగిందో తెలియనే లేదు. తర్వాత పై నుంచి వర్షం చినుకులు పడి మెలకువ వచ్చింది. ఎందుకో అసహ్యం అనిపించి గబగబ వెళ్లి నదిలో మునిగి ఇవతలికి వచ్చింది. ఇదంతా బహుశా ఏదో కలవంటిది అయి ఉంటుందనుకున్నదంతే...

ఇప్పుడిక కామాక్షి పగలంతా కూడా కదలడం లేదెక్కడికీ. ఎప్పుడు లేచి ఎక్కడ ఏమి తింటుందో ఎవరికీ తెలియదు. 'ఈ వెర్రిపిల్ల ఏమయిందో' అని కమలమ్మ ఆరా తీయడానికి ప్రయత్నిస్తే రెండు పర్యాయాలు ఫలించలేదు.

కామాక్షి రోజులు గడిచే కొద్దీ ఆకలిని జయించింది. చలిని జయించింది. ఎండావానలను జయించింది. శారీరక బాధలను జయించింది. నిశ్చలంగా ఎదురుగా ఉన్న శూన్యాన్ని చూస్తూ గడపడం ప్రారంభించింది.. రాత్రి వేళల నది గట్టుమీద కూలబడి గంటలకొద్దీ తపస్సు చేస్తున్న దానివలె గడిపింది.

ఆనాడు సాయంకాలం లోలోపల ఏదో కదలిక... సన్నగా కోస్తున్నట్టు... చాలా సేపు చిన్న చిన్న పొదల మధ్య కూర్చుని నదిని చూసింది ఎక్కడో దూరతీరాల నుంచి వచ్చే పెను ధ్వని తనకు తప్ప ఇతరులెవరికీ వినిపించడంలేదని అనుకున్నది. ఆ తర్వాత చిన్న కొవ్వొత్తి వెలుగులో ముందు ముడుచుకుని పడుకుంది. తర్వాత రాత్రి గడిచేకొద్దీ కాళ్లు బారజాపి పడుకుంది. రాత్రి పొద్దుపోయే వరకు బాధ అంతా భరించింది. కేకలు పెట్టలేదు. మూలుగులు పైకి వినబడనివ్వలేదు. నిశ్శబ్దంగా వేదనను ప్రకృతి పెడుతున్న హింసను ఒంటరిగా సహించింది. చాలాసేపు అలా బాధపడ్డ తర్వాత ఏళ్ల క్రిందట తాను ఒక తల్లి కడుపులో నుంచి బైటపడ్డట్టు- ఇప్పుడు తన కడుపులో నుంచి మరొక పిల్ల కటిక నేలమీద పడింది. పడిన తర్వాత పదిపదిహేను సెకండ్లు గడిచాక కీచుమని ఏడ్చింది. కామాక్షి కాళ్లు వొణుకుతుండగా లేచింది. అప్పటికప్పుడు 'అంతా మహా అసహ్యం' అనిపించి స్నానం చేయాలనుకుంది. తడబడుతున్న అడుగులతో కట్ట దిగింది. తన అంచనా ప్రకారం లోపల కొంత దూరం కేవలం ఇసుక ఉండాలి. కాని ఇప్పుడామె అంచనా తప్పింది. మెట్ల క్రిందనే నీళ్లు చల్లగా తగిలాయి. ఆ తర్వాత రెండుమూడు అడుగులు వేసేసరికే నీళ్లు పాముల గుంపువలె ఆమెను గుండెలదాకా బంధించాయి. ఆమె జారిపోయి తేలిపోయి నీళ్లలో కలిసిపోయింది.

తర్వాత చాలాసేపటికి తెలతెలవారుతుండగా గట్టు క్రింద గోనె సంచుల వసారాలో కటిక నేలమీద మరో కామాక్షి - మరో వీధి పాప - రోదిస్తూ ఉండగా కొందరెవరెవరో విన్నారు. విని ఎవరి త్రోవన వారు వెళ్లిపోయారు.

# ఒక ఫోటో కథ

**మా** రఘు బాధపడలేక 'సరే' అన్నానే కానీ, నాకు వరహాలరావును కలుసుకోవడం ఏ మాత్రం ఇష్టం లేదు. అంతమాత్రంతో వరహాలరావు ఒకటోరకం హంతకుడో, పాపాత్ముడో, దగుల్బాజీయో అనుకునేరు. అలాంటిదేమీ లేదు. అతడొక మోస్తరు రచయిత.

ఒక మోస్తరు రచయిత అనడంలో నా ఉద్దేశం ఏమిటంటే ఏదో రాస్తూ ఉంటాడంతే అని. మామూలు పాఠకులకు చక్కిలిగింతలు పెట్టేవీ, భయభ్రాంతులకు లోనుచేసేవీ, వాస్తవజీవితాన్ని మరిపింపజేసి కలల్లో తేలియాడించేసేవీ రచనలు చేస్తూ వుంటాడు. ఒక ప్రయోజనం ఆశించిగానీ లేక పాఠకుణ్ని ఆలోచింపజేద్దామనిగానీ, ఉత్తేజితుణ్ని చేద్దామని గానీ అతడు ప్రయత్నించడు. ఆ మాట అతడు ఒప్పుకుంటాడు కూడా. "సామాజిక స్పృహవంటి మాటలన్నీ రబ్బిష్!" అని పబ్లిగ్గానే అంటూ ఉంటాడు. అలాంటి రచయితలను ఎగతాళి చేస్తూ ఉంటాడు. తన ధోరణిలో చాలా రాశాడు కూడా.

ఇంతకూ మా రఘు కోరిక ఏమిటో చెప్పలేదు కదూ! ఏమీ లేదు, రచయిత వరహాలరావును ఒక్కసారి దర్శించుకుని వీలైతే నాలుగు మాటలు మాట్లాడాలని. అంతకుమించి మరేమీ లేదు.

రఘు నాకు మేనల్లుడయినా మేమిద్దరం కొంచెం అటూఇటూగా సమవయస్కులమనే చెప్పాలి. మహాఅయితే నేను రెండు మూడేళ్లు పెద్దవాణ్నేమో. పెళ్లికాగానే మా పెద్దవాళ్ల భాషలో వాడు దేశం కాని దేశానికి, అంటే మరేమిటో కాదు, ఎక్కడో ఉత్తరాదిన మరో రాష్ట్రానికి ఉద్యోగం నిమిత్తం వెళ్లిపోయాడు. ఇటీవలే బదిలీ అయి ఇక్కడికొచ్చి 'హమ్మయ్య! మనవాళ్ల మధ్యకు వచ్చిపడ్డాము!' అనుకుంటున్నారు భార్యభర్తలిద్దరూ. మా ఇంటికి దగ్గరలోనే ఇల్లు.... తరచుగా రాకపోకలు....

"సరే"

'సరే' అన్న తర్వాత తప్పదు కాబట్టి మరుసటిరోజు సాయంకాలం వరహాలరావుకు ఫోను చేశాను. అదృష్టం బాగుండి దొరికాడు మహానుభావుడు.

"ఎన్నాళ్లకెన్నాళ్లకు! ఏమిటి సంగతులు?" అని అడిగాడు.

"ఏమీ లేదు, మీరు పేరున్న బిజీ రచయితలు కదా! మాటిమాటికీ దాడిచేసి మిమ్మల్ని బాధపెట్టడం ఎందుకని నా బాధ! అంతకంటే మరేమే లేదు! ఇప్పుడు తప్పడం లేదు. మావాడొకడు వరసకు మేనల్లుడు, నా యీడువాడే, ఇన్నేళ్లుగా ఎక్కడో ఉత్తరాదిలో ఉద్యోగంలో ఉండి ఉద్ధరించి ఇప్పుడికి దక్షిణాదిని

ఉద్ధరించేందుకు ఇక్కడికి బదిలీ అయివచ్చాడు. మంచి పాఠకుడులెండి! మీ అభిమాని అనుకుంటాను. వాడికి మిమ్మల్ని చూడాలని అభిలాష!" అంటున్నాను.

"అయ్యో! దానికేం? నిక్షేపంగా రండి!" అన్నాడాయన.

"అయితే వొస్తున్నామిప్పుడే!" అని ఫోను పెట్టేశాను.

మావాడు హుషారుగా లేచాడు. ఇద్దరం రోడ్డుమీదకి వచ్చి ఆటోలో రచయితగారి ఇంటికి బయల్దేరాము. దోవపొడుగునా రఘు ఏదో వాగుతూనే ఉన్నాడు. బహుదూరం ఆ ఇల్లు. అరగంట పట్టింది. వెళ్లేసరికి ఆయన లోపల ఎక్కడో ఉన్నట్టున్నాడు. కాలింగ్‌బెల్ నొక్కి నిలబడ్డాము. లోపలినుంచి ఒక వృద్ధమహిళ కంఠస్వరం వినిపించింది సన్నగా-

"దేవుడా! నన్నెప్పుడు తీసుకుపోతావా అని ఏడుస్తున్నాను!" అంటున్నారెవరో.

"అలాగే....! తొందరగా పోతే పీడ వదిలిపోతుంది!" అని మరో కంఠస్వరం స్పష్టంగానే వినిపించింది.

వరహాలరావు తలుపు తీసి నవ్వుతూ, "రండి రండి!" అంటూ లోపలికి దారితీశాడు. ఒడ్డూ పొడుగూ మనిషి... ఒక కాలు కాస్త అవుడు. ఎత్తి ఎత్తి అడుగులు వేస్తున్నాడు.

"కూర్చోండి!" అని చెప్పి, అక్కడ మూల బల్లమీద ఉన్న ఒక పెద్ద ఫొటోఆల్బమ్ తీసి మా ముందు టీపాయ్‌మీద ఉంచి లోపలికి వెళ్లాడు.

చుట్టూ అలమారులలో చాలా పుస్తకాలు ఉన్నాయి. మావాడు ఆల్బమ్‌ను చేతిలోకి తీసుకుని తిరగవేయడం ప్రారంభించాడు. అందులో అన్నీ రచయితగారు ఉపన్యసిస్తున్న ఫోటోలు. కొన్ని దండలతో నవ్వుతూ.... రకరకాల సందర్భాల ఫోటోలు....

అంతలో లోపలనుంచి వరహాలరావు భార్య కాబోలు, బాగా ముస్తాబై హేండ్‌బాగ్ ఊపుకుంటూ విసురుగా వచ్చి, "వెళ్తున్నాను నేను!" అని పెద్దగా అంటూ బయటకు వెళ్లిపోయింది. వరహాలరావు లోపలనుంచి వచ్చాడు. ఇప్పుడు మనిషి ఫ్రెష్‌గా ఉన్నాడు. మా ముందు కూర్చుంటూ అనవసరంగా నవ్వాడు. నేను మావాణ్ని పరిచయం చేశాను.

రఘు ఫోటో ఆల్బమ్ తిరగేస్తున్నవాడల్లా ఒకచోట ఆగి, నా వంక చూసి ఒక ఫొటో దగ్గర వేలుపెట్టి చూపించాడు. ఒక అందమైన యువతి ఫొటో అది....

వరహాలరావు అంతలో లేచి మా వెనక్కువచ్చి తానూ ఆ ఫొటో చూసి ఒకరకంగా నవ్వుతూ "ఆ ఫొటో...." అంటూ ఆగిపోయాడు.

ఆ తర్వాత అతనిలో మార్పు వచ్చినట్టనిపించింది. ముందు నిట్టూర్చాడు. తర్వాత అనవసరంగా కళ్లజోడు తీసి ముఖం తుడుచుకుని మళ్లీ తగిలించుకున్నాడు. మళ్లీ నిట్టూరుస్తూ కుర్చీలో కూలబడ్డాడు.

"ఏమిటి విశేషం? అలా అయిపోయారేమిటి?" అని అడిగాను నేను.

"ఏం చెప్పను?" అని మొదలు పెట్టాడు.

"జీవితంలో ఒక్కొక్కప్పుడు ఏం పోగొట్టుకుంటామో తెలియదు. చాలా విలువైనవి మనవి కాకుండా పోతుంటాయి. మనం కోరుకోనివీ, ఇష్టపడనివీ వొచ్చి మీద పడుతూ ఉంటాయి!" అన్నాడు ముందుగా.

"రచయిత భాష మాట్లాడుతున్నారు!"అన్నాను నేను.

మావాడు ఉత్కంఠతో చూస్తూ వింటూ కూర్చున్నాడు.

వరహాలరావు మళ్లీ దీర్ఘంగా విట్టూర్చాడు. ఆ తర్వాత ఎందుకో పైకి చూశాడు. ఆ పైన ఊరికే కళ్లు తుడుచుకుని అదొకరకంగా నీరసంగా "మీకు కాసిని కాఫీ ఇద్దామన్నా మా ఆవిడ ఇంట్లో లేకుండా పోయింది. చూడండి!" అన్నాడు.

నేను "ఫరవాలేదులెండి, కాఫీలూ గట్రా అక్కర్లేదు! ముందు మీరు స్థిమితపడండి!" అన్నను.

వరహాలరావు పారమార్థకపు నవ్వు ఒకటి విసిరి, "అంతే .... జీవితం అంటే అంతే! ప్రతివాడూ ఏవో కలలు కంటాడు. చిన్నతనంలో అయితే వేరు. ఏదో కావాలని ఏడిస్తే పెద్దవాళ్లు కొని ఇస్తారు. బూర కావాలన్నా, బూందీ కావాలన్నా, ఐస్‌క్రీమ్ కావాలన్నా ఏడిస్తే చాలు వొచ్చి పడుతుందని అనుకుంటాం. కొంచెం గడిచాక తెలుస్తుంది అసలు విషయం - డబ్బు అనే పదార్థం ఉందనీ , అదే అసలు సిసలు పదార్థమనీ అది లేకపోతే ఏమీ రాదనీ, అది లేకపోతే అంతా హుళక్కి అనీ తెలిసొస్తుంది. మనం ఏదో కావాలనుకుంటాము. కానీ మరేదో అయిపోతాము. నన్నే తీసుకోండి, నేను చిన్నప్పుడు డాక్టరు కావాలనుకున్నాను. కానీ బొత్తిగా వీల్లేకపోయింది. బి.ఏ. పూర్తి చేసి ఇలా గుమస్తాగా మిగిలిపోయాను. ప్రేమించిన పిల్లను చేసుకోవాలనుకున్నాను. అస్సలు వీలులేకపోయింది. విధిగాడు చాలా క్రూరుడు. చిన్నచూపు చూశాడు!" అంటూ చెప్పుకుపోతున్నాడు.

"గుమస్తా ఉద్యోగమైనా మీకేం తక్కువ? మంచి సీటు.... మీరు వద్దన్నా బలవంతం చేసి ప్రతివాళ్లూ ఏదో కొంత ముట్టచెపుతూనే ఉంటారు కదా! మొన్నటికి మొన్న 'మా తమ్ముడి పని బాబూ, ఇది!' అని నేను వస్తే మీరు ఎంతో మంచి మనసుతో చేసిపెడితే మావాడు మీరు వద్దంటున్నా వినకుండా దాదాపు బలాత్కారం చేసి మీ జేబులో అయిదు వందలు రూపాయల నోటు కుక్కడం గమనించలేదనుకున్నారా? మీరేమో 'ఎంత పనిచేశారండీ!' అని ఎంతగా నొచ్చుకున్నారు? అదిగాక చక్కగా ఆఫీసునుంచి ఇంటికి రాగనే మాలాగా బలాదూర్లు తిరగకుండా ఎంతో ఓపికగా కాగితాలు ముందు వేసుకొని కూర్చుని కథలు, నవలలు పుష్కలంగా రాసి పారేస్తున్నారు. పత్రికలవాళ్లు ఊరికే వేసుకోరు కదా! వాళ్లూ గట్టి మొత్తాలే ఇస్తున్నారీ మధ్య! మీకేం తక్కువ? " అన్నాను నేను.

వరహాలరావు చేతులు నలుపుకుంటూ– "అదంతా వేరు స్వామీ! ఇవన్నీ ఆనందాన్ని ఇవ్వవు. మనం కోరుకున్నది లభిస్తే అదే అసలు సుఖం జీవితంలో అది లేకపోయిన తర్వాత జీవితంలో అంతా శూన్యమే కదా!" అన్నాడు.

"అది సరేలెండి. ఈ డబ్బు శాశ్వతం కాదు. నిజమే! ఆనందాన్నివ్వదు. అదీ నిజమే! మహామహా సామ్రాజ్యాలే పోయాయి! రాచరికాలే పోయాయి. ఇహ పేర్లూ, కీర్తి ప్రతిష్ఠలూ అంటారా! ఎవరూ వాల్మీకీ, కాళిదాసులూ కాజాలరు కాదా! అది వొదిలెయ్యండి! ఈ ఫోటో గురించి చెప్పండి!" అన్నాను నేను వరహాలరావు ధోరణి మార్చే ప్రయత్నం చేస్తూ.

వరహాలరావు కుర్చీలో వెనక్కు వాలి మొదలుపెట్టాడు, "మీకెప్పుడూ చెప్పలేదు...." అంటూ.

అవును. ఈ ఉదంతం అతడు నాకెప్పుడూ చెప్పలేదు. అసలు ఎవరికైనా చెప్పాడో , లేదో కూడా తెలియదు.

అది అతని కాలేజీరోజులనాటి సంగతి. బి,ఏ. చివరి సంవత్సరంలో ఉండగా అతడు ప్రేమలో పడ్డాడు. ఆ అమ్మాయి పేరు లలిత. అందగత్తె మాత్రమే కాదు, చదువుల సరస్వతి కూడా. బుద్ధిమంతురాలు. ఇంట్లో బయల్దేరేటప్పుడు వంచిన తల మళ్లీ పైకెత్తేది క్లాసురూములో లెక్చరరుగారి ముందే. అలాంటి లలితను మహాగాఢంగా ప్రేమించాడు వరహాలరావు. సరే. ప్రేమపొంగు ఎన్నాళ్లో అణిచివుంచలేడు కదా! ఏదో సమయంలో అది పైకి పొంగింది. ఆశ్చర్యం. ఏమిటంటే ఆ అమ్మాయి కూడా అతన్ని అంత గాఢంగా ప్రేమిస్తున్నదిట! ఇకనేం.... ఇద్దరూ తమతమ పెద్దలకు చెప్పి ఒకటై జీవనయానం సాగిద్దామనుకున్నారుట. కులమూ మతమూ, గోత్రమూ వగైరా బాధలు కూడా ఏమీ లేవు. ఏవీ అడ్డం రాలేదు. ఆ అమ్మాయి అన్నయ్య వీరి ప్రేమ విషయం ముందే కనుక్కుని 'మా చెల్లాయి ఎంత అదృష్టవంతురాలు! ఇంత అదృష్టవంతురాలు భూమ్మీద ఉండద'ని నిర్ణయించుకుని, 'మీకెందుకు? నేను మాట్లాడతాను పెద్దవాళ్లతో! కట్నాలు కానుకలు వగైరా ఏమీ అడ్డురాకుండా చూస్తాను!' అని పంచభూతాల సాక్షిగా పార్కులో శపథం కూడా చేశాట్ట.

ఇంతవరకు చెప్పి వరహాలరావు లేచి వెళ్లి తలుపు తీశాడు. అతని కూతురు అయివుంటుంది. ఒక ఆరేడేళ్ల నల్లని పిల్ల. ఆకుపచ్చ పసుపుపచ్చ బట్టల కాంబినేషన్‌తో చిత్రంగా బొమ్మలా కులుకుతూ "హాయ్ డాడ్!" అంటూ వరహాలరావును పలకరించి లోపలికి వెళ్లింది. వరహాలరావు మళ్లీ కుర్చీలో కూర్చుని సెటిలై ఈ సారి కథ తొందరగానే ముగించాడు.

"అప్పుడు విధి మమ్మల్ని వంచించింది!" అని మొదలుపెట్టాడు. "దేవుడు క్రూరాతిక్రూరంగా మమ్మల్ని, అమాయకపు ప్రేమికుల జంటను ఏ నేరమూ లేకుండా శిక్షించాడు. మా ప్రేమను మంటకలిపాడు. లలిత కాన్సరు వ్యాధితో తీసుకుని తీసుకుని క్రుంగి కృశించిపోయి రెండు నెలలు వ్యవధిలో కళ్లుమూసింది".

నేను అదిరిపడ్డాను. గుండెల్లో ఎక్కడో కలుక్కుమన్నట్టయింది. ఆ ఫొటో కథ ఇలా దారుణంగా ముగుస్తుందని ఎవరు మాత్రం ఊహించగలరు చెప్పండి? వినరాని కథ ఏదో విన్నట్టు చదవరాని దారుణ వృత్తాంతం ఏదో చదివినట్టూ అనిపించింది.

సున్నితమైన కరుణరస సూత్రం తెగిపోయి, రసాభాస అయిన ఏదో వికృత రచన చదివినట్టు అనిపించింది.

"సారీ!" అని మాత్రం అన్నను.

వరహాలరావు "నెవర్ మైండ్" అంటూ లోపలికి వెళ్లాడు.

రఘు మాత్రం అప్పటిదాకా కుర్చీలో కాళ్లు జాపుకుని కూర్చున్న వాడల్లా ఇప్పుడు సర్దుకుని కూర్చుని ఆ ఫొటో అల్బమ్‌ను పుస్తకాల రాక్‌లోకి నెట్టేశాడు.

నేను వాడివంక తిరిగి "చాలా బాధగా ఉందిరా!" అన్నాను. వాడేమీ మాట్లాడలేదు. వరహాలరావు అంతలో ట్రేలో గ్లాసులతో ఏదో డ్రింక్ తెచ్చి అందించాడు.

"మీ జీవితంలో ఇంత విషాదం దాగి ఉందని ఎన్నడూ అనుకోలేదు సుమండీ!" అన్నాను నేను.

వరహాలరావు విరక్తిగా నవ్వుతూ, "ముందే చెప్పానుగా నేను. జీవితం అంటే అంతే ! కోరుకున్నదేదీ అందదు అందినవేవీ బాగుండవు! అన్నాడు.

"సరే!" అని లేచాను నేను "మళ్లీ కలుద్దాం!" అంటూ కదిలాను. రఘు కూడా బయలుదేరాడు.

వరహాలరావు నమస్కారం చేసి "ఉంటాను!" అన్నాడు. చాలా దూరం నడిచాము నిశ్శబ్దంగా.

"మామయ్యా! ఆటో మాట్టాదనా? ఆ కథ విని చాలా నీరసపడినట్టున్నావు పాపం!" అన్నాడు వాడు.

"అలాగే!" అన్నాను నేను.

ఆటో వెళ్తున్నది. మావాడు అంతలో నన్ను మోచేత్తో పొడిచి "ఇటు చూడు!" అన్నాడు వాడి చేతిలో ఆ ఫొటో!

" నేను గాభారా పడుతూ "అరె! ఇదెందుకు తెచ్చావురా?" అని అరిచినంత పని చేశాను

మావాడు నవ్వాడు "భయపడకు, భయపడకు!" అన్నాడు

ఎందుకు తెచ్చానంటే ఇది నా భార్య ... అంటే అక్షరాలా నా సహధర్మచారిణి లత ఫొటో కాబట్టి! ఇది వరహాలరావు వంటి దగుల్బాజీ, మాయలమారి కథలు చెప్పేవాడి దగ్గర ఉండకూడదు కాబట్టి!"

"అంటే.....?" అన్నాను నేను.

"నువ్వు మా లతను పెళ్లిలో సరిగా చూడలేదు. తర్వాత మేము ఎటెటో వెళ్లిపోయాము. ఇన్నాళ్లకు ఇక్కడికొచ్చిపడ్డాము. లత పెళ్లియిన కొత్తల్లోనే చెప్పింది-తన పెళ్లి ఈ రచయితగాడితో జరిగి ఉండేదనీ. ఫోటో జాతకం వగైరాలు పంపమంటే పంపామనీ, కట్నం దగ్గర పేచీ వచ్చి వీళ్ళు వెనక్కి తగ్గిపోయారనీ, జాతకం ఒక్కటీ తిప్పిపంపి ఫోటో ఉంచేసుకున్నాడనీ వివరాలన్నీ చెప్పింది, ఈ ఫోటో

ఆల్బమ్‌లో ఉంచుకుని వీడు అడగని వాడిది పాపమన్నట్టు చెప్పిన కథ చెప్పకుండా చెప్పుకొస్తున్నాడన్నమాట!" అన్నాడు రఘు.

నేను ఆశ్చర్యంతో తల్లకిందులైపోయాను. "మరి అతగాడు ఎప్పుడైనా అడిగతే?"

"ఏముందీ? అసలు విషయం చెప్పేయ్! నోరు మూసుకుంటాడు. ఇప్పుడు చెప్పు. ఈ ఫోటో ఎక్కడుండాలి? వాడి ఆల్బమ్‌లోనా నా పర్సులోనా?" అని అడిగాడు మళ్లీ

నేను నవ్వాను "నీ పర్సులోనే!" అన్నాను.

ఆటో సాగిపోతున్నది.

